అపరాధ పరిశోధన అనుబంధం—105

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## సితార న్యాయం

రచన : ఇమంది రామారావు

## అర్థ రాత్రి

రచన : టెంపోరావు

## ఎంతో మంచి హంతకుడు

రచన : వసుంధర

## నడిచిన పాదాలు నాలుగు

రచన : సికిందర్

అపరాధ పరిశోధన సప్లిమెంట్ – 105
సెప్టెంబర్, 1982
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్‌రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# సితార న్యాయం

## ఇమంది రామారావు

అప్పుడే ఎ.వి.యం. స్టూడియోలో షూటింగు పూర్తిచేసు
కుని వచ్చింది సుజాత. కోకోనట్ ఆయిలు మొహానికి
రుద్దుకుంది. టవల్‌తో మొహం తుడుచుకుంది. బాత్
రూంకెళ్ళి రిఫ్రెష్ అయి వచ్చింది. అల్ట్రా మాడర్న్
మాక్సీ తొడుక్కుంది. అద్దంలో తన రూపం తననే
వెక్కిరిస్తున్నట్టు కనిపించింది. ఏడవలేక నవ్వుకుంది.

టెలిఫోన్ మోగింది. ఫోన్ అందుకుంది.

"హలో స్పీకింగ్!" అంది.

"మాది విశాఖపట్నమండీ. మీ ఫేన్సుమండి" అవతలి
కంఠంలో కొండంత ఆనందం కొట్టొచ్చినపుడు తొమ్మిది
గంటల ప్రాంతం గమనించకుండా కనిపించింది. విషయం
చెప్పకుండా తడబడుతుంది అభిమాని గొంతు.

"ఏమిటి విషయం చెప్పండీ!" సుజాత చిరాకుపడింది.

"మీరు నటించిన సుగుణ రిలీజయ్యింది కదండీ. ఫస్టు
షో అంటే.... ప్రొద్దుటాటండీ. టాక్ అదిరిపోయిందండీ.

మాట్ని అదరటోండీ. యిదిగో యిపుడిపుడే నైట్ షో ఇంటర్వెల్ అయిందండీ. టాక్ కనుక్కున్నామండీ రెండొందలరోజులు గ్యారంటీ అండీ—హిహిహి" ప్లస్ ఆయాసం ధ్వనించింది అవతలి గొంతులో. సుజాత కూడా నవ్వింది.

"మేం మద్రాసులో కలవాలనుకుంటున్నామండీ— ఎప్పుడుంటారు? అంటే చాలా ముఖ్యమైన విషయాలు మాట్లాడాలండీ—పర్సనల న్న మాట—యెప్పుడు రమ్మంటారు?" ఆదుర్దాగా అడిగింది అభిమాని గొంతు.

"మీ యిష్టం! ఔట్డోర్ గా మద్రాసులో వుంటాను. ఎపుడయినా కలవండీ — నాకింకో ముఖ్యమైన పనుంది ఫోను పెట్టేస్తున్నానేం?" ఫోనులో రిక్వెస్టుచేస్తున్నట్టుగా అడిగింది. అవతలి గొంతు నవ్వింది తీయగా.

"క్లైమాక్సులో మీ యాక్షన్....అబ్బో... థియేటర్ అదిరిపోయిందనుకోండి."

"థాంక్స్!"

"ఈ సంవత్సరం మీకు నేషనల్ అవార్డు రావడం ఖాయం!"

"థాంక్స్!"

"ఈ పిక్చరు మీ జీవితంలో ఓ క్రోసురాయి అవుతుందని మా నమ్మకం!"

"థాంక్స్!"

"ఈ వారంలో మిమ్మల్ని కలుస్తామండీ—"

"థాంక్స్!"

"అదేమిటండీ — అన్నిటికీ థాంక్స్ చెప్పి తప్పించుకుంటున్నారు — ఎక్స్ టెన్షన్ ప్లీజ్" అన్నాడు ఫోనులో అవతలి వ్యక్తి.

## 5

సుజాత యిక భరించలేక ఫోను పెట్టేసింది. అబ్బా! అభిమానం ఎంత భయంకరంగా వుంటుంది? ఒక్క క్షణం తన జీవితం గురించి ఆలోచించకుండా వుండలేక పోయింది. మళ్ళీ ఫోను మోగింది.

"హలో స్పీకింగ్!"

"సుజాతగారూ! మీ కేవిటి ఇష్టమండీ—చాలా యిష్టమైంది ఏవిటో చెప్పండి. వచ్చినపుడు తీసుకొస్తాను!" అన్నాడు విశాఖపట్నం అభిమాని.

"రవ్వల నెక్లెస్ యిష్టం!" అంటూ చిరాగ్గా ఫోను పెట్టేసింది.

మళ్ళీ ఫోను రింగవుతోంది—

"హలో...." అసహనంగా పలకరించింది.

"నేను బాబుని!" తీయగా అన్నాడు. బాబు పెద్ద సినిమా స్టార్. స్టార్ అని ఎందుకనవల్సి వచ్చిందంటే, అతనిలో టాలెంట్ కంటే, అదృష్టం పాళ్లు ఎక్కువ—ఇండస్ట్రీకి వచ్చిన అతి తక్కువ కాలంలో, ఎక్కువ సంపాదించగలిగాడు బాబు. కోటికి పడగ ఎత్తాడు. చాలా రిజర్వ్‌డ్ గా వుంటాడు.

బాబు మాటల్లో ఆప్యాయత, ఆత్మీయత కనిపిస్తాయి. అందుకే హీరోయిన్సంతా బాబుతో క్లోజ్ గా వుంటారు. సుజాత మరింత సన్నిహితంగా వుంటుంది. బాబు, సుజాత కలిసి నటించిన గులాబి పువ్వు చిత్రం సూపర్ హిట్ అయ్యింది. దానికి భూషణరావు డైరెక్టర్—అప్పట్నించి బాబుతో కలిసి పనిచేయడమంటే సెంటిమెంట్ గా అనిపించింది.

"నువ్వా—ఒక పిచ్చోడనుకున్నాను!" అంది గలగలా నవ్వి.

6

"అవునుమరి — పదిగంటలకి ఫోను చేశానుకదా. ఏమైనా అనుకుంటావు."

"ఛీ—నిన్ను కాదు. ఒక పిచ్చోడు విశాఖపట్నం నుండి ట్రంకాల్ చేశాడు. ఎంతసేపని గంట వదల్లేదు. ప్రాణాలు తోడేశాడు. సరే నేనే నీకు ఫోనుచేయాలను కుంటున్నాను" అంది తీయగా.

"ఏమిటి పాపం!"

"పాపం మరి—నీతో ఒక ముఖ్యమయిన విషయం మాట్లాడాలి. ఎప్పుడు రాను?"

"రేపు కలుద్దాం—నీ షూటింగ్ ఎక్కడ?"

"వి. జి. పి. లో."

"వెరీగుడ్—నాకూ వి.జి.పి.లోనే—లంచ్ అవర్ లో తేలిగ్గా మాట్లాడొచ్చు—"

"ఓ. కే!" తీయగా బాబుకాంక్షలసిన బహుమతిని ఫోన్ లోనే అందించింది.

బాబు సెలయేరులా నవ్వాడు ఫోన్ పెడ్తెనూ.

2

"సుజీ! మా డాడీ నన్ను ప్రొడ్యూసరుగా విరమించు కోమంటున్నాడు" పొగవదుల్తూ తాపీగా అన్నాడు శ్రీకాంత్. షాక్ తింది సుజాత.

"ఏం?"

"వైజాగ్ లో ఏదో ప్రైవేట్ గా ఫేక్టరీ ప్లాన్ చేస్తున్నారు. దానికి మేనేజింగ్ పార్ట్ నర్ ని నేను— నేను మాత్రమే నిర్వహించాలని ఆయన పట్టుదల" అన్నాడు కాసింత గర్వంగా—

"అయితే?" భారంగా నిట్టూర్చింది సుజాత.

"మనం వెంటనే పెళ్ళి చేసుకోవాలి. ఆయనకి నిన్ను

మంగళసూత్రంతో చూపించాలి. ఇఫ్ నాట్ — ఆయన చస్తే అంగీకరించరు— బైదిబై అసలు విషయం ఫ్రాంక్ గా మాట్లాడుకుందాం—నువ్వు నాతో వైజాగ్ వచ్చేయాలి. యికముందు సినిమాల్లో నటించకూడదు. యింతకుముందు నువు జీవితంలో ఎలా తిరిగావో—ఏం చేశావో అన్నది నా కనవసరం. పెళ్ళయ్యాక నాకు తెలియకుండా ఏ పనీ జరక్కూడదు.

పోతే, ఆస్తిపాస్తులున్న అమ్మాయిలు నేను య్యస్ అంటే లక్షమంది వస్తారు. టు బి ఫ్రాంక్—నాకు డబ్బు మీద ఆశలేదు. అలాగని నువు నా యింట్లో కాపురం చేస్తున్నపుడు, మా డాడీ గాని, అమ్మగాని, అక్కడెవరయినాగానీ సూటిపోటి మాటలతో విసిగించడం నేనంతకంటే సహించను. సో, నీతో ఎంతో కొంత ప్రాపర్టీ తీసుకురావడం శ్రేయస్కరం. ఫ్యాక్టరీలో నీకు షేర్ వుంటే, నువ్వు నా కుటుంబంలో సగర్వంగా తలెత్తుకొని తిరగ్గలవు.

ఈ మాటలు ప్రస్తుతానికి కష్టంగా, నిష్ఠూరంగా వుండొచ్చు — శాశ్వతమయిన నిర్ణయాలు తీసుకునే ముందు కొన్ని హెచ్చరికల్ని దృష్టిలో వుంచుకోవాలి. చెప్పు! బాగా ఆలోచించు నీ మనసులో ఏం వుందో స్పష్టంగా చెప్పేయ్—మనం ప్రేమించుకున్నాం. ఎలా? నేనో ప్రొడ్యూసరుగా, నువ్వొక హీరోయిన్ గా. వేషం కోసం ప్రతి హీరోయిను ప్రొడ్యూసర్ని లొంగదీసుకోవడమనేది సహజం! ప్రస్తుతం నీ గురించి, నా గురించి కూడా అంతకంటే ఎక్కువేం ప్రచారంలో లేదు—"

టెలిఫోను మ్రోగింది. సుజాతని ఫోను తీసుకోమని

శ్రీకాంత్ సైగచేశాడు. సుజాత ఫోనెత్తుకొని హలో అంది.

"ఈజిట్ సెవన్ జీరో టు?" అడిగింది గంభీరంగా ఓ గొంతు.

"య్యాస్ ప్లీజ్!" అంది తీయగా. అవతలి గొంతు వెంటనే ప్రశ్నించలేకపోయింది.

"ఈజిట్ ఫిలిం ప్రొడ్యూసర్ మిష్టర్ శ్రీకాంత్ రూమ్!" అన్నాడు అటునుంచి — ఏం చెప్పమంటారు అన్నట్లు సైగచేసింది. రాంగ్ నంబర్ అని రాసి చూపించాడు శ్రీకాంత్. అలాగే చెప్పింది. సుజాత గుండె దడదడ కొట్టుకుంటుంది.

"ఎవరిదా కీచు కంఠం?"

"మా డాడీ. విన్నావుగా-గొంతు ఎంత గంభీరంగా వుందో మనిషి అంతకంటే గంభీరంగా వుంటాడు. బట్ వెరీ సిన్సియర్—" అన్నాడు. సుజాత కళ్ళు ఇంత చేసుకొని "అబ్బా!" అంది నవ్వుతూ.

"ఊఁ సరే — విషయానికొద్దాం! నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తే అన్ని విషయాల్లో రేపు రాత్రికి ఇదే టైమ్‌కి ఇక్కడ కలువ్ — నేనిప్పుడే మా డాడీని కలుసుకోవాలి. లేటయితే అనుమానం పిశాచం ఆయన— భరించలేం వత్తి నస—" అన్నాడు లేస్తూ.

# 3

"అది కాదు సుజాతా! నేను ఎంత రహస్యంగా వుంచాలని ప్రయత్నించినా, పత్రికవాళ్ళు ప్రాణం తీస్తున్నారు. రేపో మాపో మెయిన్ హెడ్డింగ్స్‌తో వెలువడుతుంది మన వార్త. ఇప్పుడిప్పుడే మంచి పేరు తెచ్చుకుంటున్న మనం కెరీర్‌లో యిలాంటి అపశృతుల్ని

కొని తెచ్చుకోవడం నీకూ నాకూ మంచిదికాదు. మన గుట్టు బట్టబయిలయిందనీ, ఫోటోలతోసహా సీరియల్ గా వేస్తామని బెదిరిస్తు రాస్తున్నారు కొందరు సంపాదకులు. ఎంతమందిని డబ్బుతో కొనగలం? మనం పెళ్ళిచేసుకుందాం! ప్రెస్ మన రహస్య సంబంధాన్ని మార్కెట్ లోకీడ్చి కాష్ చేసుకోకముందే మన పెళ్ళి వార్త చెప్పి, సెన్సేషను సృష్టించుకుందాం. ఏమంటావ్?" సుజాత మొహంలోకి పరీక్షగా చూస్తూ అడిగాడు భూషణరావు.

సుజాత ఆలోచనలో పడింది—

"రేపుదయం ఊటీ వెడుతున్నాను. అశోకాలో వుంటాను. రూమ్ నెంబర్ తో ఫోనుచేస్తాను. వివరాలు మాట్లాడు. తిరిగి రాగానే మన మేరేజ్—నీకు యిష్టం లేకపోతే, ఈలోగా తేల్చుకో—" అన్నాడు సిన్సియర్ గా.

సుజాత నిట్టూర్చింది. నేల చూపులు రాస్తూ కూర్చుంది—భూషణరావు దగ్గరికి జరిగాడు. సుజాత నవ్వింది. ఆ నవ్వు కోసమే భూషణరావు బ్రతుకుతున్నాడు. ఆ నవ్వు కోసమే భూషణరావు ఆమెను హీరోయిన్ గా బుక్ చేసి కంటిన్యూగా సినిమాలు తీసి సక్సెస్ అవుతున్నాడు. ఆ నవ్వు భూషణరావుకి సంజీవి. ఆ నవ్వు లేకపోతే భూషణరావు లేడు.

"సుజాతా! యింకో విషయం! నువు నన్ను పెళ్ళి చేసుకున్నంత మాత్రంలో, సినిమాల్లో నటించడం మూ నెయ్యనవసరంలేదు. నీ యిష్టం! నీ అలవాట్లు, నీ అభిరుచులూ నీవి! అలాగే నా విషయంలో కూడా. యిద్దరం సంపూర్ణమైన స్వేచ్ఛను అనుభవిద్దాం! డబ్బు

నీది నీ ఎకౌంట్‌లో వుంచు! మన పెళ్ళి నీకు యిష్టమో, కాదో టెన్త్‌లోగా తెలియపరుచు! ఓ.కె. నాకు స్టోరీ సిటింగ్ వుంది."

"ఎందుకంత తొందర?" అంది సుజాత.

"అవును సుజాతా! తొందరపడవలసిన విషయాల్లో తొందరపడాలి. తప్పదు. జీవితంలో అలక్ష్యం చేసిన ఏక్షణం తిరిగిరాదు. ఓ.కె!"

# 4

"వెళ్ళా!" పగలబడి నవ్వాడు బాబు. నవ్వుతుంటే సొడి బుగ్గమీద అందంగా సొట్టపడుతుంది. చూడ్డానికి ఎంతో ముచ్చటగా వుంటుంది.

"అది కాదు బాబూ. వేళాకోళం కాదు. జరిగిన కథ నీకు చెప్పేను. యిక నిర్ణయం ఎలా తీసుకోవాలో నువు చెప్పు! నువు నాకు ఫ్రెండ్‌వి అన్నినూ—నీ మాటమీద, నీ ఆలోచనమీద నాకు విశ్వాసం వుంది. నువ్వేం చెబుతే అది చేయాలని తీర్మానించుకున్నాను" అంది కాస్త బాధగా.

"ఏం! ఈ విషయంమీ నాన్నగారితో ప్రస్తావించలేకపోయారా?" అన్నాడు సీరియస్‌గా.

"సిగ్గు—నాన్నతో ఏమని మాట్లాడను. నువు చెప్పు?" అంది.

బాబు కాస్సేపు సీరియస్‌గా ఆలోచనలో మునిగిపోయాడు. సుజాత ఆ మాయకు రాలు. గలగలా మాట్లాడడం, ఏడుపొస్తే భోరున ఏడ్చేయడం తప్ప మిగతా విషయాలు దీర్ఘంగా ఆలోచించలేదు. అందుకే సుజాతకి ఏవయినా దీర్ఘ సందేహాలొస్తే తీరుస్తుంటాడు బాబు.

"సుజాతా! నువు మరోలా అనుకోకు. ఈ పెళ్ళి ప్రసక్తి మానుకో. అంత ఆరోగ్యదాయకం కాదు. నీకే కాదు—వారిక్కూడా. కొన్ని సందర్భాల్లో యిలాంటి ఒత్తిడి తప్పదు. నా జీవితంలో యిలాంటి అనుభవాలున్నై. తొందరపడలేదు. అవ్వే సర్దుకున్నాయి—కాలం కొన్ని సమస్యలకి పరిష్కారాన్ని చూపిస్తుంది. విధి నిర్ణయానికి జీవితాన్ని వదిలెయ్యడం.... అందినంతలో ఆనందాన్ని పొందటానికి ప్రయత్నం చేయడం ఫిలిం ఆర్టిస్టు లక్షణం! లేడీ ఆర్టిస్టుల్లో పెళ్ళిచేసుకొని, ఎవరూ బాగుపడలేదు. బాగుపడరు కూడా — ఆలోచించుకో!

పోనీ పెళ్ళి తాత్కాలికంగా మరో రెండు సంవత్సరాలు వాయిదా వెయ్యి. నిన్ను సిన్సియర్‌గా ప్రేమించే వాళ్ళు రెండు సంవత్సరాలు వెయిట్ చేయడం.... అదేమంత పెద్ద సమస్యేం కాదు. అలా సెన్సిటివ్‌గా ఫీలయ్యి. సిన్సియర్‌గా వెయిట్ చేస్తే యు మేరీ హిమ్!" అన్నాడు అభయహస్తం చూపిస్తూ."

సుజాతకిది నచ్చింది. అందుకే బాలు సలహా సంప్రదింపులు కావాలని కోరుకుంటుంది. బాబు చెప్పిందే తుచ తప్పకుండా సాధించాలని స్థిర నిశ్చయానికి వచ్చింది.

## 5

అప్పుడే షూటింగ్ పేకప్ అయ్యింది.

రేపు షూటింగుకి వేసుకోవలసిన డ్రస్సు, రేపు షూటింగులో వ్రాయనున్న సీన్సు తాలూకు వివరాలు ఎక్స్‌ప్లైన్ చేస్తున్నాడు అసోషియేట్ డైరెక్టరు రాము. రాము మాట్లాడుతుంటే ఎంతో వినయ సంపద ఉట్టిపడుతుంది అతని మాటల్లో.

ప్రొడక్షను ఎగ్జిక్యూటివ్ వచ్చి "ఏమ్మా! ఏం తీసుకుంటారు. గోల్డుకోయిన్ యివ్వమంటారా?" అన్నాడు గౌరవపూర్వకంగా. హీరోయిన్ని సాధ్యమయినంత ఎక్కువ రేంజ్ లో నే కాకాపట్టాలని ప్రయత్నం చేస్తుంటారు ప్రొడక్షనువాళ్ళు. యివ్వమన్నట్టు తలూపింది.

క్షణంలో యాపిల్ జ్యూస్ సుజాతముందు ప్రత్యక్షమైంది.

"గుడ్ ఈవినింగ్ మాడమ్!" అంటూ జారుకున్నాడు రాము.

జ్యూస్ సిప్ చేయడం పూర్తయింది.

కారు కదిలింది.

ఎగురుగా రివ్వుమంటూ వాయువేగంతో వచ్చిన ఒక బెంజ్ కారు బ్రేకువేసింది. సుజాత తృళ్ళిపడింది.

ఆ కారులోంచి ఎవరో పద్దెనిమి సంవత్సరాల యువకుడు దిగాడు. చాలా స్టయిల్ గా వున్నాడు. వైయిట్ పేంటు వయిట్ జర్కిన్ వేసుకున్నాడు. డే అండ్ నైట్ లైట్ కలర్ కళ్ళద్దాలున్నై. కుడిచేతికి బంగారు ఛెయినుంది. ఆ ఛెయినుమీద సుధాకర్ అని వుంది. సుజాత చూపులు మార్చుకుంది.

"ఏమండీ! మీరు.... మీరు సుజాతగారు కదూ?" ఆశగా అడిగాడు సుధాకర్. అవునన్నట్లు తలూపింది.

"మీ గురించి ఎంక్వయరీ చేశానండీ. మీ డాడీ ఎ.వి.యం.లో షూటింగు జరుగుతుంది వెళ్ళమని చెప్పేరండీ. మీరు కనిపించారు. నాకు చాలా సంతోషంగా వుందండీ. ప్లీజ్ టు మీట్ యూ అండీ! అంటూ" కరచాలనం చేయాలని చేయి చాపాడు.

సుజాత యాంత్రికంగా చెయ్యి అందించబోయి ఆగిపోయింది. డిసెపాయింట్ అయ్యాడు సుధాకర్. సుజాత మొహంలో నవ్వు చోటుచేసుకుంది. కాసింత రిలీఫ్ ఫీలయ్యాడు సుధాకర్.

"మీకు గుర్తుందాండీ. ఆ రోజు ఫోన్‌లో మాట్లాడేను మాది విశాఖపట్నమండీ. నా పేరు సుధాకర్. ఇక్కడ మా ఫ్రెండ్ విజయకుమార్ బి.ఎ. చదువుతున్నాడు. మాకు విశాఖలో పెద్ద అల్యూమినియమ్ ఫాక్టరీ, ఒక పెద్ద హోటలు వున్నాయండి. మీరు వినేవుంటారు హోటల్ సరోవర్ గురించి—అది మాదేనండీ" అంటూ తనను గురించి పూర్తిగా పరిచయం చేసుకున్నాడు.

మనిషి చాలా తొందరపాటనీ స్పష్టంగా తెలిసుంది. కారు ఆగిపోయింది. తన వెనుక ప్రొడక్షను వేను ఆగిపోయింది. యింకాస్సేపుంటే ట్రాఫిక్ బంద్ అయ్యే ప్రమాదం గ్రహించి "సరే యింటికిరండి మాట్లాడుదాం. యిప్పుడు కాదు రేపుదయం!" అంది. ఆమె మాటలకు తలూపుతున్న సుధాకర్ తక్కున ఆగిపోయాడు.

ఆమెతో మాట్లాడకుండా మద్రాసులో ఒకరాత్రి అంతా గడపగలడా? ఎంత నరకం! తను భరించలేడు. సుజాతతో చాలా విషయాలు మాట్లాడాలి. సుజాత నవ్వుతుంటే రెప్పార్పకుండా చూడాలి. సుజాత కళ్ళల్లో కళ్ళుపెట్టి మూగగా ఎన్నో కలలు కనాలి. యివన్నీ తీరేదెపుడు? ఎలా? ఆలోచనలతో సతమతమయ్యాడు. కారు పక్కకి తొలగించాడు.

సుజాత కారు పక్షిలా రివ్వున ఎగిరిపోయినట్లనిపించింది. బహుశా డ్రైవరుతో చెప్పేవుంటుంది స్పీడుగా డ్రైవ్ చేయమని.

ఫాలో అయ్యాడు సుధాకర్. సుజాత కారు ఆగిన మరుక్షణమే తన కారూ ఆగింది.

సుధాకర్ ఫాలో అయినట్టు తెలిసికూడ సుజాత గమనించనట్టే ఊరుకుంది. యింట్లోకి వడివడిగా నడిచి వెళ్ళిపోయింది.

సుధాకర్ని చూసి, సుజాత తండ్రి పలకరించాడు. ప్రేమగా కూల్ డ్రింక్ యిచ్చి మాట్లాడాడు. సుజాతని పిలిచాడు.

అప్పటికి సుజాత మేకప్ తుడుచుకుని స్నానం చేసి ఫ్రెష్‌గా వుంది. సినీఫీల్డులో పనిచేసేవాళ్ళతో మాట్లాడాలంటే అదే మంచి సమయం. మొహంమీద మేకప్ వుంటుండగా మాట్లాడితే, చికాగ్గా ఫీలవుతారు— యింతకుముందుకంటే, సుజాత మొహం ప్రశాంతంగా వుంది. పెదవులమీద నవ్వు చోటు చేసుకుంది.

“అమ్మా! ఈయన సుధాకర్ గారని, విశాఖపట్నం. మనకి దూరం బంధువులు కూడా. రాజమండ్రిలో మనం లాడ్జింగ్ మెంటయిన్ చేస్తున్నపుడు వీళ్ళ నాన్నగారే వసుండేవారు ప్రతి నెలా. ఆయన మహారాజ పోషకుడు. వడ్డీ తీసుకోకుండనే మనకు చాలా అప్పు యిచ్చారు. నిజానికి మనం అసలు కూడా తీర్చలేదనుకో! ఆయన పేరు వీరభద్రరావు కదూ....” అన్నట్లు సుధాకర్ మొహంలోకి చూశాడు. సుధాకర్ నవ్వుతూ తల నిలువుగా ఊపేడు.

“అవును వీరభద్రరావ్. ఆయన కొడుకే ఈయన. పెద్ద బిగ్ షాట్స్. వెళ్ళండి. మేడమీద మాట్లాడండి. రాత్రికి మనింట్లో భోజనం. యిక్కడే వుండమని చెప్పమ్మాయ్!” అంటూ హెచ్చరింపుగా చూశాడు.

సుజాత తలూపింది.

సుజాత మేడమీదకు నడిచింది. సుధాకర్ కూడా ఫాలో అయ్యాడు.

సుజాతకి చాలా మంచి టేస్టు వుందనే చెప్పాలి. టెర్రస్ మీదనుండి చూస్తే చాలా సిటీ కనిపిస్తుంది. ముఖ్యంగా టి.నగర్‌లో పెద్ద పెద్ద బిల్డింగులన్నీ కనిపిస్తాయి. చల్లగాలికి మల్లెపందిర గుబాళిస్తుంది. సన్నజాజులు పందిరమీద లతలా అల్లుకుపోతున్న దృశ్యాన్ని చూస్తూ నుంచుంది సుజాత.

"మీ గురించి ప్రతిరోజూ ఆలోచిస్తూంటానండీ!" అన్నాడు ఏం మాట్లాడాలో తోచక, తనే ముందు కదుపుతూ. సుజాత చూడనట్లు, వినన్నట్లు నటించింది. సుధాకర్ మరి కాస్త ముందుకు వచ్చాడు. ఎదురెదురుగా వున్నారు. ఇంతలేసి కళ్ళతో, తన ఆరాధ్య దేవతని తనివితీరా చూడసాగాడు.

"మీరు నా ఫేనండీ .. ఛీఛీ .. కాదు కాదు. నేను నేనే మీ ఫేన్నండీ!" అన్నాడు తడబడుతూ.

సుధాకర్ తడబాటుకి, సుజాతకి నవ్వాగింది కాదు. సుజాత కిలకిలా నవ్వుతుంటే, ఈ ప్రపంచాన్నే మైమరిచిపోయాడు సుధాకర్.

సుధాకర్ చేష్టల్ని గమనించింది సుజాత తెలివిగా. సుధాకర్ బ్రీఫ్ కేస్ తెరిచాడు క్షణంలో. కళ్ళు మిరమిట్లు గొలిపేలా ధగధగమంటున్న రవ్వల నెక్లెస్ తీశాడు.

"ఏవండీ... మీరడిగారుకదూ....రవ్వల నెక్లెస్ .... యిదిగో.... దీన్ని నేను చూస్తుండగా పెట్టుకోండి!" అమాయకంగా నవ్వాడు. సుధాకర్ నవ్వుతుంటే, పుచ్చ

పువ్వులా వెన్నెల కాసినట్టుంది.

సుజాత షాక్ ఫీలయ్యింది. ఏదో ఆట పట్టించడానికి అంటే నిజంగానే రవ్వల నెక్లెస్ తీసుకువచ్చేశాడా! ఈ తెగంపుని, ప్రేమనుకోవాలా? పిచ్చనుకోవాలా?

"ఏవండీ, ఏవిటండీ....మీతో ఎన్నో విషయాలు మాట్లాడదామనుకుంటే, ఏం మాట్లాడరు. ఈ నెక్లెసు పెట్టుకోండి. యిదెలా పెట్టుకోవాలంటే" అంటూ నెక్లెస్ హుక్ తగిలించాడు. సుజాత ఒళ్ళు జలదరించింది. గుండె వేగంగా కొట్టుకోసాగింది.

సుజాత తల దించుకుంది.

ఆమెలో ఏదో సిగ్గు చోటుచేసుకుంది.

ఆమె రూపాన్ని మింగేసేలా చూస్తున్నాడు సుధాకర్.

"నేనంటే మీకు?" ప్రశ్నార్థకంగా చూస్తూ వుండిపోయింది.

"ప్రేమ....ఏదో ఆత్మీయతా బంధం....ఏదో....ఏదో మీరే ఈ ప్రపంచమంతా అనిపిస్తారు. మీరు లేకుండా బ్రతకడం నరకం అనిపిస్తుంది. మీరు నాకోసం ఆకాశం నుండి భూమికి దిగివచ్చిన దేవత! మీరు కరుణిస్తే ఈ జన్మ సార్థకమయిపోతుంది. లేదా అంతే, తిరిగి విశాఖపట్నం వెళ్ళకుండా యిక్కడే ఎక్కడో దిక్కుమాలిన చావు చస్తాను. ఇది నా నిర్ణయం!" అన్నాడు విప్పారిన కళ్ళతో చూస్తూ.

సుజాత నవ్వింది. ఆమె నవ్వుని చూడటమంటే ఎంతో సరదా. సుధాకర్ కూడా నవ్వాడు. నాలుగు కళ్ళు కలుసుకున్నాయి. సిగ్గుతో ముడుచుకుపోయాడు సుధాకర్.

"మీరు నన్ను నిజంగా ప్రేమిస్తున్నారా?" అంది సీరియస్‌గా.

"ఓ యస్‌గా."

"ఈ మేడమీదనుండి క్రిందికి దూకుతారా!"

"ఓ యస్‌గా."

"అయితే దూకండి చూద్దాం!" అంటూ కిలకిలా నవ్వింది.

అంతే రెప్పపాటులో క్రిందనున్నాడు సుధాకర్. కాలు ఫ్రాంక్చరయ్యింది. ధారాపాతంగా రక్తం, మో చేతులు గీరుకుపోయాయి. జర్కిన్ రక్తంతో తడిసి పోయింది. సుజాత తండ్రికి ఏం జరిగిందో అర్థంకాలేదు.

# 6

నెల రోజుల సాంగత్యంలో సుజాతకి సుధాకర్ పంచప్రాణాలయిపోయాడు.

యిప్పుడు సుధాకర్‌కి మునుపటిలా తడబాటులేదు. నెటిల్టుగా మాట్లాడుతున్నాడు. నిశ్చలంగా చూస్తున్నాడు. అందంగా నవ్వగలుగుతున్నాడు.

సుజాత ఒక వారం రోజులు షూటింగులన్నీ కాన్సిలు చేసుకుంది. దాంతో పరిశ్రమలో పెద్ద సంచలనం బయలుదేరింది, సుజాత, సుధాకర్ అనే కుర్రాడితో కలిసి తిరుగుతోందని.

సుజాత సాలిగ్రామంలో ఒక ఎకరం స్థలం తీసుకుని ఆర్టు డైరెక్టరు రాజుచేత, అందమయిన పర్ణశాలలా నిర్మించుకుంది. అక్కడ ఒక అరగంటయినా గడిపితే, ప్రాణం గాల్లో తేలినట్లనిపిస్తుంది. అందమయిన పూల చెట్లు, గుబురుగా ఎదిగిన గులాబిచెట్లు ఆ పర్ణశాలకి

మరింత ఆకర్షణని తీసుకొచ్చాయి.

"సుధా!" అని పిలిచింది. సుధాకర్ ఒడిలో మేను వాల్చి ప్రశాంతంగా శూన్యంలోకి చూస్తోంది సుజాత.

"ఏం సుజీ!"

"మనం కలవడం చాలా చిత్రంగా జరిగింది కదూ?"

"ఊహు వాంటెడ్‌గానే జరిగింది!"

"ఎలా?"

"ఎలా అంటే—నిన్ను తెరమీద చూసిన మొదటి క్షణమే. నువ్వు నా ప్రేమికురాలివేననుకున్నాను. జీవితంలో నేను ఏ విషయంలోనూ ఫెయిలవ్వలేదు. నీ విషయంలోనూ కూడా అంతే! అయినా ఈ జన్మలోని బంధన కాదిది. జన్మజన్మల అనుబంధం సుజీ! మనది పవిత్రమయిన బంధం — ఈ బంధాన్ని భగవంతుడు కూడా వేరుచెయ్యలేడు!" అంటూ ఆమెను మరింత ముందు కావలించుకున్నాడు. ఆమె పెదవులు తగిలాయి.

సర్రమంటూ ఫియట్ కారు బ్రేకుపడింది. ఆ కార్లో నుండి ప్రొడ్యూసరు శ్రీకాంత్ దిగాడు. క్షణంలో మరో అంబాసిడర్ ఆగింది. అది డైరెక్టర్ భూషణరావు గారి కారు. యిద్దరూ కూడబలుక్కొని వచ్చినట్టనిపించింది. సుజాత కంగారుపడలేదు. సుధాకర్ లేచి కూర్చున్నాడు.

"గుడ్‌మానింగ్!" అంది సుజాత. శ్రీకాంత్ నవ్వాడు వ్యంగ్యంగా.

"డిసీజ్ గుడీవినింగ్. ప్రేమ మైకంలో కళ్ళు మూసుకుపోతే ఉదయానికి, సాయంత్రానికి ఆట్టే భేదం కనిపించదు క్షణాలు తప్ప! యూ మై కరెక్ట్!" అంటూ త్రిబుల్ ఫయివ్ వెలిగించాడు. సుజాత ముఖా

వంగా తలదించుకుంది.

"హాలో గుడీవినింగ్ మాడమ్!" అంటూ నవ్వడానికి ప్రయత్నించాడు డైరెక్టరు భూషణరావు.

సుజాత స్వచ్ఛంగా నవ్వింది. ఆ నవ్వులో దోషం లేదు.

"గుడ్! మంచి హాండ్ సమ్ హీరోనే లవ్ చేశావన్న మాట! వెరీ గుడ్! ఈ హీరో వెనుక, ఆ సిపాసులు కూడా పుష్కలంగా వున్నాయని విన్నాను. వెరీ వెరీ గుడ్. నువ్వు ఏం చెబుతే అది చేస్తాడనీ, అవసరమయితే తన ప్రాణాలనీ అరచేతిలో పెట్టి, సరాసరి వైకుంఠం చేరుకుంటాడని కూడా విన్నాను .... బ్యూటిఫుల్! ఎక్స్ ట్రీమ్లీ బ్యూటీఫుల్!" అంటూ చప్పట్లు చరిచాడు భూషణరావు.

సుజాత అసహనంగా మొహం పెట్టింది. సుధాకర్ తల దించుకున్నాడు. తనకిలాంటి ఎత్తిపొడుపు మాటలు వినడమంటే అసహ్యం.

"చూడు మిస్....సారీ మిసెస్ సుజాతా సుధాకర్ గారూ! మీరు మీ జీవితంలో ఎందరినో....ఎందరినో ప్రేమించారు. ఎందరినో పెళ్ళిచేసుకుంటానని మాట కూడా యిచ్చారు. నాలాంటి నలుగురయిదుగురు అభాగ్యులతో పెళ్ళి నాటకాలు కూడా ఆడారు. యిన్ని చేసి యింత నమ్మించి, చివరికి ఆఫ్టాల్ ఒక యంగ్ కిడ్.... పనికిమాలిన కుర్రకుంకని కట్టపెట్టుకుందామనుకుంటున్నారు. యిలాంటి ఆలోచన ముందే నీకుంటే మాతో ఎందుకు నాటకం ఆడావ్? ఎందుకు పెళ్ళిచేసుకుంటానన్నావ్? ఎందుకు హోటల్లో బరితెగించి విచ్చలవిడిగా ప్రవర్తించావ్. యిందుకేనా?" నిలదీసి అడిగాడు

శ్రీకాంత్.

సుధాకర్ చంగున ఎగిరి శ్రీకాంత్ కాలరు పుచ్చుకున్నాడు. నాలుగు వాయించాడు. చెప్పుతీసి మరీ కొట్టాడు. శ్రీకాంత్ అహం దెబ్బతింది. వెంటనే బూటుకాలితో సుధాకర్ డొక్కలో తన్నాడు. గింగుర్లు తిరిగిపోయాడు.

"మీరసలు మనుషులా! పశువులా?" అరిచింది సుజాత.

"మనుషులం గనుకనే, మీ యిద్దర్నీ ప్రాణాలతో విడిచిపెడుతున్నాం. మరొకరయితే యిక్కడికిక్కడే, నిలువునా పాతిపెట్టి వుండేవారం!" అన్నాడు భూషణరావు.

"ఒరేయ్....ఏం కూశావురా!" అంటూ చేతిలోని బెల్టు తీసుకుని ఝుళిపించాడు.

బెల్టు హెడ్ కొనదేరి వుంది. దాంతో ఒకటి నేయింతే సంగతులు. భూషణరావు వెళ్ళి అంబాసిడర్లో కూర్చున్నాడు.

శ్రీకాంత్ విసురుగా "య్యెస్, ఐ విల్ సీ యువర్ ఎండ్" అంటూ ఫియట్‌లో కూర్చుని....క్షణంలో మటుమాయమయ్యాడు.

ఆకాశం మబ్బులు క్రమ్మింది. చిటపటమంటూ చినుకులు పడుతున్నాయి. "సుధా! యిక్కడ వుండొద్దు యింకెక్కడికయినా వెళ్ళిపోదాం పద" అంది సుజాత. సుజాత పిరికితనానికి సుధాకర్ నవ్వుతున్నాడు. సుజాతలో ఏదో భయం ఆవరించింది. యింతలో టెలిఫోను మ్రోగింది.

"హలో!" అంటూ ఫోను ఎత్తాడు సుధాకర్.

"ఎయ్....ముందు ఆ ఫోను సుజాత కివ్వు!" దబా యించింది అవతలి గొంతు.

సుధాకర్ మరింత మొండిగా "ముందు మీరెవరో చెప్పండి. విషయం ఏమిటో చెప్తే అప్పుడు ఫోను ఆవిడకు యివ్వాలా, వద్దా అన్నది నేను నిర్ణయిస్తాను!" అన్నాడు.

అవతలి గొంతు ఖంగుమంటూ నవ్వింది. ఆ నవ్వు సుధాకర్ గుండెను దొలిచేసింది.

"బచ్చా! నువ్వు ఈ రోజు మొగుడివయ్యావురా! నేను నీ పుట్టక ఏనాడో.... మొగుడ్ని! బాబు—ఫోన్ చేశాడని చెప్పు!" అన్నాడు.

ఆ మాటలు సుధాకర్ కి ములుకుల్లా గుచ్చుకున్నై. సుజాతకి కూడా లీలగా వినిపిస్తున్నై ఫోన్లోని మాటలు. వెంటనే సుధాకర్ చేతిలో ఫోన్ లాక్కుంది.

"యూ బాస్టర్డు! వాట్ నాన్సెన్స్ యు ఆర్ స్పీకింగ్. డోంట్ యూ నో మానెర్స్?" అని అడిగింది ఉక్రోషంగా. అవతలి గొంతు మళ్ళీ నవ్వింది.

"యూ .... యూ .... యూ ...." అంటూ ఫోను పెట్టేసింది. అయినా ఫోను రింగవుతూనే వుంది. సుధాకర్ ఫోను ఎత్తుకున్నాడు. సుజాత వద్దని వారించింది. ఫోన్లో అవతలి గొంతు మాటలు వినిపించాయి.

"చూడు మైడియర్ యంగ్ బాయ్! నువ్వు సుజాతని ప్రేమించావ్—ప్రేమించు! మగాడివి గనుక ప్రేమించే రైటు నీకుంది. సుజాతని అనుభవించాలనుకున్నావ్—అనుభవించు! మగాడివి గనుక అనుభవించే రైటు నీకుంది గాని సుజాత మెడలో మూడు ముళ్ళూ వేస్తున్నావ్. అదే....అదే ప్రాబ్లమ్! వెయ్యి మూడు కాకపోతే లక్ష

ముళ్ళు వెయ్యి! ఆ ముళ్ళు లిబరల్ గా వుండాలి. ముడి విప్పి, మళ్ళీ వేసుకోడానికి అనుగుణంగా వుండాలి! ఎలా అంటే నీకు అవసరమున్నపుడు ముడి బిగిసివుండాలి మాలాంటివారికి అవసరమయినపుడు ముడి విప్పుతూ వుండాలి. అంతే! ఆ మాత్రం ఎడ్జస్ట్ మెంట్ చాలు. సుజాతతో వర్షంలో ఎంజాయ్ మెంటు భలే బావుంటుందిలే—" అంటూ గలగలా నవ్వాడు. సుధాకర్ ఫోన్ లో మరిక మాటలు వినలేకపోయాడు.

ఆ మాటలన్నీ సుజాత వింది. గోడకేసి తల బాదుకుంది. ఆ క్షణంలో తనను తాను పొడుచుకొని చచ్చిపోవాలనిపించింది. అభం శుభం తెలీని సుధాకర్ ని అనవసరంగా చిత్రహింసకు గురిచేయడం నిజంగా ఘోరమయిన పాపం అనిపించింది. సుధాకర్ కి తన మొహం చూపించలేకపోయింది.

"సుజీ! డోంట్ వర్రీ! నీతో గడిపిన నెలరోజుల్లో నువ్వు యెంత భయంకరమయిన విషవలయంలో చిక్కుకున్నావో అర్థమయింది. నీ స్థితి అర్థమయ్యాకే నిన్ను పెళ్ళిచేసుకుందామని గట్టి నిర్ణయానికి వచ్చాను. ఆ తరువాతే అష్టలక్ష్మి గుళ్ళో నీ మెడలో మూడు ముళ్ళు వేశాను. యిది మనిద్దరికీ తెలిసిన సత్యం! ఈ రోజు మనం ఈ ప్రపంచాన్ని మరిచి, ఆదమరిచి పరవశించే తొలి రోజు. రా పోదాం! మరో ప్రపంచంలోకి పోదాం. మనల్ని ఏ ప్రకృతి శక్తులూ వేరుచేయలేవని మరో ప్రపంచంలోకి పోదాం రా సుజీ!" అంటూ సుజాత చెక్కిళ్ళమీద కన్నీరు తుడిచాడు.

అతడిని లతలా అల్లుకుపోయింది సుజాత.

# 7

"సుధా!" అంటూ ఆకాశానికి వినిపించేంతగా కేక వేసి స్పృహ కోల్పోయింది. దగ్గర్లో వున్న జనాలు పరుగెత్తుకొచ్చారు. మొహంమీద నీళ్ళు చల్లారు.

ప్రక్కనే కొయ్యబారిపోయిన సుధాకర్ని చూసి ఆశ్చర్యంతో స్థాణువుల్లా నిలబడిపోయారు. సుజాత తేరుకుంది.

"సుధా! సుధా! ఏవిటిది! యెందుకు నన్నింత అన్యాయం చేశావ్?" అంటూ జుత్తు పీక్కుంది. రాత్రి పరవశంలో వదులయిన జడ చింకిరిచింకిరిగా తయారయింది. మల్లెపూలు వూడిపోయి, ఒక్కొక్కటి క్రింద పడుతూంది.

సుధాకర్ పలకలేదు. సుధాకర్ ఈ ప్రపంచంలో లేడు. తను చెప్పినట్టే, మరో ప్రపంచంలోకి వెళ్ళిపోయాడు.

జనం గుంపుగుంపులుగా పోగయ్యారు.

సుజాత ఫోనందుకుంది. వడపళని పోలీస్ స్టేషన్కి డయల్ చేసింది. ఇన్స్పెక్టర్ విజయ్ ఫోనందుకున్నాడు. విషయం కంగారుగా చెప్పింది. ఎడ్రస్ చెప్పింది. ఫోను పెట్టేసింది.

మరో అయిదు నిమిషాల్లో పోలీస్ జీపు ఆగింది. జీపులోంచి ఇన్స్పెక్టర్ విజయ్ అతని అనుచరులూ దిగారు. విజయ్ కళ్ళు చింతనిప్పులా మెరుస్తున్నాయి. పరిసరాల్ని అతిశ్రద్ధగా గమనించసాగాయి.

అప్పటికే సినిమా ఫీల్డుకి సంబంధించిన జనం కొందరు కార్లల్లో వచ్చివున్నారు. సుజాతకి సపర్యలు చేస్తున్నారు. ఎగ్రిమెంట్ చేయించుకున్న ప్రొడ్యూసర్లు దీర్ఘమయిన

నిట్టూర్పులు, తీవ్రమయిన సంతాపాల్ని తెలియచేస్తూ, ఒకర్ని మించి ఒకరు నటించడానికి తెగ ప్రయత్నాలు చేస్తున్నారు.

సుధాకర్ శవాన్ని పరీక్షగా చూడసాగాడు ఇన్‌స్పెక్టర్ విజయ్. ఎక్కడా గాయంపడినట్లు కనిపించ లేదు. నిద్రపోతున్నవాడిలా వున్నాడు. యూ ఫోమ్ రౌండ్ బెడ్ మీద మల్లిపూలు వాడిపోయినవి, చిందర వందరగా పడివున్నాయి. దగ్గర్లో రకరకాల స్వీట్సు. సగం తిని పారేసిన పళ్ళు వున్నై! అంటే మొదటి రాత్రి ఎక్విప్‌మెంట్ అంతా అక్కడే వుంది.

"అమ్మా! సుజీ! ఎంత అన్యాయం జరిగిందమ్మా!" అంటూ అంగలేస్తూ వచ్చి వుప్ప కూలినట్లుగా కూలి పోయాడు సుజాత తండ్రి రాఘవయ్య. తండ్రిని చూశాక దుఃఖం మరింత కట్టలు త్రెంచుకొని ప్రవహించసాగింది.

విజయ్ కళ్ళు మెరిశాయి. దూరంగా విసిరిపారేసిన సిగరెట్ కాలిన పొడి కనిపించింది. భద్రంగా తీసి పాక్ చేయించాడు. వెంటిలేటరుగుండా బయట వు చూశాడు. క్షణం అలా గమనిస్తూ వుండిపోయాడు విజయ్.

శవాన్ని పోస్టుమార్టమ్‌కి తగిన ఏర్పాట్లు చేయమని సార్జెంట్‌కి పురమాయించాడు.

సుజాతతో బాటు విజయ్ సుజాత యింటికి వెళ్ళాడు. లంకంత బంగళాలో వుంటోంది సుజాత, సుజాత తండ్రి యిద్దరే.

"రఘురామ్ గారూ! మీరు బయటికి వెళ్ళినట్టయితే సుజాతగారితో కొన్ని ముఖ్యమయిన విషయాలు పర్సనల్‌గా మాట్లాడాలి!" అన్నాడు. రఘురాం బయటికి

వెళ్ళాడు.

సుజాత తలదించుకొని ముభావంగా కూర్చుంది.

"ఇండస్ట్రీలో మీకు బాగా ఎనిమీస్ ఎవరు?" అనడిగాడు.

"అంటే?" అర్థంకానట్లు తలూపింది.

"అంటే — మిమ్మల్నిగానీ మీ కత్యంత ప్రాణపద మయిన వాళ్ళనిగాని, చంపాలన్నంత కసి వున్నవాళ్ళు ఎవరయినా వున్నారా?" అంటూ ముహంలోకి పరీక్షగా చూడసాగాడు.

"నన్నూ, నా వాళ్ళనూ చంపాలన్న ఆలోచన వాళ్ళకు వుందో లేదో నాకు తెలీదుగానీ, ఈ మధ్యనే అత్యంత ఆప్తులనిపించుకున్నవాళ్ళు, కొన్ని కారణాలవల్ల శత్రువులయ్యారు!" అంది.

"ఎవరు వారు?"

"ప్రొడ్యూసరు శ్రీకాంత్, డైరెక్టరు భూషణరావు, హీరో బాబు. వీళ్ళు ముగ్గురూ."

"వారి ఎడ్రస్‌లు?"

సుజాత వివరంగా వారి ఎడ్రస్‌లు చెప్పింది. విజయ్ నోట్ చేసుకున్నాడు.

"వాళ్ళకు మీకు మధ్య ఎలాంటి గొడవలున్నై?"

సుజాత బాధగా నవ్వింది. ఆ నవ్వులో ఎన్నో అర్థాలు దొరికాయి విజయ్‌కి.

"చూడండి! నేను సినీఫీల్డులో ఒక నటిని. వాళ్ళు ప్రముఖులు. ఒక సామాన్యమయిన హీరోయిన్‌కీ, పరి శ్రమలోని ప్రముఖులకీ మధ్య ఎలాంటి సంబంధా లుంటాయి. సమయానుకూలంగా వాళ్ళు అవసరాలు గడుపుకుంటారు. జీవితంలో ఒక లక్ష్యం పెట్టుకుని ఈ

ఫ్లోలులో బజారునపడ్డాక మేమూ వాళ్ళ ఆకలికి బలై పోతాం. అయితే మేమూ మనుషులమే కదండీ! మాకూ మనసంటూ ఒకటి వుంటుంది కదండీ! ఆ మనసును తెలుసుకొనే మనిషిని పెళ్ళాడ్డం తప్పా? యిదే తప్పు అయితే, యింత పెద్ద శిక్ష విధిస్తారా! నిన్నే....నిన్నే నండీ ఆ లక్ష్మీదేవి సాక్షిగా మేము పెళ్ళిచేసుకుంది. మాకు ఈ ప్రపంచంతో సంబంధంలేకుండా, ఈ చిన్న కుటీరంలో తొలి రాత్రి గడుపుదామనుకున్నాం. శ్రీకాంత్, భూషణరావులు వచ్చారు. వాళ్ళు సుధా కర్‌తో ఘర్షణపడ్డారు. చంపుతానని బెదిరించారు. అయినా సుధ మొండి మనిషి. లక్ష్యపెట్టలేదు. ఉదయం చూసే సుధ శవం! నా సుధ నాతో చెప్పినట్టుగానే, ఈ పాపిష్టి ప్రపంచాన్ని విడిచిపెట్టి మరో ప్రపంచంలోకి వెళ్ళిపోయాడు!" అంటూ మొహం పక్కకు తిప్పుకుంది.

విజయ్ గుండెలు కరిగిపోసట్లనిపించింది. విజయ్ కళ్ళలో గిర్రుమంటూ కన్నీళ్ళు చిలికాయ్. నిజమే! సినిమావాళ్ళు మాత్రం మనుష్యులు కారా? సినిమావాళ్ళు శాప గ్రస్తులా? సినిమావాళ్ళకి కళ్యాణ యోగం లేదా? ఏమిటీ అన్యాయం? మనసులో ఎన్నో ప్రశ్నలు.

"ఇన్‌స్పెక్టర్! నా సుధని వాళ్ళ ముగ్గురిలో ఎవరో ఒకరు చంపేవుంటారు. ఎవరు చంపినా వాళ్ళకు శిక్ష పడాలి. భయంకరమయిన శిక్ష పడాలి. అలా పడితేనే గాని, చనిపోయిన సుధ ఆత్మ శాంతించదు. నా గుండె మంట చల్లారదు!" అంటూ దీర్ఘంగా నిట్టూర్చింది. ఆ నిట్టూర్పులో ఎన్నో అగ్నిశిఖలు—

"దన్! థాంక్యూ వెరీమచ్ ఫర్ యువర్ ఇన్ ఫర్మేషన్. మీకు ఫర్దర్‌గా ఏమయినా అనుమానాలు

కలిగితే నాకు ఫోన్ చెయ్యండి. హంతకుడు తప్పించుకో లేడు!" అంటూ హుందాగా బయటికి నడిచాడు.

రాఘవయ్య దుఃఖసముద్రంలో మునిగిపోయాడు.

"రాఘవయ్యగారూ!" పిలుపు వినిపించి తల పైకెత్తి చూశాడు.

"ఏమిటి సర్!"

"సుధాకర్ మీకెప్పట్నుంచి తెలుసు!"

"చిన్నప్పటినుండీ తెలుసు బాబూ. మేము రాజ మండ్రీలో వుంటున్నప్పుడే వాళ్ళ నాన్నగారు మాకు చాలా సహాయం చేశారు. బాగా డబ్బున్నవాళ్ళు బాబూ! మా అమ్మాయి సినిమాల్లో చేరాక, మా అమ్మాయిమీద అభిమానం పెంచుకున్నాడు. అది కాస్త ప్రేమగా మారి, పెళ్ళిదాకా వచ్చింది. నా కొంప కూల్చింది బాబూ!" అంటూ భోరున ఏడ్చాడు.

"ఇట్సాల్ రయిట్! ప్రొడ్యూసరు శ్రీకాంత్, హీరో బాబూ, డైరెక్టరు భూషణరావు వీళ్ళ ముగ్గురిలో ఎవ రెలాంటివారు? కాస్త వివరంగా చెప్తారా?"

"ముగ్గురూ బయటికి తేనెపూసిన కత్తులు బాబూ! సిగ్గు విడిచి చెప్తున్నాను ఆ ముగ్గురూ నా కూతుర్ని ...." అంటూ నోట్లో పంచె కుక్కుకున్నాడు. మొహం ఎర్రగా కందిపోయింది.

"యిపుడు ఏడిస్తే ప్రయోజనంలేదు. రాఘవయ్య గారూ! వివరాలు కావాలి!" అన్నాడు.

"ముగ్గురూ స్వార్థపరులే బాబూ! ఈ సినిమా ఫీల్డులో వున్న రాజకీయాలు ఈ ప్రపంచంలో మరెక్కడా వుండవు బాబూ! ఒకరు పైకి రావాలంటే మరొకడ్ని బలిచేయవలిసిందే. అలా వారి శవాల్ని మెట్లుగా ఉప

యోగిస్తూ శిఖరాగ్రం చేరుకుంటారు బాబూ గొప్ప గొప్ప వాళ్ళంతా. వీళ్ళకి నీతి, నిజాయితీ వుండదు. సిగ్గు ఎగ్గూ వుండదు. అవసరమయితే కాళ్లు పట్టుకుంటారు. అవసరం తీరాక గొంతు పిసికి చంపుతారు. ఇది సినిమా ధర్మం బాబూ! ఆ ధర్మమే నా కూతురి పసుపు కుంకుమ తుడిచేసింది బాబూ!" అంటూ మొహం చాటుచేసు కున్నాడు. విజయ్ అక్కడ్నుంచి భారంగా అడుగులు వేస్తూ బయటికి కదిలాడు.

# 8

ప్రొడక్షన్ వ్యాను బాబు యింటిముందు ఆగింది.

అది బాబు కోసం ప్రత్యేకంగా ఎయిర్ కండిషన్డ్ ఎరేంజ్ చేయబడి వుంది. బాబు తన అసిస్టెంట్ భాషతో చిందులేస్తున్నాడు. "వాట్ డూయూ మీన్! కంటిన్యుటీ షూ పోయిందంటే మాటలనుకుంటు న్నావా! యిప్పుడు ఫస్టు షాట్ లో ఆ షూ వుంటుంది ఎలా? నా షూ పోయిందని ప్రొడ్యూసరుకి చెప్తే అస హ్యంగా వుండదూ? షూటింగ్ అప్ సెట్ కాదూ? ఛీ ఛీ ఛీ!" నొచ్చుకున్నాడు బాబు.

ఇన్ స్పెక్టర్ విజయ్ బాబుని పరీక్షగా చూశాడు. మనిషి అయిదడుగుల పదంగుళాలు వుంటాడు. కండ పుష్టి బాగా వుంది. కాలికేసి చూశాడు. నెంబర్ టెన్ అయితే షూ కాలికి అమరొచ్చు. పాదాలు పొడుగ్గా, వెడల్పుగా వున్నాయి.

"కమిన్ ఇన్ స్పెక్టర్ గారూ! అయామ్ ఇన్ హర్రీ. ఐ మస్టు గో ఫర్ షూటింగ్!" అంటూ మరో షూ తొడుక్కున్నాడు.

"వ్హాటీజ్ యువర్ షూ నెంబర్!"

"వైన్" అన్నాడు బాబు నవ్వుతూ.

"దట్స్ గుడ్ — మీకు సుధాకర్ తెలుసా?" అన్నాడు.

కుర్చీ లాగి కూర్చుంటూ — బాబు నవ్వాడు. ఆ నవ్వుకి అర్ధం అతనిపట్ల తేలిక భావం ఏర్పడింది.

"అదేం ప్రశ్నండీ బాబూ! ఒకే పరిశ్రమలో సుజాత నేనూ వుంటున్నాం. ఒకరి గురించి ఒకరికి తెలియకుండా ఎలా వుంటుంది చెప్పండి?" ఎదురు ప్రశ్న వేశాడు బాబు.

"అదే సుజాత, మీ మధ్య ఎలాంటి పరిచయముంది? సుధాకర్ని ఎవరో హత్యచేశారు? బహుశా ఎవరయి వుంటారని మీ అనుమానం?" అన్నాడు విజయ్, అతని మొహంలో రంగుల్ని గమనిస్తూ.

"చూడండీ! నాకిలాంటి మరణవార్తలంటే భయం. నిన్న రాత్రి, ఆయనతో ఫోన్లో మాట్లాడాను. ఆ తరువాత ఈ రోజు ఉదయం ఆయన మరణ వార్త విన్నాను. మనుషులు ఎంత తొందరగా మటుమాయమై పోతారా సుధాకర్ని చూస్తే అర్ధమవుతుంది. ఐ పిటీ హిమ్! సుధాకర్ అమాయకుడు. ఈ మధ్యనే విశాఖ పట్నంనుండి వచ్చాడు. బహుశా ఈ చావుని కళ్ళ చూడ్డానికేనేమో!" అంటూ జాలిపడ్డాడు బాబు.

"నాకు కావలసింది మీ జాలి, సానుభూతికాదు. సమాధానం!" కొంచెం అధికారపూర్వకంగా అడిగాడు విజయ్.

"నన్నేం చెయ్యమంటారు సర్, సుజాత హీరోయిన్ నేను హీరో — హీరోయిన్కి హీరోకి మధ్య యెలాంటి సంబంధముంటుంది? యింతకుమించి నాకేం తెలీదు.

యింతకంటే నేనొక్క నిమిషం కూడా మీకు కేటా యించలేను. ఐయామ్ వెరీ వెరీ సారీ, అవసరమైతే సాయంత్రం ఆ తర్వాత కలుద్దాం. యిచా ఆలస్య మయితే అసలే అవదం తాగిన మొహం ఆ ప్రొడ్యూ సరుది. అసలు చూడలేం" అంటూ నవ్వుతూ లేచి నిలబడ్డాడు.

# 9

శ్రీకాంత్ రివాల్వింగ్ చెయిర్‌లో కూర్చుని మూడయిదుల సిగరెట్లు తగలేస్తున్నాడు. చుట్టు నాలు గయిదు ఫోన్‌లున్నై. ఆ ప్రక్కనే ఇంటర్‌కమ్ వుంది.

"గుడ్‌మార్నింగ్ సర్!" అంటూ విజయ్‌ను సాద రంగా ఆహ్వానించాడు—విజయ్ పరిసరాల్ని గమనిస్తూ కూర్చున్నాడు.

"డూ యూ వాంట్ కూల్ ఆర్ హాట్?" అంటూ ముందుకు వంగి ప్రేమగా అడిగాడు.

"ఓన్లీ కూల్ వాటర్!" అన్నాడు విజయ్.

"ఫన్నీ .... ఫన్నీ .... ఓన్లీ కూల్ వాటర్ —నో.... నో... లెటజ్ హావ్ మజా!" అంటూ బెల్ నొక్కి ఇంటర్‌కమ్‌లో రెండు మజా ఆర్డరిచ్చాడు.

"వాట్ కెన్ ఐ డు ఫర్ యూ!" అంటూ లేచి మామూలు సీట్లో కూర్చున్నాడు శ్రీకాంత్.

విజయ్ "కెన్ ఐ హావ్ యువర్ సిగరెట్!" అంటూ ఒక సిగరెట్ తీసుకుని నిమిషంలో పూర్తిగా కాల్చేశాడు

"సుజాత మీకు తెలుసా?"

"యిదేం ప్రశ్నండీ—ఆవిడ్ని హీరోయిన్‌గా తెరకు పరిచయం చేసింది నేనేకదండీ — ఆవిడ్ని ఎస్టాబిష్

చేసింది కూడా నేనే కదండీ. ప్రత్యేకంగా తెలుసా? అంటారేమిటి? తెలుసు!" అన్నాడు.

"సుధాకర్ గురించి విన్నారుకదూ!"

"హఠాత్తుగా చనిపోయినట్లేనా?"

"అవును!"

"విన్నాన్సార్ — ఆ దారుణమయిన వార్త గంట క్రితమే విన్నాను. గుండె బాదుకున్నాను. ఎందుకంటారేమో. నిన్న రాత్రే నాకు ఒళ్లు పొగరెక్కి వాడికి వార్నింగ్ యిచ్చానన్సార్!" అన్నాడు శ్రీకాంత్.

"ఎందుకట పాపం!"

"ఎందుకంటారేమండీ — ఆ సుజాత మీద లీగల్ రైట్స్ నాకున్నై. ఆమె నా సొంతం. నా మనిషి. ఆమె మీద కొన్ని లక్షల పెట్టుబడి పెట్టాను. యింకా పెట్టాలనుకుంటున్నాను. అలాంటి సమయంలో, పానకంలో పుడకలా తయారయ్యాడు ఈ సుధాకర్ — కోపం ముంచుకొచ్చి, మాటా మాటా పెరిగి వార్నింగ్ యిచ్చాను. అయితే ఆయన చావుకీ నాకూ ఎలాంటి సంబంధంలేదండీ, నన్ను నమ్మండీ!" కంగారుగా నచ్చ జెప్పాడు.

"మరెందుకా కంగారు?"

"కంగారు ఉండదండీ — మనిషిని చంపుతానని బెదిరించాను తాగిన మైకంలో — ఉదయం నేను లేచేసరికి సుధాకర్ మరణవార్త వినేసరికి, తాగిన మత్తు కాస్తా దిగిపోయింది. నిజం సర్-నన్ను నమ్మండి సర్!" అంటూ విజయ్ రెండు చేతులు పుచ్చుకొని ప్రాధేయపడ్డాడు.

శ్రీకాంత్ ని పరిశీలనగా చూశాడు. హైట్ బాబు కంటే కొంచెం తక్కువ. కాని, కాలిమడమలు,

వైశాల్యం ఎక్కువగానే వుంది.

"వాట్స్ యువర్ షూ నెంబర్?" అనడిగాడు విజయ్.

"జస్టు టెన్ ఐ థింక్—ఆఫ్‌కోర్స్ నైన్ కూడా సరిపోతుంది" అన్నాడు తడబడుతూ. శ్రీకాంత్ సిగరెట్ సగం కాలి బూడిదకింద రాలిపోయింది. దాన్ని యాష్‌ట్రేలో విడిచిపెట్టలేదు. బయటే వుంచేశాడు గ్లాసుమీద—

"సిగరెట్ ఈమధ్యనే అలవాటు చేసుకున్నారా?" విజయ్.

"అవునండీ! ఏదయినా యిలాంటి ఒక మంచి అలవాటు వుండాలని చేసుకున్నాను. కాని కాల్చడం నాకు నిజంగా రాదండీ — పొగ గుండెల్లో పీల్చుకోవడం, యాష్‌ట్రేలో బర్నింగ్ డస్టు విడిచిపెట్టడం అలవాటు లేదు. దరిద్రం!" నొచ్చుకున్నాడు.

"ఓ.కె. సుజాతకి మీకు తెలిసి ఎవరయినా శత్రువులున్నారా?" అనడిగాడు విజయ్ ఫైనల్‌గా.

"నో.... నో .... సుజాతకి శత్రువులెవరుంటారండీ— ఆ అమ్మాయి చాలా మంచి మనిషి. పెళ్ళి చేసుకుందన్న కోపమేగానీ మరో ద్వేషంలేదు ఆమె మీద మాకు ఎవరికీ!" అన్నాడు.

"పెళ్ళి చేసుకుంటే కోపం దేనికి?"

"ఆదేవిటండీ పబ్లిక్‌గా వాడుకునే పార్కుని ఎవరో కామందు గుత్తకొనేశాడంటే కోపంగా వుండదండీ! ఛలేవారే—" అని నవ్వాడు.

విజయ్ శ్రీకాంత్ వైఖరికి జాలిగా నవ్వాడు.

# 10

పోస్టుమార్టమ్ రిపోర్టు వచ్చింది.

హతుడ్ని ముందు క్లోరోఫామ్ చూపించి స్పృహ కోల్పోయేలా చేసి, పొటాషియం సైనేడ్ ఇంజక్షన్ ఇవ్వడం ద్వారా హత్యగావించబడినట్లు తేలింది.

విజయ్ వెంటనే మరోసారి హత్యజరిగిన ప్రాంతాన్ని సందర్శించాడు. కుటీరంలో పరిశీలనగా చూశాడు. షూ ప్రింట్ లెంత్ టేప్ తో కొలిచాడు. సరిగ్గా పది ఇంచీలు—ఎంత లోతుకు షూ దిగిందీ చూశాడు. సుమారు రెండు ఇంచీలకు పైగా దిగింది, అంటే హంతకుడు కనీసం ఎయిటీ కేజిస్ వుండితీరాలి.

పోలీస్ జీపు భూషణరావు యింటికేసి పరుగుతీసింది. మధ్యదారిలో గోల్డెన్ టుబేకో బ్రాంచి ఆఫీసు కనిపించింది. తనకు పరిచయమున్న బయ్యార్ ని కలుసుకున్నాడు. ఇద్దరూ చాలాకాలం తర్వాత కలుసుకున్నందుకు బయ్యార్ హాపీగా ఫీలయ్యాడు. విజయ్ తన పాకెట్ దాచిన సిగరెట్ బర్నింగ్ డస్టు తీసి చూపించాడు. అంతకు ముందు కుటీరంలో దొరికిన బర్నింగ్ డస్టు రెండూ ఒకటేనా కాదా? తేల్చి చెప్పమన్నాడు.

బయ్యార్ కాస్సేపు రెండు పౌడర్లనీ పరిశీలనగా చూసి, "యస్, దిసీజ్ ఎక్స్ ఒన్" అన్నాడు తేల్చి చెబుతూ. పుగాకులో ఎక్స్ ఒన్ నెంబరు ఒన్ గ్రేడ్—క్లాస్ ఒన్ పొగాకు. దీన్నే బ్రిటన్ కు ఎక్స్పోర్టు చేస్తున్నారు. విజయ్ కి ఆ సిగరెట్ డస్టు ట్రిబుల్ ఫయివ్ దని తేలపోయింది. అంటే హంతకుడు ట్రిబుల్ ఫయివ్ కాల్చి వుండాలి. భూషణరావు యింటిముందు

జీపు ఆగింది.

లోపల భూషణరావు బిజీగా వున్నాడు. విజయ్‌ని చూసి మందహాసం పులుముకొని "రండి! కూర్చోండి" అంటూ ఆహ్వానించాడు.

"సుధాకర్‌ని ఎవరో హత్య చేశారు మీకు తెలుసా?" అంటూ కుర్చీ ముందుకు లాక్కున్నాడు. తృళ్ళిపడ్డాడు భూషణరావు.

"ఏమిటి మీరంటున్నది. సుధాకర్‌ని ఎవరో చంపేరు. మీకు తెలుసా? అంటున్నారా? ఎవరు చంపేరో మీకు తెలుసా? అంటున్నారా" అని యెదురు ప్రశ్న వేశాడు అమాయకంగా.

"రెండూనూ."

"ఒకదానికే నా దగ్గర సమాధానముంది. అది మీకు తెలుసు."

"సుధాకర్‌ని కావాలనే చంపేరనా?"

"డబుల్ మీనింగ్ వచ్చేలా మాట్లాడకండి. సుధాకర్‌ని యెవరో చంపేరు. కావాలనే చంపేరో వద్దని చంపేరో ఎవరికి తెలుసు. నేను ఆలోచిస్తున్నది సుధాకర్ కోసం కాదు. ఆయన పోయాడు లెట్ హిమ్ రై—కానీ బంగారంలాంటి భవిష్యత్తు వున్న సుజాత కోసం. సుధాకర్ చావుతో సుజాత పిచ్చిదయిపోతుంది. మరిక నటించదు. ఆమె నటించకపోతే పరిశ్రమ కొన్ని కోట్లు నష్టపోతుంది. అదే నా బాధ" అన్నాడు కళ్ళద్దుకుంటూ.

"ఐ టూ ఏక్సెప్ట్ యూ! కాని సుధాకర్‌ని చంపింది ఎవరో తెలియకపోతే సుజాత నిజంగా పిచ్చెక్కిపోతుంది. ఆ తరువాత ఆమె ఏం చేస్తుందో అది మన

చేతుల్లో లేదు. ఎవరో సుజాతమీద పగతో సుధాకర్‌ని చంపేరు. ఆ యెవరన్నది మీ ముగ్గురిలో ఒకరన్నది మీకు తెలుసని నాకు తెలుసు ఎవరో తప్పుని ఒప్పుకోవడం, నిజం చెప్పడం శ్రేయస్కరం. సుధాకర్‌కి క్లోరోఫాం చూపించి, అతన్ని స్పృహ కోల్పోయేలా చేసి పొటాషియం సైనెడ్ ఇంజక్షన్ చేశారు. ప్లాన్డ్‌గా చంపేరు."

"నో విజయ్‌గారూ! ప్రక్కనే సుజాత వుంది. దట్ టూ యివి ఫస్ట్ నైట్స్. సుజాత షూటింగ్సులో నే తెల్లార్లూ నిద్రపోదు. యూనిట్‌ని నిద్రపోనివ్వదు. ఈ తీయని రాత్రిని వృధాచేస్తుందంటారా! ఐ కాంట్, ఐ కాంట్ బిలీవ్ ఇట్-సుజాత ప్రక్కనే వుంటుండగా సుధాకర్‌ని ఎవరు చంపుతారు? ఎన్ని గుండెలు?" ఎదురు ప్రశ్న వేశాడు భూషణరావు.

"గుడ్! కాని, సుజాత అప్పటికే మానసికంగా విసిగిపోయింది. అలసిపోయింది. తనకొకావలసింది అనుభవించే మగాడు ఓదార్చే ఒక నిండు హృదయం కావాలి. ఆ అనుభూతిలో తనను తాను మరిచిపోయింది. యిన్ని రోజులూ రాత్రింబవళ్ళు షూటింగ్సు చేసి, నిద్రలేని తను ఆదమరిచి నిద్రపోయింది. అదే సమయమనుకొని సుధాకర్‌ని హత్య చేశారు. కావాలనే ఈ హత్య కసికొద్దీ చేశారు మిష్టర్ భూషణరావు" అని మందలించాడు.

భూషణరావు తృళ్ళిపడ్డాడు.

కాలి మడమలకేసి చూశాడు విజయ్.

"వాటీజ్ యువర్ షూ నెంబర్?" అనడిగాడు.

"మే బి టెన్" అంటూ షూ అడుగు చూసి కన్‌ఫర్మ్ చేశాడు.

"దెన్ వాటీజ్ యువర్ వెయిట్?"

"మేబి సెవంటీ!" అంటూ వెయింగ్ మిషనుమీద నుంచున్నాడు సెవంటీ టూ వరకూ వెయిట్ చూపి స్తోంది.

## 11

రాత్రి పదిన్నరయింది.

సుజాత యింటిముందు యెన్నో కార్లు, యింటినిండా జనం. పోస్టుమెన్ అప్పటికప్పుడే అందిన టెలిగ్రాంల దొంతర యిచ్చి, సుజాతచేత సంతకం చేయించుకుం టున్నాడు. తరువాత ముఖ్యమయిన ప్రొడ్యూసర్లు వచ్చారు. అందరూ తమ పెట్టిన పెట్టుబడిని కాపాడే బాధ్యత సుజాతమీద నే వేశారు. ఈ షాక్ కి తట్టుకోమని ధైర్యంగా, మొండిగా జీవితాన్ని కొనసాగించాలని ఉపన్యాసాలు యిచ్చారు.

సుజాత అన్నిటినీ ఓపిగ్గా వింది. తల బద్దలయి పోతుంది. అందర్నీ రేపు కలుసుకోమని చెప్పింది.

విజయ్ జీపులోంచి దిగేసరికి ఒక్కొక్కరు 'యటికి వెళ్ళేందుకు సిద్ధమవుతున్నారు.

"రండి! ఇన్స్పెక్టర్ గారూ!" అంటూ సాదరంగా ఆహ్వానించింది సుజాత. విజయ్ సుజాతతో పర్సనల్ రూమ్‌లోకి నడిచాడు.

"సుధాకర్ ని చంపింది యెవరో ఒకరే—అయితే, కేసును మిస్ గైడ్ చేసేందుకు, కొన్ని అభూతకల్పనలు కల్పించి మరీ చంపేరు. అనుమానితులు ముగ్గుర్నీ పరి శోధించాను. తగిన ఆధారాలు దొరకలేదు" సాలో చనగా పైకి చూశాడు.

"అభూత కల్పనంటున్నారుకదా — అ వ్వేం టో

చెప్పండి" ఇంట్రెస్టింగ్ గా కొంచెం ముందుకు వంగి అడిగింది.

"నెంబరు వన్ వర్షం కురిసింది కనుక అడుగుల ముద్రలు స్పష్టంగా కనిపించాయి. హంతకుడు తోడు వున్నాడు. నెంబర్ టెన్—హంతకుడు బరువు కనీసం యెనభై కిలోలు. హంతకుడు త్రిబుల్ ఫయివ్ సిగరెట్స్ కాలుస్తాడు. సుధాకర్ ని చంపేముందు క్లోరోఫామ్ చూపించి, పొటాసియం సైనైడ్ ఇంజక్షన్ చేశాడు. ఈ హత్య చాలా తెలివిగా చేశాడు!" అంటూ పళ్ళు పటపట కొరికాడు.

సుజాత ఆలోచనల్లోపడింది.

"పోనీ సుధాకర్ కి పర్సనల్ గా ఎనిమీస్ ఎవరయినా వున్నారా?" విజయ్ ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పలేదు. తను యెక్కడో ఆలోచిస్తుంది.

"లేరండీ! సుధాకర్ మద్రాసుకి కొత్త! తనకి ఫ్రెండ్సులేరు. శత్రువులూ లేరు. వుంటే నా తరఫువాళ్ళే అయివుండాలి. బట్ హీరో బాబు, ప్రొడ్యూసరు శ్రీకాంత్, డైరెక్టర్ భూషణం వీళ్ళ ముగ్గురిలో ఎవరో ఒకరు హంతకుడు ఎందుక్కాకూడదు?" అడిగింది.

"నో...నో—నాకూ అలాంటి అనుమానమే వచ్చింది. బాబు హత్య గురించి విన్న తరువాత అతని మొహంలో ఏ విధమయిన గిల్టీ ఫీలింగు కనబడలేదు. హత్య చేసిన వాడెవడు, అంత కాజువల్ గా వుండడు. హంతకుడి బరువు యెనభై కేజీలు పైన. బాబు అంత బరువులేదు. బాబు సిగరెట్ కాల్చడు. నటించడం తప్ప ఏం చేత కాదతనికి.

నెంబర్ టు: శ్రీకాంత్ చాలా తొందరపాటు

మనిషి. ట్రిబుల్ ఫయివ్ సిగరెట్లయితే కాలుస్తాడు గాని, మిగతా విషయాల్లో పూర్తిగా భిన్నం—అయితే బాబు, శ్రీకాంత్, భూషణరావు ముగ్గురూ నెంబర్ టెన్ షూ వాడటం కొంచెం విచిత్రంగా వుంది. ఈ విషయంలో అనుమానించదగ్గ అంశం ఏంలేదు. కొంత మంది సైజు పెద్ద షూ వాడొచ్చు.

ఒక్కటి మాత్రం నిజం! ఈ ముగ్గుర్నీ హంతకులుగా చూపించాలని యెవరో అధిక తెలివితేటలతో ముగ్గురి పాదముద్రలు చూపించాడు. తెలివిగా సుధాకర్‌ని చంపేడు!" భారంగా నిట్టూర్చాడు విజయ్.

"ఐసీ!" అంటూ ఊపిరి విడిచింది దీర్ఘంగా.

సుజాత కళ్ళు ఎర్రబారాయ్. మొహంలో వింత రంగులు మారాయి. ఆమెలో ఏదో కసి, ఏదో కక్ష్య, ఏదో ఆవేశం. క్షణక్షణానికి ఆమె రూపం భయంకరంగా మారిపోతోంది.

"వాట్ మాడమ్ వాట్ హాపెండ్!" అంటూ కంగారుగా అడిగాడు విజయ్.

"నథింగ్ హాపెండ్, లెట్ మీ టేక్ రెస్ట్!"

విజయ్ హుందాగా బయటకు కదిలాడు.

# 12

రాత్రి పన్నెండయింది.

పన్నెండు గంటలు కొట్టి గోడ గడియారం అలిసి పోయింది.

తనలాగే సెకన్ల ముల్లు మాత్రం ముందుకు కుంటు కుంటూ పయనిస్తుంది. సుజాత కళ్ళుమూసుకొని బలవంతంగా నిద్రపోదామని ప్రయత్నించి ఫెయిలయ్యింది. కళ్ళు మూసినా తెరిచినా ఎక్కడ చూసినా సుధాకర్

కనిపిస్తున్నాడు. లేచింది. గుండె రాయిచేసుకుంది. రాఘవయ్య రూమ్‌లోకి నడిచింది.

రాఘవయ్య తనకుతనే ఇంజక్షను చేసుకుంటున్నాడు.

సుజాత గుండె ఆగినంత పనయింది. తన తండ్రి ఇంజక్షన్ కూడా చేసుకోగలడా?

"నాన్నా! ఇదెప్పట్నుంచి?" వ్యంగ్యంగా అడిగింది.

"నువ్వు బిజీ అయినప్పటినుంచీ తల్లీ! రాత్రిళ్ళు ఒక పట్టున నిద్రరాదు. కాంపోజ్ ఇంజక్షన్ చేసుకుంటే కళ్ళు మూతలు పడుతుంది. ఒక అరగంటలో నిద్రపట్టేస్తుంది. ఆ....ఏవిటమ్మా ఇంతరాత్రపుడు వచ్చావ్ — భయంగా వుందా!" ప్రేమగా అడిగాడు.

"అవున్నాన్నా! ఊహించని దృశ్యాలు కళ్ళకు కనిపిస్తున్నపుడు భయంగానే వుంటుంది."

"యెందుకమ్మా భయం! జీవితంలో యెన్నో సమస్యలు యెదురవుతాయి. అన్నిటికీ యిలా కంగారు పడితే యెలా? ఈ రోజు సుధాకర్ పోయాడు. రేపు యిలా. ప్రతి ఒక్కరూ పోవలసినవాళ్ళే కదా!"

"ఆ పోయేదాంట్లో ముందు వెనుక లున్నాయి కద నాన్నా!"

"అది ప్రాప్తం! దేవుడు చేసింది!" అనుభవపూర్వకంగా నవ్వాడు.

"మనుషులే చేస్తే?" సూటిగా కళ్ళలోకి చూస్తూ ప్రశ్నించింది.

"అది కూడా ప్రాప్తమే తల్లీ! ఎలా రాసిపెట్టివుంటే అలా జరుగుతుంది!" సిగరెట్ ముట్టించాడు త్రిబుల్ ఫయివ్.

"ఇదెప్పటినుంచి నాన్నా!"

"అదేనమ్మా. కాంపోజ్ ఇంజక్షను యిచ్చాక ఒకసారి సిగరెట్ కాలిస్తే మనసుకు ప్రశాంతంగా ఉంటుంది. యిది ఈ మధ్యనే అలవాటయిందమ్మా!"

"అంటే బాగా సంపాదించిన తర్వాత....కదు, నాన్నా!"

"అవునమ్మా! డబ్బు ఎందుకు? అనుభవించడానికే కదా!" నవ్వాడు.

"ఎవరు? నువ్వా! నేనా?"

"ఇద్దరమునూ!"

"నో....నువ్వు హాపీగా వున్నావు నాన్నా! నేను ఉండగలుగుతున్నానా? నువు నిద్రకోసం కాంపోజ్ చేసుకున్నావు త్రిబుల్ ఫయివ్ సిగరెట్ వెలిగించావ్! యెంత ప్రశాంతంగా మాట్లాడగలుగుతున్నావ్! నీలా నేను ఉండగలనా నాన్నా!" బాధగా అడిగింది.

"ఉండగలవు తల్లీ కళ్ళు మూసుకొని పడుకో!" అన్నాడు లాలనగా. ఆయనకు అప్పుడే నిద్ర ముంచుకొస్తూంది. ఆవలించసాగాడు.

"మరీ షూష్ ఏమిటి—పడుకున్న సమయంలో మా. తీయకూడదా!" అంటూ రాఘవయ్య బూట్లు విప్పింది.

ఆ బూట్లు రాఘవయ్యవి కావు. హీరో బాబు చేసుకునేవి. షూటింగులో చూసిన గుర్తు! అసలు నెంబరు టెన్ సైజు కాదు. నెంబర్ ఎయిట్. మరెందుకు నెంబర్ టెన్ షూష్ వాడినట్లు? పోలీసుల్ని, పరిశోధకుల్ని మిస్‌గయిడ్ చేయడం కోసం. ఎంత తెలివి ప్రదర్శించాడు. పళ్ళు పటపట కొరికింది.

"నాన్నా రెండు సంవత్సరాల క్రితం నీ బరువు డెబ్బై ఆరు కిలోలు కదు నాన్నా!" వ్యంగ్యంగా అడిగింది.

సుజాత ధోరణి రాఘవయ్యకి విచిత్రంగా కనిపించింది.

"అవునమ్మా! క్రిందటి సంవత్సరం ఎనభై రెండు, ఈ సంవత్సరం ఎనభై ఎనిమిది. ఏం తల్లీ! యెందుకీ పిచ్చి ప్రశ్నలు" నవ్వుతూ అడిగాడు.

"పిచ్చిదాన్ని కనుక!"

"సర్లె పడుకోమ్మా, నిద్రొస్తుంది!"

"నాకు నిద్రపట్టదు నాన్నా!"

"కళ్ళు మూసుకు పడుకో! అదే వస్తుంది! వెళ్ళు—"

"హంతకుడు కళ్ళెదుట కనిపించిన తరువాత నిద్ర రావడం అంత తేలికా నాన్నా!"

"యెవరమ్మా హంతకుడు?"

"నీకామాత్రం తెలీదా నాన్నా!"

"ఎవరు?"

"నువ్వు!"

"అమ్మా!"

"ఎందుకు నాన్నా! నక్క వినయాలు. నువ్వే సుధాకర్‌ని చంపేవు. బాబు, శ్రీకాంత్, భూషణరావు, ముగ్గురిలో యెవరో ఒకర్ని హంతకుడుగా యిరికించాలని, వాళ్ళ అలవాట్లను పులుముకొని నాటకం ఆడావు. తెలివిగా హత్యచేసి తప్పించుకున్నావు—నాన్నా! ఛీఛీ! నిన్ను నోరారా నాన్నా అని పిలిచినందుకయినా ఈ హత్యా ప్రయత్నం మానుకోవలసింది. నువు మనిషివి కావు! నీలో రాక్షసత్వం యింకా పోలేదు. నీ బ్రతుకంతా అమ్మాయిల్ని బజారున అమ్మి, అమ్మాయిల సంపాదనతో గడపడమేనా? ఎందుకు .... ఎందుకు రాఘవయ్యా! ఈ హత్యచేశావ్" చొక్కా పుచ్చుకొని లాగింది.

రాఘవయ్య భయంకరంగా నవ్వాడు.

"యెన్నాళ్ళకు కళ్ళు తెరిచావ్ నా కూతురా! నీకు సంఘంలో బ్రతకడానికి తండ్రి అవసరమయ్యాడా! నీకు సినిమాల్లో చేర్పించడానికి తండ్రి అవసరమయ్యాడా! నిన్ను రౌడీల బారినుండి రక్షించడానికి తండ్రి అవసరమయ్యాడా? నీ మార్కెట్ పెంచడానికి తండ్రి అవసరమయ్యాడా? ఈ రోజు సుధాకర్‌ని చూడగానే తండ్రి మీద అసహ్యం పుట్టిందా? యెంతటి జాణవే నువ్వు! తెరమీద నటించు! పిచ్చి జనం జేజేలు కొడతారు. నిజ జీవితంలో నటించకు! మొహాన ఉమ్మేతారు!" అన్నాడు ఉక్రోషంగా.

"రాఘువయ్యా! నీ అసలు రంగు బయటపెట్టావ్. దిక్కుమాలిన వాడిలాగ మా కొంపలో చేరావ్. మా అమ్మకి మగదిక్కుగా వుంటానన్నావ్. నాకు తండ్రిగా పోగావేశావు. నా సుఖం కోసం, నా క్షేమం ప్రతి క్షణం పాటుపడతానని చనిపోయిన మా అమ్మమీద ప్రమాణం చేశావ్. ఈ రోజు సుధాకర్‌ని చంపి, నీ కృతజ్ఞత ఋజువు చేసుకున్నావ్. వీరభద్రరావుగారు మనకి శ్రేయోభిలాషన్నావ్. మనకి ఆపదలో యెంతో సాయపడ్డారన్నావ్. దానికి ప్రత్యుపకారం సుధాకర్‌ని పొట్టన పెట్టుకున్నావ్. హుూం....అల్ రయిట్! తెలివి నీ ఒక్కడి సొత్తుకాదు" అంటూ కాలరు పుచ్చుకొని గుంజింది.

రాఘువయ్య కళ్ళు మూతలు పడుతున్నై. రెప్పలు ప్రయత్నంమీద తెరవగలుగుతున్నాడు. కాళ్ళు గట్టిగా విదిలించాడు. లేవడానికి ప్రయత్నం చేస్తూ. ఫ్యూజ్ క్రింద పడిపోయాయి రాఘవయ్య వెనక్కి వాలిపోయాడు.

మగత నిద్రలోకి జారుకున్నాడు.

అల్మారా తెరిచింది. క్లోరోఫామ్ కనిపించింది. ఆ ప్రక్కనే పొటాషియం సైనైడ్ వుంది. అంటే వీటిలో సుధాకర్‌ని హత్య చేశాడు. సుజాత పళ్ళు పటపట కొరికింది.

సిరెంజిలోకి సైనైడ్ యెక్కించింది. రాఘవయ్య వెల్లకిలా పడుకున్నాడు. వెయిన్స్‌కి ఇంజక్టు చేసింది. గిలగిలా గింజుకున్నాడు. సుజాత భారంగా నిట్టూర్చింది. కాస్సేపటికి రాఘవయ్యలో చలనం ఆగిపోయింది.

సుజాత కళ్ళనిండా సుధాకర్ కనిపించాడు. అమాయకమైన నవ్వు కనిపించింది. సుధాకర్ డెడ్ బాడీ దగ్గర వున్న ఆధారాలు త్రిబుల్ ఫయివ్ సిగరెట్ డస్టు, టెన్ సైజ్ షూస్ అన్నీ వున్నై. బయటికి నడిచింది.

"సుధా! నన్ను క్షమించు! ముళ్ళుని ముళ్ళుతోనే తీయాలి! వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలి! ఆడపిల్లల్ని బజారున అమ్మకోనే గోముఖ వ్యాఘ్రాలకు ఈ ప్రభుత్వం తగిన శిక్ష విధించదు! కన్న తండ్రుల బురఖా తగిలించుకొని, బ్రతికున్నంత కాలం చిత్రహింసకు గురిచేసే ఈ కలియుగ అపర పితృదేవుళ్ళను సమూలనంగా నాశనం చేయాలి! నరికేయాలి! నిలువునా పాతెయ్యాలి! అపుడే స్త్రీలోకానికి స్వేచ్ఛ!" పిచ్చిగా అరిచింది. భోరుమని తల బాదుకొని ఏడ్చింది. అలిసిపోయింది. మగత నిద్రలోకి జారిపోయింది.

తెల్లవారింది.

రాఘవయ్య మరణవార్త గుప్పుమంది పరిశ్రమలో. పలువురు ప్రముఖులు వచ్చేశారు.

"సుధాకర్ చనిపోయినట్టే రాఘవయ్య కూడా

చనిపోయాడు. సుధాకర్ దగ్గర కనిపించిన ఆధారాలే రాఘవయ్య దగ్గరా కనిపించాయి. సుధాకర్‌ని యెవరు హత్య చేశారో, రాఘవయ్యనూ వాళ్ళే హత్య చేసి వుంటారు!" యిది జనవాక్యం మాత్రం కాదు. పోలీసు డిపార్టుమెంట్ రాఘవయ్య మరణం పట్ల వెలిబుచ్చిన సిన్సియర్ తీర్మానం.

సుజాతకి నవ్వాలో ఏడవాలో తెలీని పరిస్థితి. ఏడవ లేక పగలబడి నవ్వుతుంది లోలోన.

—:ఐ పో యిం ది:—

# అర్ధరాత్రి

టెంపోరావ్

ఉషాదేవి మేడ మెట్లు ఎక్కి నడవమ్మట నడవసాగింది.

హోటల్ గదుల నంబర్లను ఆమె కళ్ళు పరకాయించి చూస్తున్నాయి. ఐదు, ఆరు....అంటే ఇంకా ముందుకు పోవాలన్న మాట!

ఆజానుబాహుడైన వ్యక్తి యెవరో గదిలోంచి బయటకొచ్చి, తలుపుమూసి తాళాలు వేస్తున్నాడు. పని ముగించి అతడు అదే నడవమ్మట ఆమెకెదురుగా నడవ సాగాడు. ఆమె కళ్ళు నంబర్లను చూడ్డంమాని ఎదురుగా వస్తూ అతడివైపు వెళ్ళాయి.

ఏడడుగుల పొడుగాటి మనిషి....బుగ్గమీసాలు.... పళ్ళమధ్య పొడుగాటి చుట్ట .... పెద్ద పెద్ద అంగల్లో నడక ....

అతను దగ్గరకు రాగానే "క్షమించండి!" అని ఆమె అతడివంక చూసింది.

చుట్ట పొగ వదుల్తూ, విచిత్రంగా నవ్వుతూ తన

ముందు నిలబడిన ఆమెను అతడు ఎగా, దిగా పరికించాడు.

"క్షమించాను, అమ్మాయ్!" అన్నాడతను క్లుప్తంగా.

"మీకోసమే వస్తున్నాను. మీతో అర్జెంటుగా మాట్లాడాలి."

"నాకోసమా? పొరబడటంలేదుగా?"

జవాబివ్వకుండా ఆమె నవ్వింది. ఆమె తెల్లని పళ్ళు ముత్యాల్లా మెరిశాయి.

"మిమ్మల్ని చూడగానే మీరే వాలిగారని అందరూ పోలుస్తారు!" అందామె.

డిటెక్టివ్ వాలి గంభీరంగా నవ్వాడు. తన బుగ్గ మీసాలను ఓసారి సగర్వంగా వేలితో దిద్దుకున్నాడు. నోట్లోని చుట్టను చేత్తో పట్టుకొని అలాగా అంటూ, వెనక్కి తిరిగి వెళ్ళాడు. ఆమె అతన్ని అనుసరించింది.

వాలి తన కాళ్ళను ముందున్న బల్లమీద చాచి, పడక్కుర్చీలో విశ్రాంతిగా కూర్చున్నాడు. ఉషాదేవి అతని ప్రక్కనున్న సోఫాలో కూర్చుని, కథ ఎలా ప్రారంభించడమా అని ఆలోచిస్తోంది.

"అమ్మాయ్, నీ పేరు ఉషాదేవి. నువ్వు చాలా హడావిడిగా ఎవరో పంపడంవల్ల ఇక్కడికి వచ్చావ్.."

ఆమె విస్మయంతో అతన్ని చూసింది.

"అవన్నీ మీకెలా తెలుసు?"

వాలి నవ్వుతూ జవాబిచ్చాడు. "అది కూడా చెప్పాలా? వాలికి అన్నీ తెలుస్తూనే వుంటాయి. నీ చేతిలోని హాండ్ బాగ్ మీద నీ పేరుందిగా? తర్వాత నువ్వు జుట్టు దువ్వుకోలేదు. బొట్టు పెట్టుకోలేదు. బహుశా స్నానం కూడా చేసివుండవు. జాకెట్టు రంగు నీ చీరరంగుకి చాలా విరుద్ధంగా వుంది. కాని నీ గాజులనీ,

హాండ్ బాగ్ నీ చూస్తే నువ్వు మామూలుగా మంచి అభిరుచితో ముస్తాబయే స్త్రీవని తెలుస్తుంది. వీటినిబట్టి హడావిడిగా వచ్చావని బోధపడుతుంది."

"అదంతా బాగానే వుంది. నన్నెవరో పంపి వుంటారని ఎలా అన్నారు?"

నవ్వుతూ వాలి పడక్కుర్చీలో లేచికూర్చుని, చెయ్యి చాచి ఆమె కుడిబుగ్గను మెల్లిగా గిల్లాడు.

"వెర్రిపిల్లా! మనస్సు ప్రతిబింబాన్ని మొహంలో చూడొచ్చుగా! నీ మొహంచూస్తే నా దగ్గరకి ఇష్టం లేకపోయినా వచ్చినట్టు స్పష్టంగా తెలుస్తోంది. అందువల్ల యెవరో నిన్ను పంపించి వుంటారని అన్నాను" వాలి మళ్ళా కుర్చీలో వెనక్కి బోర్లా బడ్డాడు. చుట్ట పొగ వదుల్తూ, కళ్ళు మూశాడు. ఆమె ఇలా చెప్పసాగింది:

"అవును. మా యజమానురాలైన దుర్గమ్మగారు నన్ను మీ వద్దకు పంపించారు. నిన్న రాత్రి 12 ప్రాంతంలో దుర్గమ్మగారి భర్త దక్షిణామూర్తిగారిని యెవరో హత్య చేశారు. ఆ విషయం ఈ వేళ పేపర్లో మీరు చూసే వుంటారు...." ఆమె ఆగింది. కళ్ళు మూసుకొని విశ్రాంతిగా చుట్ట కాలుస్తూన్న వాలి జవాబివ్వలేదు.

"నే చెప్పేది వింటున్నారా?" అందామె.

"నా చెవులు జాగ్రత్తగా వింటున్నాయి" అన్నాడు వాలి.

"దక్షిణామూర్తిగారిని యెవరు హత్యచేసిందీ అప్పుడే తేలిపోయింది. ఆయన మేనల్లుడైన శంకరమే హత్య చేసుంటాడని ఇంట్లో వున్న వాళ్ళందరికీ తెలుసు. ఈ రోజు పొద్దుటే పోలీసులు శంకరాన్ని అరెస్టుచేసి తీసుకు పోయారు. అయినప్పటికీ శంకరం హంతకుడని దుర్గమ్మ

గారు నమ్మటంలేదు. అందువలన యెవరు హత్యచేసింది మీరు కనుక్కోవాలని ఆమె కోరిక. అది మీతో చెప్పడం కోసం నేను వచ్చాను."

కళ్ళు తెరిచి వాలి ఆమెవైపు చూశాడు.

"అమ్మాయి, నువ్వేమంటావు?" మేనల్లుడు శంకరం హత్య చేశాడంటావా?" అడిగాడతను.

"అనేకమంది చెప్పినదాన్నిబట్టి శంకరమే హంతకుడని అనిపిస్తోంది. నేనూ అలాగే భావిస్తున్నాను. అందుకే అతడిని వెంటనే పోలీసులు అరస్టు చేశారు. తను పట్టుకున్న కుందేలుకి మూడే కాళ్ళు వున్నట్లు దుర్గమ్మగారు శంకరం నిర్దోషని భీష్మించి కూర్చున్నారు."

"అయితే నేను రావడం ఏ విధంగా లాభిస్తుంది?"

"బాగా అడిగారు. నేనూ అదే అనుకుంటున్నాను. నల్లగా వున్న గోడను మీరు మాత్రం తెల్లగా వుందని అనగలరా? దుర్గమ్మగారు తిక్కమనిషి. తప్పకుండా మీరు రావాలని అన్నారామె."

"అయితే వెళ్దాంపద!" అన్నాడు వాలి.

## 2

కారులోంచి దిగగానే డిటెక్టివ్ వాలి ఓసారి ఆ భవనాన్ని కలయజూశాడు. విశాలమైన మూడంతస్తుల భవనం. పెద్ద తోట. ఆరడుగుల ఎత్తున ప్రహరీ గోడ నలువైపులా వుంది.

వాలిని ఆమె మొదటి అంతస్థులో వున్న దుర్గమ్మ గదిలోకి తీసుకు వెళ్ళింది.

వాలిని చూడగానే నలభై ఐదేళ్ళ వయస్సులో వున్న దుర్గమ్మ నవ్వుతూ ఆహ్వానించింది. ఘనేగా సెంటువాసన గదిలో గుప్పున కొడుతోంది. వాలి సోఫాలో కూర్చు

న్నాడు. ఉషాదేవి బయటకు వెళ్ళిపోయింది.

విచారవదనంతో దుర్గమ్మ వాలి పక్కనే కూర్చుని అతడి చేతులను పట్టుకుంది.

"వాలిగారూ, శంకరం నిర్దోషి. అది నాకు తెలుసు" అందామె.

వాలి ఆమెవైపు సూటిగా చూశాడు.

"నీకెలా తెలుసు?"

"స్త్రీలకు అంతర్గతంగా నిజం తెలుస్తూ వుంటుంది. శంకరం నిర్దోషని నా హృదయం చెప్తోంది, బొబ్బలెడ్తోంది!" అందామె.

వాలి విచిత్రంగా నవ్వాడు. ఆమె మొహం చిన్నబోయింది.

"అంతగా నవ్వారేమిటి?"

"రేపు కోర్టులో జూరీ సభ్యులు నీ హృదయం పలికే మాటలు విని యెలా నవ్వుతారో నీకు చూపించడానికి అంతగా నవ్వాను. నీ హృదయం శంకరం నిర్దోషంటే కోర్టు సమ్మతించదు. అందుకు అవుసరమైన ఋజావులుండాలి."

"నాకు నిజం తెలుసు. ఎవరు చంపారో తెలుసు."

"ఎవరు?" అడిగాడతను ఆశ్చర్యంతో.

"మకరమూర్తి."

"అతనెవరు?

"అతడు మావారి ప్రాణమిత్రుడైన రామ్మూర్తిగారి కొడుకు. రామ్మూర్తిగారు చాలా డబ్బు గడించారు. ఆయన మరణించేసరికి మకరమూర్తి పన్నెండేళ్ళ కుర్రాడు. మరెవరూ లేకపోవడంవలన చనిపోతూ ఆయన

తన ఆస్తిని మా వారికిచ్చారు. ఆ ఆస్తిని జాగ్రత్తగా చూడమనీ, 25 ఏళ్ళు వచ్చాక మకరమూర్తికి ఇవ్వమనీ చెప్పారు. అంతవరకూ మకరమూర్తిని యీ ఇంట్లోనే ఉంచుకోమన్నారు. ఇదంతా రామ్మూర్తిగారు స్పష్టంగా రాసి మరణించారు."

"మకరమూర్తి యిక్కడే వుంటున్నాడా?"

"10 ఏళ్ళనుంచి మాతోనే ఉంటున్నాడు. కాని అతడికి చదువు అబ్బలేదు. మా వారికి కార్యదర్శిగా వుండి ఆయన పనులను చూస్తూ వుంటాడు."

"అతడు హత్య చేయడం నువ్వు స్వయంగా చూశావా?" ప్రశ్నించాడు వాలి.

"చూడలేదు. కాని అతడే హంతకుడని నా హృదయానికి తెలుసు."

వాలి మళ్ళా విచిత్రంగా నవ్వాడు.

"నిన్న రాత్రి హత్య గురించి నీకు తెలిసినదంతా వివరంగా చెప్పు!"

"క్రింద భాగంలో వున్న డైనింగ్ హాల్లో 9-30కి అందరం భోజనాలకు కూర్చున్నాం."

"ఎవరెవరున్నారు?"

"నేను, మావారు, మకరమూర్తి, ఉష, నిబ్బరాజు."

"నిబ్బరాజు ఎవరు?"

"అతడు నా మరది. మావారూ, అతడూ కలిసి వ్యాపారం చేస్తున్నారు. అతడు హైద్రాబాద్‌లో వున్న మా కంపెనీ బ్రాంచిని నడుపుతున్నాడు. ఈ వూరువచ్చి మూడు నెలలయింది. అప్పటినుంచీ మాతోనే ఇక్కడ వుంటున్నాడు" అందామె.

"ఉష నీకు ఏమవుతుంది?"

"ఒక అనాథాశ్రమంలో నేను ఉషను చూశాను. వచ్చి మా ఇంట్లో వుండమన్నాను. ఆమె ఇక్కడికొచ్చి ఆరు నెలలయింది. ఉషంటే నాకెంతో ఇష్టం. ఎప్పుడూ నవ్వుతూ, ఆనందంతో తిరిగే యువతులను చూస్తూంటే నాకు చాలా సంతోషంగా ఉంటుంది. ఉషను చూసి మావారు విసుక్కునేవారు. కాని నాకోసం వూరుకున్నారు."

"నీ భర్త మరెవర్ని చూసి విసుక్కునేవాడు?"

వెంటనే ఆమె జవాబివ్వలేదు. క్షణాలో ఆమె కళ్ళమ్మట నీళ్ళు కారాయి.

"ఆయనది వెన్నలాంటి హృదయం, సార్. కాని ఆయనకు చిరాకు ఎక్కువ. ఆయన ముక్కోపి. పొద్దుట నుంచి రాత్రిదాకా ఆయన అందర్నీ ఎడాపెడా తిడ్తూనే ఉండేవారు...."

"నిన్ను కూడానా?" అడ్డువస్తూ అడిగాడు వాలి.

"నన్నూ తిట్టేవారు. నేనూ తిట్టేదాన్ని. యెదటి వాళ్ళు నోరు మూసుకుంటే ఆయన ఇంకా ఎక్కువగా తిడ్తారని నాకు తెలుసు. అది ఆయన స్వభావం. ఆయన నన్ను ఏదేనా అంటే గాయపడిన పులిలా లేచి అరిచేదాన్ని. దానితో ఆయన వూరుకునేవారు" అందామె.

చుట్ట పొగ పీల్చి వదులుతూ వాలి క్షణకాలం మౌనంగా ఉండిపోయాడు.

"నిన్న రాత్రి ఏం జరిగిందో చెప్పు!"

"భోజనాలు సాగుతూండగా ఏదో పని సరిగ్గా చేయలేదని మావారు మకరమూర్తిని విపరీతంగా తిట్టారు. సాధారణంగా యెవరు ఎంత తిట్టినా అతడు లెక్కచేసేవాడుకాదు. రాయిలా ఉండేవాడు. యెందుకలనో నిన్న

నా భర్త తిడుతూండగా తన ఉద్రేకాన్ని ఆపుకోలేక టేబులుమీదున్న పళ్ళకోసే కత్తిని గట్టిగా పట్టుకొని లోలోపల అల్లల్లాడాడు. ఆ సమయంలో అతడి మొహం వికృతరూపం దాల్చింది. కత్తిని పట్టుకున్న అతడి చెయ్యి కోపంతో వణికింది. కాని అప్పట్లో అతడి ప్రవర్తన ఈ హత్యకు దారితీస్తుందని నేను ఊహించలేకపోయాను. అతనే హంతకుడు!"

ఆమె బరువుగా ఊపిరి పీలుస్తూ ఆగింది. కొంత సేపయ్యాక వాలివైపు చూసింది.

"భోజనం అయాక మావారు మొదటి అంతస్తులో వున్న ఆఫీసుగదిలోకి వెళ్లారు. 10 గంటలకు నిబ్బరాజా ఆ గదిలోకి వెళ్ళాడు. వాళ్ళిద్దరూ 10-30 వరకూ కంపెనీ విషయాలు మాట్లాడుకున్నారు. తర్వాత మకరమూర్తిని మావారు పిల్చారు. అతను వెళ్ళాడు. నాకు నిద్రపట్టక పదకొండున్నరకి నేనూ ఆయన గదిలోకి వెళ్ళాను. మావారు టేబుల్ వెనుకనున్న కుర్చీలో కూర్చుని వున్నారు. నేను గదిలోకి వెళ్ళగానే పోయి పడుకుంటానని మకరమూర్తి వెళ్ళిపోయాడు. పన్నెండు కొట్టగానే నేను నా గదికి వెళ్ళిపోయాను."

"ఆ తర్వాత ఏమైంది?"

"నేను బయటకు వచ్చిన కాసేపట్లో శంకరం ఏదో పార్టీకి వెళ్ళి తప్ప తాగి వచ్చాడు. రెండో అంతస్తులో వున్న తన గదికి వెళ్ళబోతూ ఓసారి మావారి గదిలోకి వెళ్ళాడట."

వాలి సోఫాలోంచి లేచాడు.

"హత్య జరిగిన గదిని చూపిస్తావా?"

ఇద్దరూ గది బయటకు వచ్చి నడవమూలనున్న

దక్షిణామూర్తి గదిలోకి ప్రవేశించారు.

చాలా విశాలమైన గది. ఒకవైపున పెద్ద టేబుల్ వుంది. దాని వెనుక కుషన్డ్ రొటేటింగ్ చెయిర్! కిటికీలకు అందమైన సిల్కు కర్టెను అమర్చబడ్డాయి.

వాలి గుమ్మంలో నిలబడి తిన్నగా ముందుకు చూశాడు. సిల్కు కర్టెన్ కవతల వంకెలు తిరిగిన మేడమెట్లు అగుపడ్డాయి. వాలి పక్కనున్న ఆమెవైపు తిరిగాడు.

"ఆ మెట్లు మూడో అంతస్తులో వున్న మావారి పడకగదికి వెళ్తాయి. ఆ గదిలో కూర్చుని ఆయన ఆఫీసు పనులన్నీ రాత్రి ఒంటిగంటదాకా చూస్తూ వుంటారు. ఆటుపైన ఆ మెట్లెక్కి పైనున్న పడగ్గదికి వెళ్ళి నిద్ర పోతారు."

"మూడో అంతస్తులో ఆ గదికే తోడుగా యింకా గదులున్నాయా?"

"ఆయన పడకగది మాత్రమే వుంది. అక్కడికెళ్ళా లంటే ఆ మెట్లే ఎక్కాలి" అందామె.

మాట్లాడకుండా వాలి రొటేటింగ్ కుర్చీ దగ్గరకు నడిచాడు. టేబులుమీద అమర్చిన రెక్సైన్ క్లాత్ మీద రక్తం మరకలున్నాయి.

కిందకు వంగి వాలి నేలను కప్పిన తివాసీని పరీక్షించాడు. తివాసీమీద కూడా రక్తం మరకలు కనబడ్డాయి. అతడు ఆమెవైపు చూశాడు."

"ఆతడి శవం ఎలా, ఎక్కడ పడివుంది?"

"తివాసీమీద, కుర్చీకి సమీపంలో పడి వుంది" అందామె.

టేబులు కుడివైపున స్టేండ్ మీద ఎత్తుగా ఒక లాంప్ వుంది. గదిలో రెండు ఫ్లోరోసెంట్ లైట్లు ఉన్నాయి.

"దక్షిణామూర్తి ఈ గదిలో పనిచేసేటప్పుడు అన్ని లైట్లనూ వాడతాడా?"

"ఈ టేబులు లాంప్ మాత్రం ఆన్ చేయబడి వుంటుంది. తతిమ్మా లైట్లను ఆయన ఉపయోగించరు."

వాలి తీవ్రంగా ఆలోచించసాగాడు.

"శవాన్ని పోలీస్ వాళ్ళు పట్టుకెళ్ళి ఎంత సేపయ్యింది?"

"7 గంటలకి పట్టుకెళ్ళారు. అప్పుడే శంకరాన్ని కూడా తీసుకెళ్ళారు."

వాలి గదంతనీ పరీక్షించి, బయటకు నడిచాడు. దుర్గమ్మ అతన్ని అనుసరించింది.

"క్రింది భాగంలో మీకొక గది ప్రత్యేకంగా ఉంచమన్నాను. ఈ హత్యా రహస్యం తెలిసిందాకా మీరు ఇక్కడే ఉండాలని నా కోరిక" అంది దుర్గమ్మ.

"నిజం తెలియకపోదు. తెలుసుకున్నదాకా ఇక్కడే ఉంటాను" అంటూ డిటెక్టివ్ వాలి మేడమెట్లు దిగాడు.

డిటెక్టివ్ వాలి కిందనున్న హాలులో అడుగుపెట్టగానే యెవరో వ్యక్తి తొందరగా ఆ గదిలోకి ప్రవేశించి, చేతిలోని తోలు సంచీని సోఫామీద పడేశాడు.

"ఏయ్, రంగా!" అని గట్టిగా అరిచాడతను.

మరో క్షణంలో వంటవాడు రంగన్న చేతులు జోడించుకుని అతనివద్దకు వచ్చాడు.

"ఇడియట్, ఈ గది శుభ్రంగా ఉంచమని ఎన్నిసార్లు చెప్పాను? బొత్తిగా బుద్ధి లేకుండా మసులుతున్నావు!" అన్నాడతను విశేషమైన కోపంతో.

ఆ మాటలను వింటూ, వాలి అతనివైపు నడిచాడు. అతను నిబ్బరాజే అయుంటాడని కోపంతో కూడిన

మాటలను బట్టి గ్రహించాడు. అతను వాలివైపు శత్రు భావంతో చూశాడు.

"మీరెవరు? ఏం కావాలి?" అని కసిరాడు.

"డిటెక్టివ్ వాలిని. దక్షిణామూర్తి హంతకుడు కావాలి!"

"అయితే మా వదిన పిచ్చిగా మిమ్మల్ని రప్పించిందన్నమాట. నన్నడిగితే ఇదంతా డబ్బు తగలెట్టడం అంటాను. శంకరం హంతకుడని అందరికీ తెలిసిందే. మీరు మాత్రం వచ్చి ఏం పొడిచేస్తారు?"

"బాగా చెప్పావు. మీ వదినకు నిజంగా చాదస్తమే అనొచ్చు. అందరికీ తెలిసిన విషయాన్ని నేను మాత్రం కాదనగలనా?" వాలి నవ్వుతూ జవాబిచ్చాడు.

వాలి జవాబుతో నిబ్బరాజు కోపం తగ్గింది.

"అయితే శంకరం యెందుకు హత్య చేశాడంటావు?"

"యెందుకేనా అయుండొచ్చు. వాడికి కావల్సిన డబ్బు అన్నయ్య ఇచ్చేవాడుకాదు."

"నిన్న రాత్రి అన్నయ్యతో నువ్వు మాట్లాడావని విన్నాను. ఎంతసేపు మాట్లాడావు?"

"అరగంట సేపు."

"ఏం మాట్లాడావు?"

"మా సంభాషణ మీ పరిశోధనకి ఉపకరించదు."

"అది నిర్ణయించాల్సింది నేను."

నిబ్బరాజు కాస్సేపు ఆలోచించి ఇలా చెప్పాడు.

"నిన్న రాత్రి అన్నయ్య నేనూ పోట్లాడుకున్నాం. అన్నయ్యకి కోపం ఎక్కువ. లోకువగా దొరికిన వారిని కొమ్ములు పెట్టి పొడిచి పారేసేవాడు. కాని అతని పప్పు నా దగ్గర ఉడికేదికాదు. అతనికంటె ఎక్కువ కోపంతో

మొహం వాచేటట్టు తిట్టివచ్చేశాను."

"ఇంతకీ ఏ విషయంమీద పోట్లాడుకున్నారు?"

"అది అడక్కండి. అది రహస్యం."

డిటెక్టివ్ వాలి నిబ్బరాజు కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

"రహస్యాలను దాచడంలో నన్ను మించినవారు లోకంలో లేరని అందరూ అంటూ వుంటారు!"

నిబ్బరాజు కొంతసేపు ఆలోచిస్తూ వుండిపోయాడు.

"నిన్న పొద్దుటనుంచీ ఉష మంచిదికాదనీ, ఆమెని వెంటనే పంపించివెయ్యమనీ అన్నయ్య పట్టుపట్టి కూర్చున్నాడు. ఆ విషయంమీదే మా ఇద్దరికీ పోట్లాట జరిగింది. ఉషను పంపించివేయాల్సిన అవుసరం ఏదీ రాలేదని నేను అతనితో వాదించాను. అతనితో వాదించడం మూర్ఖత్వమని గ్రహించి, చివరకి కోపంగా వచ్చేశాను. ఉషను బయటకు పొమ్మనడం మా వదినకి ఇష్టంలేదు. వదినా అన్నయ్యా నిన్న రాత్రి అదే విషయం మీద చర్చించుకున్నారట."

డిటెక్టివ్ వాలి హాలులో చిన్న బల్లమీదున్న టెలిఫోన్ వద్దకు నడిచాడు. తన మిత్రుడైన ఇన్ స్పెక్టర్ రాజయ్యకు ఫోన్ చేసి, కొన్ని విషయాలు కనుక్కున్నాడు. డాక్టర్ రిపోర్టునిబట్టి హత్య 12—12.10 మధ్య జరిగివుండాలని నిర్ణయించబడింది. హత్యకు ఉపయోగించిన ఆయుధం లావుగా పొడుగ్గా వున్న ఒక కర్ర. వాలి తను తెలుసుకున్న విషయాలను నెమరేస్తూ, హాలులోంచి సమీపంలో ఉన్న ఉషాదేవి గదివైపు వెళ్ళాడు.

గది తెరిచివుంది. గుమ్మంలో నిల్చుని వాలి గదిలోకి

తొంగిచూసింది. లోపల బట్టలను స్టాండు మీద సర్దుతూన్న ఒక పనిమనిషి వాలిని చూసి, ముందుకు వచ్చింది.

"అమ్మాయ్ లేదా?"

"బయటకు వెళ్ళారండి" అంది పనిమనిషి.

నవ్వుతూ వాలి ఓసారి స్టాండుమీదున్న చీరలనూ, జాకెట్లనూ గమనించాడు.

"బట్టలను కొనడంలో ఉషాదేవి అభిరుచిని మెచ్చుకోవాలి" అన్నాడతను.

పనిమనిషి మాట్లాడలేదు.

"నిన్న రాత్రి భోజనాల సమయంలో అమ్మాయి ఏ చీర ధరించింది?"

ఒక ఆకుపచ్చ షిఫాన్ చీరను స్టేండునుంచి తీసి పనిమనిషి వాలి దగ్గరకు తెచ్చింది.

ఆ షిఫాన్ చీరను రెండు చేతుల్తోనూ పట్టుకొని వాలి ఆశ్చర్యంతో పరీక్షించాడు.

"అఖండంగా వుంది! అసామాన్యంగా వుంది!" అని ఆ చీరను మళ్ళా ఆమెకు ఇచ్చేశాడు.

పనిమనిషి దాన్ని అందుకొని బట్టల స్టాండువైపు వెళ్ళింది. వాలి నవ్వుతూ తన చేతిలో ఉన్న కత్తెరను, ఆ చీరనుంచి తెగిన ముక్కనూ జేబులో వేసుకున్నాడు.

## 3

ఆ రోజు మధ్యాహ్నం వాలి నిద్రనుంచి లేచి, గదిలో పచార్లుచేస్తూ ఆలోచించసాగాడు. రంగన్న టీ పట్టుకుని గదిలోకి ప్రవేశించాడు.

"రంగన్నా!"

"ఏమండయ్యా?"

"నిన్న రాత్రి హత్య గురించి నీకేం తెలుసు?"

"అంతా పోలీసోళ్ళకి చెప్పానయ్యా!"

"నేను పోలీసువాడ్ని కాదు" అన్నాడు వాలి నవ్వుతూ.

"రాత్రి పదకొండున్నర దాటాక నేను కిందున్న నా గదిలో నిద్రపోయానయ్యా. నా గది అయ్యగారి గదికి సరిగ్గా కిందవుంది. హాలులోని గోడగడియారం 12 కొడుతూండగా వీధి తలుపు చప్పుడయింది. నాకు మెలుకువ వచ్చింది. శంకరంగారు అప్పుడే వచ్చుంటారని అనుకున్నాను. కాస్సేపట్లో మేడమీద అయ్యగారి గదిలో శంకరంగారి మాటల ధ్వని వినపడింది. రాత్రి నిశ్శబ్దంగా ఉండటంవల్ల మేడమీది అయ్యగారి గదిలో ఎవరేనా మాట్లాడితే ధ్వని వినపడ్తూనే వుంటుంది. కాని మాటలు వినపడలేదు. ఆయన వెళ్ళిపోయి పడుకుని ఉంటారని అనుకున్నాను."

"పై గదిలో మాట్లాడిన శంకరం కంఠాన్ని నువ్వు బాగా గుర్తుపట్టావా?"

"అది ఆయన కంఠమేనండి."

"పై గదిలో దుర్గమ్మ మాట్లాడ్డం, నిబ్బరాజు మాట్లాడ్డం వినపడిందా?"

"వినపడిందయ్యా. సాధారణంగా వాళ్ళిద్దరూ చాలా గట్టిగా మాట్లాడుతారు."

డిటెక్టివ్ వాలి ఆలోచిస్తూ మళ్ళా పచార్లు చేయసాగాడు. వంటమనిషి రంగన్న వెళ్ళిపోయాడు. చటుక్కున ఏదో ఆలోచన తట్టినట్టు వాలి గదిలోని బట్టలస్టాండువైపు వెళ్ళాడు. తన కోటుజేబులోని ఎర్ర సిరా పెన్నును బైటకు లాగి, దానిలోని సిరాను తను

క్త తిరించిన షిఫాను చీరముక్క పై విదిపాడు. ఎర్రటి మరకలుపడ్డ ఆ చీరముక్కను మళ్ళా కోటుజేబులో వేసుకొని, అతను నవ్వుతుంటూ కోటు తొడుక్కున్నాడు. చుట్టను వెలిగించి, వేగంగా గదిలోంచి బయటకు కదిలాడు.

వాలి ఉషాదేవి గదిలో ప్రవేశించాడు. మెల్లిగా తలుపులకు లోపల గడియవేశాడు. ఉషాదేవి నిలువుటద్దం ముందు నిల్చుని తల దువ్వుకుంటోంది.

"అమ్మాయ్!"

అతని పిలుపు వినగానే ఆమె చటుక్కున వెనక్కి తిరిగింది.

"మీరా!"

"నిన్న రాత్రి నువ్వు హత్య జరిగిన గదిలోకి వెళ్ళ లేదుగా?"

"నిన్న రాత్రి పదకొండింటికే నేను నిద్రపోయాను. నా గది దాటి నేను బయటకు వెళ్ళలేదు.

వాలి కళ్ళు ఆమెవైపు తీక్షణంగా చూశాయి. అతని కుడిచేయి కోటుజేబులోకి వెళ్ళింది. మరో క్షణంలో అతను చెయ్యి చాచాడు. ఎర్ర మరకలున్న ఆకుపచ్చ షిఫాన్ చీరముక్క అతని అరచేతిలోంచి ఆమెవైపు ఆవులించింది!

"అమ్మాయ్, నిన్న రాత్రి నువ్వా గదిలోకి వెళ్ళక పోతే రక్తపుమరకలున్న ఈ చీరముక్క ఆ గదిలో ఎలా పడుంది?"

ఆమె మాట్లాడలేకపోయింది. హఠాత్తుగా బట్టల స్టాండుమీదున్న ఆకుపచ్చ షిఫాన్ చీరని పరిశీలించింది. అడుగు భాగంలో అది చిరిగినట్టుంది. ఉక్కిరి బిక్కిరి

అవుతూ, ఉషాదేవి వణుకుతూన్న పెదవులతో వాలి కెదురుగా వచ్చి నిలబడింది. మొహంలో నెత్తురుచుక్క లేనట్టుంది. అతని చేతిలోని చీర ముక్కని పదేపదే చూసింది.

"కథ యింతవరకూ వచ్చాక మీకు నిజంచెప్పడం మంచిదేమో" అంది.

వాలి ఆమె దగ్గరగా వెళ్ళాడు. తన రెండుచేతుల్నీ ఆమె భుజంపై వేసి, భయంతో వణుకుతూన్న ఆమె కళ్ళలోకి చూశాడు.

"అమ్మాయ్, నిజంచెప్పడం ఎల్లప్పుడూ మంచిదే."

ఉషాదేవి కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె మెల్లగా చెప్పసాగింది:

"నిన్న రాత్రి పదిగంటలనుంచి నిద్రరాక నా గదిలో పచార్లుచేస్తూ తిరిగాను. దక్షిణామూర్తిగారికి నామీద కోపం వచ్చిందనీ, నన్ను పంపివేయడానికి నిశ్చయించు కున్నారనీ ఇంతకుముందే తెలుసుకున్నాను. ఓసారి ఆయనతో మాట్లాడాలని నిశ్చయించాను. మేడమీద దక్షిణామూర్తిగారి గదిలో 12 వరకూ దుర్గమ్మగారి మాటలు వినపడ్డాయి. ఆమె వెళ్ళిపోవడంతోనే ఒంటరిగా ఆయనతో మాట్లాడవచ్చని అనుకున్నాను. ఇంతలో వీధి తలుపులు తోసిన చప్పుడయింది. కాస్సేపట్లో యెవరో మెట్లెక్కారు. దక్షిణామూర్తిగారి గదిలో శంకరం కంఠం వినపడింది. అతడు బయటకురాగానే దక్షిణామూర్తిగారితో మాట్లాడవచ్చని నేను మెట్ల మీదే నిలబడ్డాను. దక్షిణామూర్తిగారితో శంకరం ఏదో అంటున్నాడు. బాగా తాగడంవలన అతడి మాటలు అంత స్పష్టంగాలేవు. కాస్సేపట్లో అతడు గది

లోంచి బయటకు వచ్చాడు. "మావయ్యా, బాగా నిద్రపో!" అంటూ నడవ మధ్యనున్న మెట్లెక్కి రెండో అంతస్తులోని తన గదివైపు వెళ్ళిపోయాడు. తర్వాత నేను దక్షిణామూర్తిగారి గదిలోకి నడిచాను. ఆయన ముఖం టేబుల్ మీద ఆనివుంచి, నిద్రపోతున్నట్లు ఆయన కనిపించారు. దగ్గరగా వెళ్ళాను. ఆయన తలమీద పెద్ద గాయాలు అగుపించాయి. టేబులుమీద రక్తం మరకలున్నాయి. పట్టుకొని ఆయన్ని లేవదీయబోయాను. ఆయన మరణించారని గ్రహించి భయపడ్డాను. అదే క్షణంలో రొటేటింగ్ కుర్చీ నా చెయ్యి తగిలి కదలడం వలన ఆయన తటాలున కుర్చీలోంచి తివాసీమీదకు జారి పడ్డాడు. ఆయన నోట్లో జేబురుమాలు కుక్కబడివుంది. భయంతో తొందరగా బయటకొచ్చి తిన్నగా నా గదికి పోయి పడుకున్నాను. దక్షిణామూర్తిగారి గదిలో వున్నప్పుడు ఏ కుర్చీకో నా చీర తగిలి ఖంగారులో చిరిగి వుంటుంది. ఆ చిరిగిన ముక్క మీకు దొరికి వుండవచ్చు."

"ఆయనతో ఏమిటి మాట్లాడదామని వెళ్ళావు?" ప్రశ్నించాడు వాలి.

"నేను మంచి కుటుంబానికి చెందిన స్త్రీని కాదని దక్షిణామూర్తిగారు పొరబడుతున్నారు. నిబ్బరాజు గారితో నేను రహస్యంగా తిరగడం ఆయన వినివుంటారు. నిబ్బరాజుగారిని నేను బుట్టులో వేయాలని ప్రయత్ని స్తున్నానని దక్షిణామూర్తిగారు అనుకున్నారు. ఆయనకి నామీద కోపం వచ్చింది. నా కుటుంబాన్ని గురించి నిజం చెబుదామని ఆయన గది కెళ్ళాను. నా తండ్రి కరాచీలో పెద్ద వ్యాపారం చేసి లక్షలు గడించారు. ఇంతలో పాకిస్తాన్ రావడంతోటే మా స్థితి తారుమారు

అయింది. దిక్కులేక కట్టుకున్న గుడ్డలతో అమ్మ, నాన్న, నేనూ భారతదేశం చేరుకున్నాం. ఇక్కడికొచ్చాక అమ్మ టైఫాయిడ్ జ్వరం వచ్చి మరణించింది. ఆమె పోయిన కొన్నివారాల్లో నా తండ్రి కూడా మరణించారు, నేను ఒక్కర్తెనే మాత్రం బ్రతికున్నాను. ధైర్యం తెచ్చుకున్నాను. పొట్టకోసం ఏదో ఉద్యోగం చెయ్యాలి. ఒక అనాధాశ్రమంలో చేరాను. దుర్గమ్మగారు అక్కడ నన్ను చూశారు. ఆమె తనతో వచ్చి తనింట్లో వుండమని నన్ను మరీమరీ అడిగారు. అలాగే ఇక్కడికి వచ్చాను. నేనిక్కడికొచ్చిన మూడు నెలల తరవాత నిబ్బరాజుగారు హైద్రాబాద్ నుంచి వచ్చారు. మొదట్నుంచీ ఆయనకి నామీద ప్రేమ ఏర్పడింది. నన్ను పెళ్ళిచేసుకుంటానన్నారు. ఈ విషయాలన్నీ చెబుదామని దక్షిణామూర్తిగారి గదిలోకెళ్ళాను, కాని నే వెళ్ళేటప్పటికే ఆయన పరలోకంలో ఉన్నారు."

వాలి సానుభూతితో ఆమె బుగ్గమీద వేళ్ళతో నిమిరాడు. ఆమె వీపుమీద అనురాగంతో తట్టాడు. మౌనంగా గుమ్మంవైపు నడిచాడు.

"నన్ను రక్షిస్తారుగా?"

ఆమె ప్రశ్న వెనుక నుంచి దీనంగా వినపడింది. వెను దిరిగి ఆమెవైపు జాలిగా చూశాడు.

"అమ్మాయ్ మానవులు ఊహించలేని శక్తి ఎల్లప్పుడూ నిర్దోషులను కాపాడుతూనే ఉంటుంది" అని వాలి గుమ్మందాటి బయటకు వెళ్ళిపోయాడు.

## 4

కింది భాగంలో ఉన్న లైబ్రరీ గది దగ్గరకు వెళ్ళాడు మూసివున్న తలుపులను తోసుకుని లోపలికి ప్రవేశించాడు.

కుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం చదవటంలో నిమగ్నుడైన మకరమూర్తి తలుపుల చప్పుడు వినగానే ఉలిక్కిపడ్డాడు.

"మీరా!" అన్నాడు మకరమూర్తి వాలిని గుర్తిస్తూ.

జవాబియ్యకుండా వాలి ముందుకు వెళ్ళాడు. ఓ కుర్చీమీద తన రెండు చేతులనూ ఆనించి, వంగి మకరమూర్తిని పరీక్షగా చూశాడు. అతని వయస్సు ఇరవై రెండేళ్ళుంటుంది. పొట్టిగా, బలహీనంగా వున్నాడు. పిరికివాడిలా వున్నాడు. ఇంత అమాయకంగా, బలహీనంగా వున్నతను ఈ హత్య చేసుంటాడా? వాలి ఆలోచించసాగాడు.

"అబ్బాయ్, నిన్న రాత్రి 11 గంటల తర్వాత నువ్వు ఏం చేశావ్?"

"సరిగ్గా పదకొండున్నర అవగానే దక్షిణామూర్తిగారి గదిలోకి దుర్గమ్మగారు వచ్చారు, వాళ్ళు ఏవో మాట్లాడుకుంటారని నేను సెలవుతీసుకొని, గదికి వెళ్ళి పడుకున్నాను."

"రాత్రి పన్నెండూ ఆ సమయంలో ఏ చప్పుడేనా విన్నావా?"

"నేను శవంలా పడుకుంటానండి. ఎంత చప్పుడు చేసినా నాకు వినపడదు."

"నిన్నరాత్రి నీకంటె ముందు నిబ్బరాజా దక్షిణామూర్తిగారితో మాట్లాడాడని విన్నాను. వాళ్ళు ఏం మాట్లాడారో తెలుసా?"

"తెలీదండి. కాని నేను గదిలో అడుగుపెట్టేసరికి దక్షిణామూర్తిగారు కోపంతో భోగిమంటలా మండుతున్నారు.

'ఈ విధవ ఎంతపనైనా చేస్తాడు! దుర్మార్గుడు!' అని గట్టిగా అన్నారు. ఆ మాటలు తమ్ముడ్ని గురించి అన్నవే అని నేను ఊహించాను. చివరికి తమ్ముడుమీద రేగిన కోపాన్ని నామీద కక్కేశారు. దుర్గమ్మగారు రావడంతో లే విముక్తి వచ్చిందనుకుంటూ, వెళ్ళిపోయాను."

"దక్షిణామూర్తిగారు నిన్ను బాగా చూసేవారా?"

"ఆ విషయాలు అడిగి నన్ను బాధపెట్టకండి. మా తండ్రిగారు పోయినప్పట్నించీ ఏదో అరణ్యవాసంలో ఉన్నట్టు ఇక్కడ కాలం గడుపుతున్నాను. ఇంకో మూడేళ్ళు పోతే నా ఆస్తి నాకు వస్తుందని ఆశిస్తూ, యెవరు ఏమన్నా నోరు మూసుకొని జీవిస్తున్నాను. దక్షిణామూర్తిగారు ముక్కోపి. ఆయన కళ్ళకి నేనేదో పురుగులా అవుపడేవాడిని. ఈ పదేళ్ళూ ఆయన నన్ను కాలికిందనున్న పురుగుని చూసినట్లు చూశారు."

డిటెక్టివ్ వాలి ఆలోచిస్తూ, గుమ్మందాటి బయటకు వెళ్ళాడు. అతని మెదడులో మకరమూర్తి అన్న ఆఖరి మాటలు గిర్రున తిరుగుతున్నాయి. కాలికింది పురుగు!

వాలి కిందనున్న హాలులో నిబ్బరాజుకి యెదురుగా కూర్చున్నాడు. కోటు జేబులోంచి ఒక చుట్ట తీసి, వెలిగించి, పొగ పీలుస్తూ ఇలా అడిగాడు.

"అబ్బాయ్, నిన్న రాత్రి నువ్వు ఎన్నింటికి పడుకున్నావ్?"

"రాత్రి 12-30 దాకా నిద్రపట్టలేదు."

"నీ గది యెక్కడుంది?"

"రెండో అంతస్తులో."

"శంకరం గది?"

నిబ్బరాజు విసుగ్గా ఓసారి వాలివైపు చూశాడు.

"రెండో అంతస్తులో ఒకే వరసలో మూడు గదు లున్నాయి. మధ్య గది నాది. ఎడమపక్క గది శంకరంది. కుడిపక్క గది మకరమూర్తిది."

"నిన్న రాత్రి నిద్రపట్టకపోతే ఏం చేశావు?"

నిబ్బరాజు కోపంగా లేచాడు.

"నీలాంటి పిచ్చి డిటెక్టివ్‌లని యింట్లోకి రానిస్తే, పాలోమని ప్రశ్నల వర్షాలు కురుస్తూనే వుంటాయి. ఇతరత్రా చేయవలసిన పనులు చాలా ఉన్నాయి నాకు!"

వాలి విచిత్రంగా నవ్వాడు. "నీ అన్నలాగే నీకు కూడా కోపం యెక్కువ. కాని మీ యిద్దరి హృదయాలు మంచివి. అది నాకు తెలుసు. నీ అన్న హంతకుడ్ని పట్టు కోవాలని ప్రయత్నిస్తున్నాను. ఈ విషయంలో సహాయ పడ్డం నీ ధర్మం కాదా!"

నిబ్బరాజు కింది పెదవిని కొర్కుంటూ, మళ్ళీ కుర్చీలో కూలబడ్డాడు.

"అయితే చెప్తా వినండి. రాత్రి పదకొండున్నర పైదాకా నేను గదిలోనే ఉన్నాను. నిద్రపట్టలేదు. అప్పుడు గదిలోని కుర్చీని బయట నడవలోకి లాక్కుని, ఆలోచిస్తూ దానిలో చాలాసేపు కూర్చుండిపోయాను."

"అప్పుడు మకరమూర్తి ఏం చేస్తున్నాడు?"

"వాడు పక్కగదిలో పడుకున్నాడు."

"పడుకున్నాడని నీకు బాగా తెలుసా?"

"వాడి గదికి తాళంలేదు. దాన్నిబట్టి పడుకున్నాడని అంటున్నాను. వాడు గదిలో లేకపోతే తలుపులకి తాళం వేస్తాడు. అది కాకుండా వాడు ప్రతిరోజూ

మామూలుగా పదిన్నరకే నిద్రపోతాడు."

"అయితే అతను ఈ హత్య చెయ్యలేదంటారా?"

"వాణ్ని అనుమానించినవాళ్ళు మూర్ఖులని నా నమ్మకం. ప్రాణం లేనట్టు వాడు ఈ ఇంట్లో జీవితాన్ని సాగిస్తున్నాడు. అన్నయ్య వాడిని యెప్పుడూ కాలికింద నొక్కి పెట్టి, భయపెట్టి పిరికిపందగా తయారుచేశాడు. మకరమూర్తి తండ్రి తన ఆస్తి అంతకీ అన్నయ్యని సర్వాధికారిగా నియమించడంలో పెద్ద పొరబాటు చేశాడు. ఆస్తి వాడికి ముట్టివుంటే మకరమూర్తి మరో విధంగా అభివృద్ధిలోకి వచ్చి, సంఘానికి ఉపయోగపడే వాడు."

"తన గదిలోంచి మకరమూర్తి కిందకు దిగివుంటే మీరు చూసేవారా?"

"తప్పకుండా చూసేవాడిని. నా గదిముందు నడవలో నేను కూర్చున్నాను. నా ఎడంపక్కనున్న శంకరం గది దగ్గరగా మేడమెట్లున్నాయి. మకరమూర్తి కిందకి వెళ్ళాలంటే నా ముందరనుంచి వెళ్ళి ఆ మెట్లు దిగాలి. ఇంకో తోవలేదు."

"అతను దిగలేదు!"

"నేను పన్నెండూ పదివరకూ అలాగే కూర్చున్నాను. వాడు దిగలేదని నేను చెప్పగలను."

"శంకరం పన్నెండింటికి కింద తలుపులు తోసిన చప్పుడు నీకు వినపడిందా?"

"వినపడింది. కాని కింద తలుపులు చప్పుడయిన అయిదు నిమిషాలదాకా వాడు పైకి రాలేదు."

"అయిదు నిమిషాల్లో శంకరం దక్షిణామూర్తిని సులువుగా చంపొచ్చు. నీ సాక్ష్యాన్నిబట్టి హత్యానేరం

శంకరంమీదకే వెళ్ళింది."

"నేను మొదటే చెప్పేగా మీతో. ఏదో కోపం వచ్చి వాడే చంపివుంటాడు."

"శంకరం పైకి రాగానే నువ్వు పలకరించావా?"

"పలకరించాను. వాడు అదోవిధంగా వున్నాడు. నాతో మాట్లాడకుండా, జంకుతూ తన గదిలోకి వెళ్ళి, తలుపులు మూసుకున్నాడు. మరో అయిదు నిమిషాలు అయాక నేను కూడా నా గదిలోకి వెళ్ళి నిద్రపోయాను."

డిటెక్టివ్ వాలి కళ్ళుమూసుకొని, చుట్టపొగ దట్టంగా పీల్చి వదులుతూ ఆలోచించసాగాడు. హఠాత్తుగా సోఫాలోంచి లేచి మేడమెట్లు ఎక్కాడు.

హత్య జరిగిన గదిలోకి వాలి మళ్ళా ప్రవేశించాడు. ఆ గదిలో వేళ్ళాడుతున్న ఒకో సిల్కు తెరను దుర్గమ్మ పరకాయించి చూస్తోంది. వాలి ఆమె దగ్గరగా వెళ్ళాడు.

"అమ్మాయి, ఏమిటంత దీక్షగా చూస్తున్నావు" అడిగాడతను.

సిల్కు తెర వెనక మేడమెట్లున్నాయి.

"ఆ తెరను చూస్తూంటే నాకు ఏదో జ్ఞాపకం వస్తోంది. ఏమిటో చెప్పలేకుండా ఉన్నాను" అందామె.

వాలి క్షణకాలం ఆలోచించాడు.

"నిన్న రాత్రి నీ భర్తతో మాట్లాడి వెళ్ళిపోయే టప్పుడు ఆ తెరవైపు చూశావా?"

"చూశాను. జ్ఞాపకం వచ్చింది. ఆ తెర వెనక ఏదో నల్లగా అగుపించింది, ఏదో ఆకారం!" అందామె.

డిటెక్టివ్ వాలి అమాంతంగా తెరను పక్కకుతోసి మెట్లవైపు వెళ్ళాడు. మేడ మెట్ల ప్రాంతంలో వంగి, పరీక్షగా దేనికోసమో చూడసాగాడు. కాస్సేపట్లో

వేళ్ళతో ఏదో వస్తువును పట్టుకొని "దొరికింది! దొరికింది" అని అరుస్తూ ఆమెవైపు కదిలాడతను.

దొరికిన వస్తువును తన జేబు రుమాల్తో చుట్టి కొసలు ముడేశాడతను.

దుర్గమ్మ అతడివైపు ఆశ్చర్యంతో చూసింది. ఏదో అడగబోయింది.

"అమ్మాయ్, కిందకు వెళ్దాం పద" అంటూ వాలి గబగబా మెట్లవైపు వెళ్ళిపోయాడు.

కిందనున్న హాలులో వాలి కూర్చున్నాడు. తన జేబు రుమాలుతో కట్టిన మూటను అతను జాగ్రత్తగా టీపాయ్ మీద ఉంచాడు. దుర్గమ్మ, నిబ్బరాజు, ఉషాదేవి, మకరమూర్తి, వంటవాడు రంగన్న — అందరూ టీపాయ్ మీదున్న మూటని విస్మయంతో చూస్తున్నారు. మరో క్షణంలో వాలి గంభీర కంఠం గదిలో ప్రతిధ్వనించింది.

"హత్య జరిగిన గదిలో, తెర వెనుక మేడ మెట్లమీద హత్యే చేసిన వ్యక్తి పొరపాటున వదిలేసిన వస్తువు దొరికింది. మీ దగ్గర ఏదేనా పెట్టెవుంటే ఇయ్యండి."

అందరూ ఆశ్చర్యపోతూ కదలకుండా వుండిపోయారు. రంగన్న మాత్రం వంట యింట్లోకి వెళ్ళి, చిన్న కర్ర పెట్టె పట్టుకొచ్చి వాలికిచ్చాడు. వాలి జేబు రుమాలు మూటను జాగ్రత్తగా ఆ పెట్టెలో పెట్టాడు. పై మూత బిగించాడు. ఆ పెట్టెను పట్టుకొని, "రంగన్నా! యిలా రా" అంటూ వాలి వారందరూ కూర్చున్న స్థలంనుంచి దూరంగా వెళ్ళాడు. రంగన్న వాలిని అనుసరించాడు. వాలి ఏదో రంగన్నకి రహస్యంగా చెవులో చెప్పాడు. తన జేబులోంచి ఇరవై రూపాయలుతీసి అతనికి కిచ్చాడు. రంగన్న సంతోషంగా పెట్టెను అందుకున్నాడు. వాలి

మళ్ళా వాళ్ళందరూ కూర్చున్నచోటుకి వెళ్ళాడు.

"దుర్గమ్మగారూ! నేను మీ ఇంటికి వచ్చిన పని పూర్తయింది. నాకు దొరికిన వస్తువు మూలంగా హంతకు లెవరో అరటిపండు వలిచినట్టు తెలిసిపోయింది. ఆ పెట్టెను జాగ్రత్తగా వుంచమని రంగన్న కిచ్చాను. నేను బయటకు వెళ్తున్నాను. రాత్రి ఎనిమిదింటికి మళ్ళా వస్తాను. ఆ సమయానికి మీరంతా మేడమీద హత్య జరిగిన గదిలో సమావేశమవండి. అప్పుడు మీకు నిజం తెలియజేస్తాను."

వాలి చకచకా గుమ్మందాటి బయటకు వెళ్ళిపోయాడు. హాల్లో కూర్చున్నవారందరూ ఒకర్నొకరు అనుమానంగా చూసుకున్నారు.

# 5

హత్య జరిగిన గదిలోని ఎలక్ట్రిక్ దీపాలన్నీ ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. గోడగడియారం ఎనిమిది కొట్టింది. ఒక గుండ్రటి టేబుల్ చుట్టూ వాళ్ళందరూ గుమిగూడారు. పొద్దుట అరెస్టు చేయబడ్డ శంకరం, ఇన్స్పెక్టర్ రాజయ్యతో సహా వచ్చాడు. వంటవాడు రంగన్న గోడకి జోర్లాపడి నిల్చున్నాడు.

అజానుబాహుడైన డిటెక్టివ్ వాలి తన కుర్చీలోంచి లేచి నిల్చున్నాడు. ఓసారి గర్వంగా తన బుగ్గమీసాల్ని సరిదిద్దుకున్నాడు. చుట్ట పొగ పీల్చి వదులుతూ టేబులు చుట్టూ కూర్చున్న వాళ్ళందర్నీ కలయజూశాడతను.

"నిన్న రాత్రి యీ గదిలో దక్షిణామూర్తి హత్య చేయబడ్డాడు. రాత్రీ పగలూ పనిచేస్తూ ఈ ఇంటికి యిద్దరు గూర్ఖాలు ఉన్నారు. నిన్న రాత్రి బయటవాళ్ళెవరూ లోపలకు రాలేదని తేలింది. అందువలన

ఇంట్లో ఉన్న వాళ్ళే యీ హత్య చేసివుండాలి. అయితే హత్య చేసిన వ్యక్తి ఎవరు?" అన్నాడు వాలి గంభీరంగా.

వాలి చూపును దుర్గమ్మవైపు పోనిచ్చాడు. "డాక్టర్ రిపోర్టునుబట్టి దక్షిణామూర్తి 12—12-0 మధ్య మరణించి వుండాలని తెలుస్తోంది. హత్యకు ఉపయోగించిన ఆయుధం పొడుగాటి, లావుగా వున్న కర్ర. ఆ కర్ర ఆ గదిలో వున్నదే. హత్యకు ఉపయోగించిన ఆయుధాన్ని బట్టి ఆలోచిస్తే యీ హత్య ఆపుకోలేని ఉద్రేకంతో, కసితో జరిగివుండాలని తెలుస్తోంది. నిన్న రాత్రి పన్నెండుదాకా దుర్గమ్మ భర్తతో మాట్లాడుతూ యీ గదిలోనే వుంది. ఇద్దరూ పోట్లాడుకున్నారు, తిట్టుకున్నారు. బతికున్న దక్షిణామూర్తిని ఆఖరసారిగా చూసినది ఆమే!"

దుర్గమ్మ గాభరాగా కుర్చీలోంచి లేచి కోపంగా వాలివైపు చూసింది.

"అయితే, నేనే ఆయన్ని చంపానా?"

"నువ్వు చంపావని నేననలేదు. నీకంటె ఎక్కువగా నీ భర్తతో పోట్లాడిన మరొక వ్యక్తి యిక్కడున్నాడు. అతడు యెంత నీచమైన పనైనా చేస్తాడని దక్షిణామూర్తి అంటే మకరమూర్తి కూడా విన్నాడు. నిబ్బరాజు ముకోప్పి!"

నిబ్బరాజు కుర్చీలోంచి లేచి కోపంగా వాలివైపు వెళ్ళబోయాడు. కాని పక్కనే కూర్చున్న ఇన్‌స్పెక్టర్ రాజయ్య అతడిని బలంగా పట్టుకొని మళ్ళీ కుర్చీలో కూర్చోబెట్టాడు.

"ఇదంతా మోసం! ఈ డిటెక్టివ్‌ని బయటకు

నెట్టెయ్యాలి!" అరిచాడు నిబ్బరాజు.

నవ్వుతూ వాలి అతడివైపు చూశాడు.

"హైదరాబాద్‌లో యింతకుముందు నువ్వు చంపిన వ్యక్తి విషయం మర్చిపోతున్నావు!" అన్నాడు వాలి.

నిబ్బరాజు మొహం వాలేశాడు.

"హైదరాబాద్‌లో ఇంతకుముందు ఒకడిని పిస్టల్‌తో కాల్చి చంపాను. నిజమే. కాని ఆ హత్య చేసినందుకు నన్నెవరూ ఖండించలేదు. అందరూ నన్ను పొగిడారు. నేను చంపిన వ్యక్తి, ఒక నటోరియస్ రేపిస్టు! అనేక మంది నిస్సహాయులైన యువతులను అతడు బలాత్కరించాడు. జంట నగరాల్లో అతడంటే విపరీతమైన భయం ప్రజల్లో ఏర్పడింది. అతడు ఎక్కడైనా కనబడితే పట్టుకోమనీ, పట్టుకోలేకపోతే కాల్చి చంపమని పోలీసులు ప్రచారం చేశారు. ఒక రాత్రి కొంచెం దూరంనుంచి ఎవరో యువతి కేకలు నాకు వినపడ్డాయి. నేను పరుగెత్తుకు వెళ్ళాను. ఆమెను వదిలి అతడు పారిపోయాడు. అప్పుడు అతడివైపు షూట్ చేశాను. అతను కాస్సేపట్లో మరణించాడు. అతడి చావుతో శని విరగడైంది. పోలీసులు కూడా నన్ను మెచ్చుకున్నారు. ఇదీ నిజం. అన్నయ్య హత్యతో నాకు సంబంధంలేదు" అన్నాడు నిబ్బరాజు.

అతడివైపు చూశాడు వాలి.

"నువ్వే హత్య చేశావని నేననలేదుగా! నీలా కోపంగా అర్చేవాళ్ళు యీ హత్య చేసుండరు. మొరిగే కుక్కలు సాధారణంగా కరవవు. ఈ హత్య చాలా తెలివిగా చేయబడింది. కాలికింది పురుగులా తిన్ని దక్షిణామూర్తి చూసేవాడని మకరమూర్తి నాతో అన్నాడు. ఆ మాటలు హత్యా రహస్యాన్ని భేదించాయి. కాలికింది

పురుగు యెప్పుడో ఒకప్పుడు కదులుతుంది. సర్కస్‌లోని సింహం ఒక్కోసారి గర్జిస్తూ మీదకు దూకుతుంది.

పదేళ్ళపాటు మకరమూర్తి యీ ఇంట్లో పురుగులా జీవించాడు. చూసేవాళ్ళకు అతడు అమాయకుడిలా, నిస్సహాయుడిలా కనిపిస్తాడు. కాని అతడిలో కోపం, పౌరుషం లేకపోలేదు. సముద్రపు లోతులు అతడిలో యిమిడివున్నాయి. మకరమూర్తి మంచుకప్పిన అగ్ని పర్వతంలాంటివాడు. పదేళ్ళపాటు అన్నీ సహించాడు. నిన్న రాత్రి దక్షిణామూర్తి తిట్లతో అతడిలోని ఓర్పుకోనే శక్తి మాయమై మరో రూపం దాల్చింది. సంవత్సరాల తరబడి తనలో అంతర్గతంగా అణచివేయబడిన ఉద్రేకం ఒక్కసారి అగ్నిపర్వతంలా పగిలి లావాలా పొంగుతూ ప్రవహించసాగింది. ఆ స్థితిలో గదిలో వున్న ఆ లావుపాటి కర్రసెత్తి, నోట్లో రుమాలు కుక్కి మకరమూర్తి అమాంతంగా...."

మకరమూర్తి భయంతో వణుకుతున్నాడు.

"నేను లోకువని నేరాన్ని నామీదకే తోస్తున్నారా? నేను యీ గదిలోకి మళ్ళా రాలేదు. నా గదిలో నిద్రపోతున్నాను" అన్నాడతను.

"నీ గదికి తాళం వేయకపోవడంవలన 11-30 కల్లా నువ్వు నిద్రపోతున్నావని నిబ్బరాజు పొరబడ్డాడు. దుర్గమ్మ 11-30కి గదిలోకి రాగానే నిద్రపోతానని చెప్తూ నువ్వు వెళ్ళిపోయానన్నావు. కాని నువ్వు గదిదాటి బయటకు పోలేదు. గది మూలనున్న మేడమెట్లు దగ్గర, సిల్కు కర్టన్ వెనుక దాక్కున్నావు. కర్టన్ వెనుక నల్లగా ఏదో ఆకారం కనబడిందని దుర్గమ్మ కూడా చెప్పింది. మాటల ధోరణిలో వాళ్ళిద్దరు నువ్వు వెళ్ళావో

లేదో గుర్తించలేకపోయారు. దుర్గమ్మ వెళ్ళిపోయాక నువ్వు దక్షిణామూర్తిని హతమారిస్తే దుర్గమ్మ సాక్ష్యం నిన్ను కాపాడుతుందని గ్రహించావు. మంచి అవకాశం నీకు చిక్కింది.

"సరిగ్గా పన్నెండింటికి దుర్గమ్మ వెళ్ళిపోయింది. దక్షిణామూర్తి ఏ కాగితాలో చూస్తున్నాడు. నీకు అలవాటైన పిల్లి నడకతో మెల్లిగా కర్టెన్ వెనుకనుంచి బయటకొచ్చి అతడి నోట్లో రుమాలు కుక్కి ఆ కర్రతో అతడి తలను పగులగొట్టి చంపావు. హెడ్ యింజరీస్ మూలంగా అతడు మరణించాడు. తర్వాత బయటకు పోవాలనుకున్నావు. కాని అదే సమయంలో ఎవరో ఆ గదివైపు వస్తూన్న చప్పుడు నీకు వినబడింది. వెనక్కి వెళ్ళి అదే తెర వెనుక దాక్కున్నావు. శంకరం తప్ప తాగి గదిలోకి వచ్చాడు. దూరంగా నిలబడి శంకరం తన మావవైపు చూశాడు. దక్షిణామూర్తి టేబులుమీద తలను ఆనించి పడుకున్నట్లు శంకరానికి కనిపించివుండాలి. అందుకే 'బాగా నిద్రపో మావయ్యా!' అంటూ అతడు బయటకు వెళ్ళిపోయాడు."

వాలి మళ్ళా మకరమూర్తి వైపు చూశాడు.

"బయటకు పోవడానికి మళ్ళా నువ్వు ప్రయతించావు. మళ్ళా ఎవరో గదిలోకొస్తున్న చప్పుడు విని కర్టెన్ వెనుక దాక్కున్నావు. ఈసారి ఉషాదేవి గదిలో కొచ్చింది. ఆమె టేబుల్ దగ్గరకెళ్ళింది. దక్షిణామూర్తి హత్య చెయ్యబడ్డాడని తెలుసుకుంది. ఆమె చెయ్యితగిలి రొటేటింగ్ కుర్చీ కదిలింది. శవం తివాసీమీదకు జారి పడింది. అందుకే టేబులుమీదా, తివాసీమీద రక్తం మరకలు ఉన్నాయి. భయంతో ఆమె వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళాక మెల్లిగా నువ్వు నీ గదికి చేరుకున్నావు!"

మకరమూర్తి నిస్సహాయంగా వాలివైపు చూశాడు.

"నేనే యీ హత్య చేశానని మీరంటే అనొచ్చు. కాని రుజువు ఉండాలిగా!"

డిటెక్టివ్ వాలి గంభీరంగా నవ్వాడు.

"రంగన్నా!" పిల్చాడు వాలి.

గోడవారగా నిలబడిన రంగన్న వాలి దగ్గరగా వచ్చాడు.

"నీకు నేనిచ్చిన పెట్టె గురించి, నువ్వు చూసినదంతా వివరంగా చెప్పు" అన్నాడు వాలి.

అందరూ రంగన్నవైపు చూశారు. అతడు వినయంగా చేతులు నులుపుకున్నాడు.

"వాలిగారు ఇచ్చిన పెట్టెను వంట గదిలోని బీరువామీద పెట్టి కాపలా కాస్తూ కూర్చున్నాను. సాయంత్రం ఐదింటికి కింద ఎవ్వరూ లేరు. మకరమూర్తి వంట గదిలోకి వచ్చారు. కడుపు నొప్పిగా ఉందని, పక్కనున్న షాపు కెళ్ళి ఒక సోడా పట్టుమ్మని నాకు డబ్బిచ్చారు. అలాగే అని డబ్బు తీసుకొని, సోడాకోసం వెళ్ళినట్టు నటించాను. వాలిగారి అజ్ఞ ప్రకారం ఒక సోఫా వెనుక వొంగి కూర్చుని, మకరమూర్తిగారు వంటింట్లో ఏమిచేస్తున్నదీ గమనించాను. ఆయన అటూ యిటూ తొంగిచూసి బీరువామీదున్న ఆ పెట్టెను తెరిచారు. అందులో వున్న జేబు రుమాలు మూటవిప్పి, లోపల ఉన్న వస్తువుని చూసి, మళ్ళా ఎప్పట్లా మూటగట్టి పెట్లో పెట్టేశారు. ఆ క్షణంలో నేను మెల్లిగా బయటకు జారాను. కాస్సేపట్లో సోడాబుడ్డి తెచ్చి ఆయనకు ఇచ్చాను."

వాలి మళ్ళా యిలా చెప్పసాగాడు:

"మకరమూర్తీ! నీ నేరాన్ని నువ్వే రుజువుచేసుకున్నావు. ప్రతీ నేరస్థుడూ హత్యాస్థలంలో తనేదేనా వదిలేశానేమో అని గాభరాపడుతూనే వుంటాడు. నువ్వు దాక్కున్న స్థలంలో, తెర వెనక మేడమెట్లమీద నువ్వు పారేసిందేదో నాకు దొరికుండాలని భయపడ్డావు. అదేమిటో కనుక్కోవాలనే ఆత్రుత — మరెవ్వరికీ లేని ఆత్రుత వాంతపడవడం వలన నీకు అధికంగా వుంది. భయంతో పెట్టెని తెరిచి, నాకు దొరికిన రహస్యపు వస్తువుని కళ్ళారా చూశావు. అంత జాగ్రత్తగా మీ అందరి ముందూ జేబు రుమాలుతో మూటగట్టి, పెట్టెలో పెట్టిన అమూల్యరత్నం నేను చుట్ట కాల్చుకుని పారేసిన అగ్గిపుల్లని ఆలస్యంగా తెలుసుకున్నావు!"

మకరమూర్తి ఊపిరి బరువుగా పీలుస్తూ, తలని టేబులుమీద వాలేశాడు. డిటెక్టివ్ వాలి బుగ్గమీసాలను సర్దుకుంటూ, రంగన్నతో నవ్వుతూ అన్నాడు:

, "రంగన్నా! జేబురుమాలు విప్పి, అమూల్యమైన ఆ అగ్గిపుల్లను వీరందరికీ చూపించు. తరువాత మ్యూజియంకి పంపుదాం."

—:ఐపోయింది:—

# ఎంతో మంచి హంతకుడు!?

## వసుంధర

"సమాజంలో నాకున్న పలుకుబడి గురించి నీకు బాగా తెలుసుకదూ— శేఖర్!" అన్నాడతను.

"తెలుసును సార్! నిరుద్యోగిగా మూడేళ్లుగా రోడ్లు మీద తిరుగుతున్న నాకో దారి చూపించారు. అందుకు మీ పలుకుబడి ఒక్కటేకాదు, మంచితనం కూడా కారణమని నమ్ముతున్నాను—" అన్నాడు శేఖర్.

"నీ వద్ద దాపరికం దేనికి? నా పద్ధతులు నీకు తెలుసు. అవి మంచివికావనీ నీకు తెలుసు...." అని అతనేదో అనబోతూండగా శేఖర్ మధ్యలో అందుకున్నాడు.

"మంచి చెడ్డలెంచడానికి నేనెంతవాడిని సార్! సాటి మనిషికి సాయపడాలనుకునే ప్రతివాడూ మంచివాడేనని నా అభిప్రాయం. స్వరాజ్యం తీసుకురావడానికి మహాత్మాగాంధీ, సుభాష్ చంద్రబోసు భిన్నమార్గాలనుసరించారు. ఎవరి పద్ధతి మంచిదీ అన్న విషయం నేను ఆలోచించను. మొదటి పద్ధతిలో అసంఖ్యాకంగా భార

తీయులు హింసించబడ్డారు. రెండవ పద్ధతిలో బ్రిటిష్ వారు హింసించబడ్డారు. హింస ప్రతిఫలంగా రెండు పద్ధతులలోనూ వచ్చింది—" అన్నాడు శేఖర్.

"చాలా సంతోషం శేఖర్! ఈ నీ అభిప్రాయం ఆధారంగా నాకు సాయపడాలని నిన్ను కోరితే తప్పు పట్టవు కదూ!"

శేఖర్ ఉలిక్కిపడ్డాడు. ఒక్క నిమిషంలో తమాయించుకుని—"సార్! నేను బోసుకు వ్యతిరేకిని కాకపోవచ్చు. కానీ ఆ రోజుల్లో ఉండివుంటే గాంధీగారి ఉద్యమంలోనే పనిచేసి ఉండేవాణ్ని—" అన్నాడు.

"ఎందుకని?"

"నావల్ల రక్తపాతం జరగడం నాకిష్టముండదు...."

అతను నవ్వి-"మిష్టర్ శేఖర్..ఈ ఫోటో చూడు.." అన్నాడు.

శేఖర్ ఆ ఫోటో చూశాడు. అందులో ఓ యువతి ఉన్నది. ఎంతో అందంగా చిరునవ్వులు చిందిస్తున్నది. చూడగానే మరోసారి చూడాలనిపిస్తున్నది. శేఖర్ ఆ ఫోటోవంక మళ్ళీ మళ్ళీ చూశాడు.

"ఈమె అయినింటి ఆడపడుచు. నీకంటే చిన్నది. ఇంటర్మీడియేట్ వరకూ చదువుకున్నది. అన్ని విధాలా నీకు తగినది. ఈమెను పెళ్ళిచేసుకోమని అంటే — అది నాకు సాయంచేయడం అయితే ఒప్పుకుంటావా, లేదా?"

శేఖర్‌కు క్షణం మాటరాలేదు.."ఇదంతా ఎందుకు?" అన్నాడు కాసేపాగి.

అతడు శేఖర్ వైపే చూస్తూ అభిమానంగా నవ్వాడు. "నేను నీకు అన్యాయం తలపెట్టానని భ్రమపడకు. నాకీ యువతిపై ప్రత్యేకాభిమానమేమీ లేదు. ఆమె ఆపదలో

చిక్కుకోబోతున్నది. అదీ నా కారణంగా! ఆమెను రక్షించడానికి మిగిలినది ఒక్కటే మార్గం! అది నువ్వు ఆమెను వివాహం చేసుకోవటం! మీరిద్దరూ ఆదర్శ దంపతులుగా కలకాలం వర్ధిల్లగలరని నా ఆశ...."

"మా యిద్దరినుంచీ మీరేదైనా ఆశిస్తున్నారా?" అన్నాడు శేఖర్.

"మీ యిద్దరి సంగతి అటుంచు. ఈ వివాహం జరిగితే ఆపైన నీనుంచి కూడా ఏమీ ఆశించను...." అన్నాడతను.

విషయమేమిటో శేఖర్‌కు అర్థంకాలేదు. పెళ్ళంటే నూరేళ్ళ పంట అంటారు. అలాంటి విషయంలో ఇతడి మాట విని యెవరో అమ్మాయిని పెళ్ళాడితే ఎలా?

అసలా అమ్మాయి యెవరో .... జీవితంలో యెవరి చేతనైనా మోసగించబడిందేమో .... అతడి దుర్మార్గం గురించి తనకు బాగా తెలుసు. కక్షకడితే అతడికి దయా దాక్షిణ్యాలుండవు. యెలాంటి ఘోరానికైనా వెను దీయడు. నచ్చినంతకాలం వాడుకుని పెళ్ళి జరిపిస్తానని హామీ యిచ్చాడేమో! ఇందుకు తనకంటే వెర్రి వెధవ యెవరూ దొరకలేదేమో! అయినా — ఇలాంటి ఊహ దృష్టిలో ఉంచుకునే ఇతడు తనవంటి వారికి పాయ పడుతూంటాడేమో!

"ఆ అమ్మాయి యెవరివల్లనైనా చెడిపోయిందా?" ఈ ప్రశ్న అడగడానికి శేఖర్ కాస్త ధైర్యంచేశాడు.

అతను నవ్వాడు—"మిష్టర్ శేఖర్ నువ్వు తెలివైన వాడివి కావచ్చు. కానీ నీ ఆలోచనా శక్తి నా విష యంలో సహకరించదు. పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు. వాళ్ళది నిప్పులాంటి కుటుంబం. ఆ పిల్ల

నిప్పు. కాకపోతే ఆమెను సురేష్ ప్రేమిస్తాడా?"

"సురేష్ యెవరు?" అప్రయత్నంగా అడిగాడు శేఖర్.

"ఛైయిర్మన్ గారబ్బాయి...." అన్నాడతడు — "సురేష్ ఆమెను ప్రేమించాడు. కానీ కట్నం లేకుండా పెళ్ళిచేసుకుంటానన్నాడు. సంబంధం యించుమించు నిశ్చయమైపోయింది. రెండు నెలల్లో వాళ్ళిద్దరికీ పెళ్ళి కూడా కావచ్చు...."

"అయితే ఇంక నేను చేయగలిగిందేముంది?"

. "ఈ పెళ్ళి చెడగొట్టాలి. సురేష్ బదులు నువ్వు ఆమెను పెళ్ళిచేసుకోవాలి. ఇదీ నేను నిన్ను కోరేది!"

శేఖర్ దీనికి మరింత భయపడ్డాడు. ఆ అమ్మాయికి ఛైయిర్మన్ గారబ్బాయి సంబంధం కుదిరితే తన పని ఇంకా కష్టమవుతుంది. పెళ్ళిళ్లు చెడగొట్టడం తనవల్ల నెలా అవుతుంది? .... ఈ సంగతే శేఖర్ అతిడికి చెప్పాడు.

"నువ్వు యధాశక్తి ప్రయత్నించు. ఆపైన భగవంతుడో నేనో నీకు సహకరించడం జరుగుతుంది" అన్నాడతడు.

"యధాశక్తి అంటే?" అన్నాడు శేఖర్.

"నువ్వామెను ఆకర్షించు. ఆ ఆకర్షణను ప్రేమగా మార్చు. ఆ ప్రేమ పెళ్ళిగా రూపొందేలా చేయి. అది నీ వైపునుంచి చేయాల్సిన యత్నం..."

"ఆమె నిప్పు అన్నారు. నిప్పంటే నాకు భయం."

"పరుల కొంపలు అంటించాలనుకునేవారే నిప్పుకు భయపడతారు. తన ఇంటి దీపం వెలిగించాలనుకునేవాడు నిప్పుకు భయపడడు...."

శేఖర్‌కి ఏమనాలో తెలియలేదు. ఇంకా మాట్లాడితే అతడికి కోపం వస్తుందని భయపడి — "ఆమె పేరు, చిరునామా చెప్పండి సార్!" అన్నాడు.

"ఆమె పేరు పద్మిని!" అన్నాడతడు. మిగతా వివరాలు అతడు చెబుతూంటే శేఖర్ నోట్ చేసుకున్నాడు.

## 2

ఆమె చేతిలోని సిగరెట్‌తో తన ఎదురుగా వున్న యువతిని సమీపించి—"మీ తియ్యని పేరేమిటో నేను తెలుసుకోవచ్చా?" అనడిగింది.

"నా పేరు పద్మిని. మీ పేరు?" అందా యువతి.

"నా పేరు మానస .... మీ దగ్గర అగ్గిపెట్టె ఉందా?"

"ఎందుకు?" అంది పద్మిని.

"ఇందుకు!" అంటూ మానస సిగరెట్ నొకసారి గాలిలో ఆడించి చూపింది.

"మీరు సిగరెట్ కాలుస్తారా?" పద్మిని మరింత ఆశ్చర్యపడింది.

"ఈమధ్యనే అలవాటయింది. అలవాటయ్యాక అనిపిస్తోంది—అసలు సిగరెట్ అవసరం మగాడికంటే ఆడదానికే యెక్కువని!" అన్నదామె.

"ఎందుకని?"

"మగాడు సర్వ స్వతంత్రుడు. అయినా అతడికి సమస్యలున్నాయి. అతడి సమస్యలు అతడు తెచ్చిపెట్టుకున్నవి. కానీ ఆడదాని సమస్యలు కేవలం మగాడి కారణంగానే వస్తాయి. ఆడదానికి సమస్యలు వద్దన్నా తప్పవు. ఒక్క సిగరెట్ కాల్చానంటే-పావుగంట సేపు

మనసుకెంతో ఉల్లాసంగా ఉంటుంది...."

పద్మిని నిట్టూర్చి — "నాకు తెలిసిన మగాళ్ళందరూ మంచివారే!" అంది.

"యెవరండీ మీకు తెలిసిన మగవారు!" అంది మానస చిరాగ్గా.

"మా నాన్నగారు, తాతయ్య, ఇద్దరన్నలు, ఒక తమ్ముడు...."

మానస నిట్టూర్చి — "వీళ్ళను వదిలి బయట ఒక్కడంటే ఒక్క మగాడితో స్నేహంచేసి చూడండి. వాడి రంగు బయటపడుతుంది—" అంది.

"మీరలా చేశారా?" అంది పద్మిని.

"చేశాను కాబట్టే అంత కచ్చితంగా చెబుతున్నాను. అతడు నాకు అరిచేతిలో స్వర్గం చూపించాడు. నన్ను మత్తులో పడవేశాడు. నేను లొంగిపోయాక అవతలకు పొమ్మన్నాడు. నేను ఏడ్చినా గుండె కరగలేదు...." అంది మానస.

"ఇది ఎప్పుడూ వినే కథే— తెలిసీ అంత సులువుగా మోసపోవడం ఆడదాని తప్పు—" అంది పద్మిని.

"చైర్మన్ గారబ్బాయి కదా — మోసం చేయడనుకున్నాను...."

పద్మిని ఉలిక్కిపడి-"చైర్మన్ గారబ్బాయా? పేరు.." అంది.

"సురేష్!" అంది మానస.

పద్మినికి కాసేపు నోటమాట రాలేదు. తర్వాత పరీక్షగా మానస వంక చూసి— "నేనెవర్నో తెలుసా మీకు?" అనడిగింది.

"చెప్పండి—" అంది మానస.

"నేను సురేష్‌కి కాబోయే భార్యను...." అంది పద్మిని.

మానస స్రమాన్పడిపోయినట్లు క్షణం సేపు పద్మినివంక చూసింది. తనలోత నే ఏదో గొణుక్కుంది. తర్వాత వినిపించీ వినిపించనట్లు-"ఇడియట్, స్కౌండ్రల్ ...." అంది.

"యెవర్నో తిడుతున్నట్లున్నారు...." అంది పద్మిని.

"మిమ్మల్ని కాదు—ఆ సురేష్‌ని!" అంది మానస.

"నా ఎదురుగా ఆయన్ను తిట్టవద్దు—"

మానస చిత్రంగా పద్మినివంక చూసి — "అతడిని నువ్వు ప్రేమిస్తున్నావా?" అనడిగింది.

"లేదు. ఆయనే నన్ను ప్రేమించారు—ఇక్కడే ఈ పార్కులోనే చూసి. వరుసగా వారంరోజులు నా వెంటబడ్డారు. ఒక రోజు మర్యాదగా పలకరించి—తను నన్ను ప్రేమిస్తున్నట్లు చెప్పారు. నన్ను తాకడానికి కూడా ప్రయత్నించలేదు. నేను ఇష్టపడితే పెద్దలతో మాట్లాడతానన్నారు. అంతా పెద్దల ఇష్టం అన్నాను. పెద్దలు మాట్లాడుకున్నారు. మా పెళ్ళి నిశ్చయమై పోయింది—" అంది పద్మిని.

"అతణ్ని మీరు నమ్ముతున్నారా?" అంది మానస.

"నా నమ్మకం సంగతి అటుంచండి. ఒకే ఒక్క సందేహం. నాతో యింత మర్యాదగా ప్రవర్తించిన మనిషి మీతో మరోకలా యెందుకు ప్రవర్తించా రంటారు?"

మానస చురుగ్గా పద్మినివంక చూసి—"మీ దగ్గర అగ్గిపెట్టె వుందా?" అంది.

"లేదు—" అంది పద్మిని.

మానస తన చేతిలోని సిగరెట్‌ను పద్మిని చేతిలో ఉంచి — "ఇది మీ దగ్గర ఉంచండి. ఇప్పట్నించీ సిగరెట్ అలవాటు చేసుకుంటే పెళ్ళయ్యాక యెంతో సంతోషిస్తారు—" అని అక్కణ్నించి వెళ్ళిపోయింది.

## 3

"మీ పేరేనా పద్మిని!" అన్నాడా కుర్రాడు.

"నువ్వెవరు?" అంది పద్మిని.

"నన్ను లక్ష్మమ్మగారు పంపారు—" అన్నాడా కుర్రాడు.

పద్మిని చటుక్కున లేచి నిలబడింది. లక్ష్మమ్మ సురేష్ తల్లి. తనకు కాబోయే అత్తగారు.

"యెక్కడున్నారు?"

"నాతో రండి ...." అన్నాడా కుర్రాడు. పద్మిని అతడిననుసరించింది. ఇద్దరూ ఓ చిన్న యింట్లో దొడ్డి గుమ్మంద్వారా ప్రవేశించారు.

"ఇది లక్ష్మమ్మగారి ఇల్లు కాదే...." అంది పద్మిని.

"ఇది వాళ్ళుండే ఇల్లు కాదండి. అద్దెకిచ్చిన ఇల్లు. మీతో యిక్కడ రహస్యంగా మాట్లాడాలిట. లోపల వారి సెక్రటరీ ఉన్నాడు. అతడు మీకు వివరాలన్నీ చెబుతాడు—" అని ఆ కుర్రాడు వెళ్ళిపోయాడు.

పద్మిని భయంలేకుండా వెళ్ళింది.

గదిలో యువకుడొకడు ఆమెను చూస్తూనే—
"రండి, కూర్చోండి!" అన్నాడు.

పద్మిని తడబడుతూ అక్కడ కూర్చుంది.

"మీరు చాలా అందంగా ఉన్నారు...." అన్నాడతను.

పద్మిని ఇబ్బందిగా నవ్వింది.

"సంప్రదాయమైన కుటుంబానికి చెందినట్లు కనబడుతున్నారు...."

పద్మినికి ఏమనాలో తెలియలేదు.

"సురేష్ నాకు అన్నీ చెప్పాడు. మీరు నాకు నచ్చారు—" అన్నాడతను.

ఈ మాటల అర్థం ఆమెకు తెలియలేదు. చిన్నగా దగ్గింది.

అతడు కొనసాగించాడు — "ఒక మంచి మిత్రుడిగా నాదో సలహా. మీ యిబ్బందు లేమిటో, మిమ్మల్నిందుకు పురిగొల్పిన పరిస్థితులేమిటో నాకు వివరంగా చెబితే సానుభూతితో అర్థంచేసుకని మీకు సహాయపడతాను. కానీ డబ్బుకోసం మీరు ఎంతో పవిత్రమైన శీలాన్ని అమ్ముకోకండి—"

పద్మిని ముఖం ఎర్రగా అయింది-"ఏమిటి మీర నేది?"

"నాకు తెలుసు. మిమ్మల్ని సురేష్ పంపాడు. పంపుతానని అతడంటే వద్దన్నాను నేను. పిల్లను చూశాక నా మనసు మారుతుందన్నాడు...."

ఇద్దరూ ఒకరినొకరు అర్థంచేసుకుందుకు కొంత సేపు పట్టింది.

సురేష్‌కు అతడితో పెద్ద పని పడింది. అతడు వినడం లేదు. డబ్బాశకు కూడా అతడు లొంగలేదు. అప్పుడు సురేష్ పద్మిని ద్వారా ఈ కార్యం సాధించాలనుకున్నాడు. ఆమెను అతడి కైవసం చేయడానికి పథకం వేశాడు. అయితే అతడు అందరిలాంటి వాడూ కాదు. నైతిక విలువలకూ, పవిత్రతకూ ప్రాధాన్యతనిచ్చే వ్యక్తి.

"సురేష్ నా కాబోయే భర్త. అతడిలాంటి పని

చేస్తాడంటే నేను నమ్మలేదు—" అంది పద్మిని. అయితే ఆమె కరతలంలో ఏదుపు తొంగి చూస్తోంది. కనులు కూడా చెమర్చాయేమో ఒకసారి తుడుచుకుంది.

"అతడి కొచ్చి బోయే భార్యలు చాలామంది ఉన్నారని నాకు తెలుసు. అతడెలాంటి పనికైనా వెను దీయడనీ నాకు తెలుసు. అయితే నేను అతడిలాంటి వాడిని కాదు. అతడి కోసం మీరు శీలాన్ని త్యాగం చేయడానికి సిద్ధపడినా, నేను నా పవిత్రతను వదులు కుందుకు సిద్ధంగాలేను. మీరింక వెళ్ళవచ్చు—"

పద్మినికి ఏం మాట్లాడాలో తెలియలేదు. ఇలాంటి అవమానాన్ని కలలో కూడా ఊహించలేదామె. తనను సురేష్ ఈ యువకుడికి తార్చాలనుకున్నాడా? ఇది నిజమా?

ఆమె వెళ్ళి పోబోతూంటే అతడు — "మేడమ్! సురేష్‌కు నా విషయం స్పష్టం చేయండి. మీ రేదైనా ప్రమాదాన్ని శంకిస్తే శేఖర్ అనబడే ఈ మిత్రుడి సాయాన్ని కోరండి—" అన్నాడు.

## 4

"హలో నువ్వా—రామానుజం!" అన్నాడు సురేష్.

"అవును నేనే! నీవల్ల ఒక చిన్న సాయం కావలసి వచ్చాను...." అన్నాడు రామానుజం.

రామానుజం నాటకాల కంపెనీ నడుపుతున్నాడు. ఓ నాటకంలో నేపథ్యంలో విలక్షణమైన గొంతుక కొన్ని డైలాగ్స్ చెప్పవలసి ఉంది. ప్రతి నాటకంలోనూ నిత్య నూతనత్వం చూపాలనుకునే రామానుజం ఈ నాటకంలో స్నేహితుడు సురేష్ గొంతును ఉపయో గించుకోవాలనుకున్నాడు.

"స్క్రిప్టు తీసుకుని వచ్చాను. నువ్వు పలుకు. నాటకీయత నీ గొంతులో అగుపిస్తే రాత్రికి టేపు రికార్డరు తీసుకుని వస్తాను...."

"డైలాగులు చెప్పడం రాదు నాకు...." అన్నాడు సురేష్.

"నీకెలావస్తే అలా చెప్పు!" అన్నాడు రామానుజం.

ఇద్దరూ పక్కగదిలోకి వెళ్ళారు. రామానుజం తలుపులు దగ్గరగా వేశాడు. సురేష్ స్క్రిప్టు చదివి—"ఇది నాకోసమే రాసినట్లుంది. పద్మిని అనే అమ్మాయిని నేను మోసంచేసి అన్యాయం గావించినట్లు అనాలి. నిజంగా నేను ఈ పేరుగల పిల్లను పెళ్ళాడబోతున్నాను. ఇది కాకతాళీయమని నాకు అనిపించటంలేదు—" అన్నాడు.

రామానుజం నవ్వి — "ముందు కానీవు డైలాగులు చెప్పు. నీకు అనుమానంగా ఉంటే పద్మిని అన్న పేరు మార్చేద్దాం. అదంతా టేపు రికార్డు చేసేటప్పటి వ్యవహారం కదా-అందాకా డైలాగులు చెప్పు—" అన్నాడు.

ఏమనుకున్నాడో సురేష్ డైలాగులు చదవనారంభించాడు. సగం చదివాక అతడెందుకో ఆపివేసి చటుక్కున వెళ్ళి తలుపులు తెరిచాడు.

తలుపులకవతల పద్మిని ఉన్నది. ఆమె ఏడుస్తోంది.

"నువ్వా?" అన్నాడు సురేష్.

పద్మిని మాట్లాడకుండా వెనుతిరిగింది.

"నేను చెప్పేది వినివెళ్ళు...." అన్నాడు సురేష్.

"విన్నది చాలు...." ఆమె వీధిలోకి వెళ్ళిపోయింది.

"రామానుజం....నువ్వు చాలా క్రూరంగా నాటకమాడావు...." అన్నాడు సురేష్ వెనక్కు తిరిగి.

రామానుజం ముఖంలో ఆశ్చర్యముంది — "ఇలా జరుగుతుందని నేననుకోలేదు. అయితే ఇప్పుడైనా కొంప మునిగిందిలేదు. త్వరగా వెళ్ళి ఆమెకు స్క్రిప్టు చూపించు. కావాలంటే నేనూ సాక్షిగా వస్తాను...."

"ప్రేమ వ్యవహారాల్లో సాక్షుల్ని నమ్ముకునేవాడు అసమర్థుడు...." అంటూ సురేష్ వీధిలోకి పరుగెత్తాడు.

అతడు పద్మినిని కలుసుకుందుకు ఎంతోసేపు పట్టలేదు. ఆమె విననంటున్నా బలవంతంగా అతడు తన కథ చెప్పి స్క్రిప్టు ఆమె చేతిలో పెట్టి — "ఒక్క అయిదు అయిదు నిమిషాలు పక్కనున్న పార్కుకిరా—" అని బ్రతిమలాడాడు.

ఇద్దరూ పార్కులోకి వెళ్ళారు.

పద్మిని స్క్రిప్టు చదివింది — "మిమ్మల్ని నమ్మాలో నమ్మకూడదో తెలియడంలేదు. ఈ రోజు మీ పేరు చెప్పి నేను పొందిన అవమానం జన్మలో మరువలేనిది. దానిగురించి మిమ్మల్ని నిలదీసి అడగాలనివస్తే మీ మాటలు వినపడ్డాయి. కానీ ఇప్పుడీ స్క్రిప్టు చూశాక.." అని ఆగిందామె.

"ఆ అవమానమేమిటో చెప్పు!" అన్నాడు సురేష్ ఆత్రుతగా.

పద్మిని ఏదో మాట్లాడబోయేలోగా అక్కడికి ఓ యువతి వచ్చింది. ఆమె సురేష్‌ని చూసి పలకరింపుగా నవ్వింది.

"ఎవరండీ మీరు?" అన్నాడు సురేష్.

ఆ యువతి అతడినుంచి పద్మినిమీదకు చూపులు మరల్చి—"డియర్ సిస్టర్! నువ్వెవరో నాకు తెలియదు. కానీ నేను నిన్ను హెచ్చరించాలని వచ్చాను. నా మాట

వింటే బాగుపడతావు. లేదా...." అని ఆగిందామె.

సురేష్ ఆమె వంక ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఆమె మాట్లాడటం ఆపగానే అతడికి ఆవేశం వచ్చింది- "ఊఁ నీ నాటకం బయటపెట్టటం పెద్ద కష్టంకాదు నాకు. ముందు నీ మాటలు పూర్తిచేయి. ఆ తర్వాత నువ్వెవరో నీచేతే చెప్పిస్తాను...." అన్నాడు.

ఆ యువతి అతడి మాటలను లక్ష్యపెట్టలేదు— "ఇతడి స్నేహం వదులుకో. లేనిపక్షంలో ఈ రోజున నన్నడిగినట్లే ఓ రోజు నిన్ను కూడా—ఎవరండీ మీరు— అనడుగుతాడీ సురేష్!"

ఈ మాట పూర్తిచేసి ఆమె మెరుపు వేగంతో అక్కణ్నించి వెళ్ళిపోయింది. సురేష్ పద్మినివంక దీనంగా చూసి—"ఇదంతా ఏదో పెద్ద కుట్ర. యెవరో మన యిద్దరికీ మధ్య అగాథం సృష్టించాలని ప్రయత్నిస్తున్నారు—" అన్నాడు.

"అలా ప్రయత్నించాల్సిన అవసరం యెవరికుంటుంది? నేను అతిసామాన్యురాలిని. నాకోసం ఎవరూ ఇంతటి నాటకమాడరు. మీలోనే ఏదో తేడా వుంది...." అని పద్మిని అక్కణ్నించి వెళ్ళిపోయింది.

సురేష్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఏమిటిదంతా? తనకూ పద్మినికీ మధ్య సృష్టించబడే అగాధంవల్ల యెవరికి ప్రయోజనం? ఆ ప్రయోజనం యెలాంటిది?

ఎంత ఆలోచించినా అతడికి ఏమీ తెగలేదు.

చివరికతడు ఇంటికే వెళ్ళాడు. అప్పుడే తండ్రి కూడా ఇంటికి వచ్చాడు. సురేష్ తండ్రిని సమీపించి— "నాన్నా! ఊహించనిది జరిగింది. పద్మిని నన్ను అనుమానిస్తోంది...." అన్నాడు.

చైర్మన్ గారు కొడుకును శ్రద్ధగా పరిశీలించి—
"పద్మిని నిన్ను అనుమానించడమా? ఆమెకా అర్హత ఉందా?" అన్నాడు.

"అర్హత ఉన్నా లేకపోయినా కారణాలు మాత్రం సబబైనవే! ఆమె నన్ను అపార్థం చేసుకునేందుకు కొందరు ప్రయత్నిస్తున్నారని నా అనుమానం...."

"అయితే వాళ్ళు నీ మిత్రులనే అనుకో-" అన్నాడు చైర్మన్.

"అంటే?"

"పద్మిని ప్రవర్తన మంచిదికాదు. ఈ రోజు నేనది కళ్లారా చూశాను...."

ఎవరో హెచ్చరించగా ఆయన వెళ్ళి గమనించాడు. పద్మిని శేఖర్ని కలుసుకోవటం ఆయన చూశాడు.

సురేష్ గ్రామాన్పడిపోయాడు—"ఇందులో ఏదో మోస ముందని నా అనుమానం—"

"మన అంతస్థుకు తగిన సంబంధం చూసుకోక పోవడం నేను చేసిన మొదటి తప్పు...." అన్నాడు చైర్మన్.

"అయితే ఇప్పుడేం చేయాలి?"

"ఈ సంబంధం వదులుకుంటాను. కారణం కూడా ఆమె తండ్రి మొహంమీదే చెప్పేస్తాను. తన కూతురి సంగతి ఆయనకూ తెలియాలికదా!" అన్నాడు చైర్మన్.

## 5

పద్మిని తండ్రి వరదయ్య కూతురు చెప్పిందంతా విన్నాడు. ఆయనకు వళ్ళంతా చెమటలు పట్టింది.

"ఏదో వెతుక్కుంటూ సంబంధం వచ్చింది కదా

అని నేను సంతోషపడుతున్నాను. ఇందులో ఇంత మోసముందనుకోలేదు. ఇది పెద్దవాళ్ళతో వ్యవహారం. ఈ సంబంధం వదులుకున్నామంటే మనకు చాలా అప్రతిష్ట వస్తుంది. మనకు మనమే కాదన్నామంటే ఆ ఛైర్మన్ గారు మనమీద పగబడతాడు. అలాగని చూస్తూ చూస్తూ కూతురు గొంతు కోయలేను...."

ఆ రోజంతా ఈ విషయమై ఇంట్లో తర్జనభర్జనలు జరిగాయి. చిన్నవాళ్లు ఆవేశపడ్డారు. ఛైర్మన్ అయినా సరే భయపడవలసిందేమీ లేదన్నారు. పెద్దవాళ్ళు నిదానించారు. అంతా కలిసి పద్మిని అడిగారు.

"చెయిర్మన్ అని భయపడకు. నూరేళ్ళ జీవితం గురించి ఆలోచించుకో—" అన్నారు చిన్నవాళ్ళు.

"ఏ మగాడికైనా ఇంతో అంతో దుర్గుణాలుంటాయి. అంతా పెళ్ళాం అదుపుచేయడంలో ఉంటుంది. చైర్మన్ గారి కోడలనిపించుకోవటం సామాన్యమైన అవకాశం కాదు. బాగా ఆలోచించుకో—" అన్నారు పెద్దవాళ్ళు.

ఆలోచించటం ఆడవాళ్ళ కర్తవ్యంకాదు. అందుకే పద్మిని "అంతా మీ యిష్టం" అనేసింది. ఆమెకు భర్త యెలాంటివాడోనన్న భయం ఉంది. చైర్మన్ గారి కోడలనిపించుకోవాలన్న ఆశా ఉంది. అనుకోని ఆపద యెదురైతే తట్టుకోగల నిర్లిప్తతా ఉంది. అందుకే ఆ రాత్రి నిద్ర సులభంగానే పట్టిందామెకు.

మర్నాడామెకు ఉదయమే స్నేహితురాలు కబురు పెట్టింది. ఆమె యింటికి బయల్దేరగా దారిలో శేఖర్ యెదురయ్యాడు. ఆమె ఆతడిని చూడలేదు. అతడే ఆమెను పలకరించాడు. ఆమె చటుక్కున ఆగిపోయింది. ఇతడు తనను ముందురోజు వేశ్యగా భావించాడు.

సిగ్గుతో ఆమె శరీరం కుంచించుకుపోయింది.

"చాలా అర్జంటుగా మీతో మాట్లాడాలి. ఒక్క-అయిదు నిమిషాలు ప్లీజ్!" అన్నాడు శేఖర్.

అతడి ముఖంలో అర్థింపు చూసి కాదనలేకపోయింది ఆమె. పక్కనే పార్కు వుంది. ఇద్దరూ పార్కులో కెళ్ళారు.

"నేను నిన్న మీ మనసును కష్టపెట్టి ఉంటాను. నన్ను మన్నించండి—" అన్నాడు శేఖర్.

"ఇప్పుడేం జరిగింది?" అంది పద్మిని.

"నేను సురేష్‌ను కలుసుకున్నాను. 'డబ్బుకోసం ఇంత వరకూ అందరాడవాళ్ళూ నా మాట విన్నారు. కానీ పద్మిని అందరివంటిదికాదు. నేను నిజంగా వివాహం చేసుకుంటాననే నమ్ముతోంది. అలాంటి యువతిని నీ దగ్గరకు పంపినందుకు మన్నించు—' అని అన్నాడు. ఇప్పుడు మిమ్మల్నెలా వదుల్చుకోవాలా అని చాలా సీరియస్‌గా ఆలోచిస్తున్నాడతను—" అన్నాడు శేఖర్.

పద్మిని విని ఊరుకుంది. మనసులో మాత్రం—"అదే జరిగితే చాలా మంచిది. ఈ వివాహం ఎలా తప్పించాలా అని నాన్న కూడా ఆలోచిస్తున్నాడు—" అనుకుంది.

శేఖర్ ఆమె వంకనే పరీక్షగా చూస్తూ—"సురేష్ చాలా దుర్మార్గుడు. మిమ్మల్ని వదిలించుకోనడంకోసం మీమీద ఎంతటి దారుణమైన అభాండాన్నయినా వేయగల సమర్థుడు. మీరు చాలా జాగ్రత్తగా వుండాలి—" అన్నాడు.

"ఇది చెప్పడానికేనా మీరు వచ్చారు? చాలా థాంక్స్!" అని మర్యాదగా లేచి నిలబడింది పద్మిని.

"నా అసలు ఉద్దేశ్యం అది కాదు. మీవంటి స్త్రీ

మంచి అమ్మాయిని బజారు మనిషిగా భావించి అమ ర్యాదగా మాట్లాడాను. సారీ చెప్పకుంటే తప్ప మనసుకు నిమిత్తముండదనిపించి ఇలా వచ్చాను—....” అన్నాడతను.

పద్మిని మౌనంగా అక్కణ్నించి బయల్దేరింది. శేఖర్ అక్కడే ఆగిపోయాడు. అతడు కదుల్దామనుకునేలోగా ఓ యువకుడు అక్కడికి వచ్చి — “ఎవర్నువ్వు?” అన్నాడు.

శేఖర్ ఆశ్చర్యంగా అతడివంక చూసి—“నా పేరు శేఖర్. కానీ నేనెవరినైతే నీకేం?” అని అడిగాడు.

“అంతా తర్వాత చెబుతాను. ఇందాకా నీతో మాట్లాడిన యువతి ఎవరు?” అనడిగాడా యువకుడు.

“ఆమె నా ప్రియురాలు. పేరు పద్మిని....” అన్నాడు శేఖర్.

“ప్రియురాలంటే—ఊరికే ప్రేమిస్తున్నావా, లేక పెళ్ళికూడా చేసుకుంటావా?” అన్నాడా యువకుడు.

శేఖర్ ఓసారి చుట్టూ చూశాడు. తర్వాత నెమ్మదిగా యువకుడితో — “నీకు నాదో సలహా. ఆడపిల్లల్ని ప్రేమించడం మగాళ్ళ వంతు. పెళ్ళి గురించి అడగడం ఆడవాళ్ళ వంతు. ఇంతవరకూ ఆమె నా దగ్గర పెళ్ళి ప్రసక్తి తీసుకురాలేదు. పైగా తనకు వేరే సంబంధం నిశ్చయమైనట్లు కూడా చెప్పింది. నేను విచారించడం లేదు. నాక్కావలసింది నాకు దొరుకుతోంది. నువ్వు కూడా ఎప్పుడూ ఆడపిల్లల దగ్గర వాళ్ళు మాట్లాడేదాకా పెళ్ళి ప్రసక్తి తీసుకురాకు—” అన్నాడు.

ఆ యువకుడి ముఖం కమిలిపోయింది — “పద్మిని ఇలాంటిదనుకోలేదు. నిప్పులాంటిదనుకున్నాను—”

అన్నాడు నీరసంగా.

"ఆమె ఎలాంటిదైతే నీకెందుకు? కొంపదీసి నువ్వు గానీ ఆమెకు కాబోయే భర్తవు కాదుగదా!" అన్నాడు శేఖర్.

"అవును. నా పేరు సురేష్!" అన్నాడా యువకుడు అక్కణ్ణించి వెళ్ళిపోతూ.

అతడు వెళ్ళిపోయాక శేఖర్ తనలో తాను నవ్వు కున్నాడు.

## 6

ఆ సాయంత్రం చైర్మన్ స్వయంగా వరదయ్య యింటికి వెళ్ళాడు. వరదయ్య ఆయనకు బాగా మర్యాద చేశాడు.

"నేను మర్యాదలందుకుందుకు రాలేదు. మీ సంబంధం వదులుకుందుకు వచ్చాను—" అన్నాడు చైర్మన్.

వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది వరదయ్యకు. కానీ ఆయన ఆమాట పైకి అనలేదు. తన సంతోషాన్ని బయట పెట్టలేదు — "హఠాత్తుగా ఇలాగంటున్నారు. ఏం జరిగిందండీ?" అన్నాడు.

"ఏం జరిగిందో తెలుసుకోకపోవటమే మీకు మంచిది—" అన్నాడు చైర్మన్.

"మీరు మగపెళ్ళివారు. ఏమన్నా చెల్లుతుంది. కానీ ఆడపిల్ల తండ్రిగా కారణం తెలుసుకోకపోతే—నలుగుర్లో నేను తలెత్తుకు తిరగలేను—" అన్నాడు వరదయ్య.

"కారణం తెలియకపోవటమే మంచిది. తెలిస్తే మీ తల పైకి లేవదు—"

"ఫరవాలేదు—చెప్పండి!"

"సరే—అయితే చెబుతాను వినండి! మీ అమ్మాయి

ప్రవర్తన సరైనది కాదు—"

పక్కలో పిడుగుపడినట్లు ఉలిక్కిపడ్డాడు వరదయ్య. ఆయన ముఖం కోపంతో ఎర్రబడింది—"మీకు సంబంధం నచ్చకపోతే నచ్చలేదని చెప్పండి. కానీ ఆడపిల్ల మీద ఇలాంటి అభాండాలు వేయకండి—" అన్నాడు.

"ఇది అభాండం కాదు. పచ్చి నిజం...."

"ఋజువులున్నాయా?"

"నేను నిన్న చూసి మా సురేష్‌తో అంటే వాడు నమ్మలేదు. ఈ రోజు వాడు కూడా కళ్ళారా చూశాడు. ప్రత్యక్షసాక్ష్యానికి ఋజువులు కూడా కావాలా?"

వరదయ్య ఆవేశపడ్డాడు—"మీకు డబ్బుంది. అధికారముంది. మాబోటివారింటి పిల్లని చేసుకోవటం మీకు ఇష్టంలేదు. అందుకే ఇలాంటి అభూతకల్పనలన్నీ చేసి చెబుతున్నారు. మేమేం మిమ్మల్ని మా పిల్లను చేసుకోమనలేదు. మా పిల్ల మీవాడిని ప్రేమించానని అననూ లేదు. ఇప్పుడు నాకంతా అర్థమవుతోంది. మీరు మా మీద గేలం వేయాలనుకున్నారు. మీకాక్కావలసింది పెళ్ళికాదు. మా పిల్ల. అది సాగదని తెలిశాక ఇప్పుడు మమ్మల్ని వదుల్చుకుందుకు చూస్తున్నారు. మీవాడి గురించి మేమూ చాలా విన్నాం. కానీ మీరు కలవారు కావటంతో వెంటనే వచ్చి ఉన్నమాట అనలేక పోయాం...."

వరదయ్య ఇంకా ఏదో అనబోతూండగా—"ఇన్ని మాటలొద్దు. మావాడి గురించిన ఋజువులు మీరు తీసుకునిరండి. మీ అమ్మాయి గురించిన ఋజువులు నేను తీసుకొస్తా. తప్పు నాదైతే లెంపలేసుకుని ఈ పెళ్ళికి ఒప్పుకుంటాను. కాని పక్షంలో మీ అమ్మాయి చరిత్ర

పత్రికలకెక్కుతుంది. ఈ జన్మకు పెళ్ళికాదు...." అని వెళ్ళిపోయాడు చైర్మన్.

ఆయన వెళ్ళిపోయాక తేరుకునేందుకు చాలా సేపు పట్టింది వరదయ్యకు. తర్వాత ఆయన కుటుంబ సభ్యులకు జరిగిందంతా చెప్పాడు.

వింటూనే పద్మిని అన్న చలపతి ఆవేశంగా లేచాడు- "ఆ తండ్రీ కొడుకులిద్దర్నీ ఇప్పుడే చంపేసి వస్తాను...." అన్నాడు.

"చలపతీ-పేదవాడి కోపం పెదవికి చేటు, నువ్విప్పుడీ మాటలు అన్నట్లు తెలిస్తే నే చాలు — హత్యదాకా అక్కర్లేదు. నిన్ను జైల్లో పెట్టించడానికి చైర్మన్ సర్వ సమర్థుడు. జరిగిందంతా ఎప్పటికప్పుడు మన పద్మిని చెప్పబట్టి కానీ లేకపోతే నేనే దాన్ని అనుమానించి ఉండేవాణ్ని. ఆయన నాటకం చాలా తెలివిగా ఆడించాడు. ఇప్పుడు మనం చేయగలిగిందేమీ లేదు— మరో సంబంధం వెతుక్కోవడం తప్ప!" అన్నాడు వరదయ్య.

చలపతి కాస్త తగ్గి—"సరే—మీ వ్యవహారం మీరు చూసుకోండి. మీకు ఇబ్బంది కలిగించని విధంగా నేను వాళ్ళకు బుద్ధి చెబుతాను—" అన్నాడు.

"వద్దురా బాబూ — నువ్వు వాళ్ళ గురించి ఆలోచించకు. ఆవేశం వస్తే నీకు ఒళ్ళు తెలియదు...." అన్నాడు వరదయ్య కంగారుగా.

## 7

తండ్రిమాటలు విని చలపతి తగ్గిపోలేదు. అతడు తన మిత్రుడు డేవిడ్‌ని కలుసుకున్నాడు.

డేవిడ్‌కీ చలపతికీ స్నేహం ఎలా కలిసిందో చెప్పటం

కష్టం. ఇద్దరూ భిన్న ధృవాలు. ఒకడు నీడచాటున హాయిగా బ్రతుకుతూంటే రెండోవాడు నీడలాంటి జీవితాన్ని గడుపుతున్నాడు. డేవిడ్ కిరాయిగూండా. అతడు హత్యలు అవలీలగా చేస్తాడని చెప్పుకుంటారు.

"ఏం బ్రదర్ — చాలా రోజుల తర్వాత దర్శన మిచ్చావు...." అన్నాడు డేవిడ్ చలపతిని పలకరిస్తూ.

"నువ్వు నన్ను బ్రదర్ అని పిలిచావు. అంటే నా చెల్లెలు నీకూ చెల్లెలేకదా!" అన్నాడు చలపతి.

"అవును. కాదని ఎవరన్నారు?"

"కాదని ఎవరూ అనలేదు. నీ చెల్లెలికి అవమానం జరిగితే కాదని ఊరుకోగలవా నువ్వు?" అన్నాడు చలపతి.

"అర్థమయింది. ఆ వెధవెవడో చెప్పు. వాడికి బుద్ధి చెప్పి తీరతాను—" అన్నాడు డేవిడ్ ఆవేశంగా.

"వాడి పేరు సురేష్. చైర్మన్ కొడుకు—" అన్నాడు చలపతి.

డేవిడ్ ఆవేశం చల్లారిపోయింది—"విషయమేమిటో వివరంగా చెప్పు బ్రదర్!"

"చెప్పడానికేముంది?" అంటూ క్లుప్తంగా జరిగింది చలపతి.

"అయితే ఇప్పుడేం చేయమంటావ్?" అన్నాడు డేవిడ్.

"ఆ సురేష్‌గాణ్ని చంపేయాలి!"

"వీలుపడదు...." అన్నాడు డేవిడ్ — "న్యాయ శాస్త్రాలే ఉరిశిక్షను రద్దుచేయాలనుకుంటున్నాయి. ఎంత దుర్మార్గుడినైనా సరే సంస్కరించడానికి ప్రయత్నించాలి. సురేష్ చేసింది పెద్దతప్పు కాదు...."

"ఏమిటీరోజు—నీతి సూత్రాలు వల్లెవేస్తున్నావు?" అన్నాడు చలపతి.

"అనువుగానిచోట అధికులమనరాదు...." అన్నాడు డేవిడ్.

"అంటే?"

"రామ రావణ యుద్ధంలో రావణాసురుడు చివరి దాకా చావలేదు. రాజులంటే వాళ్ళే! తాము సృష్టించిన యుద్ధంలో కూడా చివరిదాకా మిగిలి ఉండగల్గుతారు. యుద్ధం మంచిదా, శాంతి మంచిదా అని ఆలోచించుకునేందుకు వారికి బోలెడు వ్యవధి ఉంటుంది. చైర్మన్ కూడా ఈ ఊరికి రాజులాంటివాడు. నేను రాజుల తొత్తును. అందుకే హత్యలు చేసినా ఇంకా జైలుబయటే ఉన్నాను...."

"నువ్వింత స్వార్థపరుడవని అనుకోలేదు. నీ స్వార్థం కోసం నీ చెల్లెలి అవమానాన్ని కూడా సహించదల్చుకున్నావు...." అన్నాడు చలపతి నీరసంగా.

"నా స్వార్థం విషయం అటుంచు. పద్మిని నాకు వరుసకు చెల్లెలు. కానీ సీతామె తోడబుట్టిన ఆడపడుచు. ఆమెకు అవమానం జరిగితే స్వయంగా ప్రతీకారం తీర్చుకోక మధ్య నా దగ్గర కెందుకు వచ్చావ్? అది నీ స్వార్థంకాదా?" డేవిడ్ సూటిగానే ప్రశ్నించాడు.

చలపతికి ఏమనాలో తెలియలేదు.

డేవిడ్ సానునయంగా — "నేనిలాగన్నానని కోపగించుకోకు. సూర్యుడివైపు ఎగరాలనుకుంటే పక్షి రెక్కలు కాలి పడిపోతుంది. అవమానాల విషయాల్లో కూడా మనకు పట్టూ విడుపూ ఉండాలి—" అన్నాడు,

చలపతి అతడి మాటలు వింటూ — "నువ్వన్నదీ నిజమే! సురేష్‌కు నేనే స్వయంగా బుద్ధి చెప్పటమే సబబు—" అన్నాడు.

"అరే—అఘాయిత్యం తలపెట్టకు. అది నీ వంటికి సరిపడదు.." అన్నాడు డేవిడ్. చలపతి అతడి మాటలు వినకుండా అక్కణించి కదిలాడు.

# 8

రాజమ్మ, సీతమ్మ — పెన్సిల్సు పట్టుకుని సిద్ధంగా ఉన్నారు.

"ఎస్—ప్రొసీడ్!" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"నామీద ఏదో పెద్ద కుట్ర జరుగుతున్నదని అనుమానంగా ఉంది—" అన్నాడు సురేష్. అతడి కనులలో ఆందోళన స్పష్టంగా కనబడింది.

"అందుకు కారణం?" అనడిగాడు వెంకన్న.

"ఇదీ అని చెప్పలేను సార్! మీరు డిటెక్టివ్‌లు. అన్నీ పరిశోధించి వివరంగా తెలుసుకోవాలి. నేను పద్మిని అనే అమ్మాయిని ప్రేమించి వివాహం చేసుకోవాలనుకున్నాను. మా నాన్నగారు కూడా ఒప్పుకున్నారు. కానీ ఈలోగా ఆమె నన్ను అనుమానించే పరిస్థితులు ఏర్పడ్డాయి. అవెలా సరిదిద్దాలా అనుకునేలోగా ఆమెను అనుమానించే పరిస్థితి ఏర్పడింది. ఇది యెవరో కావాలనే చేశారని ఇప్పుడు నాకు అనిపిస్తోంది...." ఒక్క క్షణం ఆగి ఊపిరి పీల్చుకున్నాడు సురేష్.

"ఎందువల్ల?" అన్నాడు వెంకన్న.

"నిన్న సాయంత్రం పార్కులో నామీద హత్యా ప్రయత్నం జరిగింది. నేను మరోసారి పద్మినితో అన్ని విషయాలూ స్వయంగా మాట్లాడాలనుకున్నాను. ఆమె

ంటికి కబురుపెట్టి పార్కులో ఎదురుచూస్తున్నాను.
మె రాలేదు. అప్పుడు నామీదకు వచ్చి పడిందొక
స్తువు. అది ఒక కత్తి! అదృష్టవశాత్తూ నాకు పిడివైపు
గిలింది. కత్తి చాలా పదునుగా వుంది...."

వెంకన్న అందుకుని చూసి—"నీమీద కత్తి విసిరిన
ాడు ఇలాంటి పనులకు కొత్తవాడైనా అయ్యుండాలి.
ేదా చంపకుండా నిన్ను బెదిరించటమే అతడి ఉద్దేశ్య
ృయుండాలి—" అన్నాడు.

సురేష్ నెమ్మదిగా—"నేనీ విషయం ఇంట్లో చెప్ప
ేదు. ఈ హత్యా ప్రయత్నానికీ, నా వివాహానికీ సంబంధ
ున్నదని నాకు అనుమానంగా ఉంది. మీరు పరిశోధించి
ర్జంటుగా నాకే విషయం చెప్పాలి. ముఖ్యంగా మీరు
జశేఖర్ ఎవడో ఈ నాటకంలో అతడి పాత్ర ఏమిటో
తెలుసుకోవాలి. ఇప్పటికే పెద్దలకు సంబంధించినంత
రకూ మా వివాహం రద్దయిపోయింది. కానీ ఒకందుకు
ాకు బాధగా ఉంది. నాలో అవలక్షణాలున్నట్లు ఒక
యువతి ఆరోపించింది. ఆ యువతి యెవరో నాకు
తెలియదు. నేను పవిత్రుడనని పద్మినికి తెలియాలి. నేను
డపిల్లలతో ఆడుకునే మనస్తత్వం గలవాడిని కాను.
ది మీరు ఆమెకు తెలియజెప్పాలి—" అన్నాడు.

"కానీ నీ గురించి నాకు తెలియదే!" అన్నాడు
వెంకన్న.

"డిటెక్టివ్‌లు మీరు. నా గురించి తెలుసుకోడానికి
ంతో సేపు పట్టదు. మీకు న్యాయమని తోచిందే ఆమెకు
చెప్పండి—" అన్నాడు సురేష్. అతను వెయ్యి
ూపాయలు బల్లమీద ఉంచి—"ఇది అడ్వాన్సు....
ామీద హత్యా ప్రయత్నం చేసినవాడి ఆచూకీ సంపా

దించడం, నా వివాహం అపడానికి ఎవరు ప్రయత్ని స్తున్నారో తెలుసుకోవటం, పద్మినికి నా మంచితన వివరించటం-ఇవీ నేను మీనుంచి కోరేది...." అన్నాడు

వెంకన్న వెయ్యి రూపాయలూ తీసుకుని జేబులో పెట్టుకుని—"నీవు నాకు కొన్ని అడ్రసులు చెప్పాల్సి ఉంది—" అన్నాడు. సురేష్ చెబుతూంటే సీతమ్మ రాజమ్మ నోట్ చేసుకున్నారు.

సురేష్ వెళ్ళిపోయాడు. అతడు గుమ్మం దాటిన మరు క్షణం టెలిఫోన్ మ్రోగింది. సీతమ్మ, రాజమ్మ, వెంకన్న ముగ్గురూ తమ యెదురుగా ఉన్న రిసీవర్లు తీసుకున్నారు ఫోన్‌లో ఏ సంభాషణైనా డిటెక్టివ్లూ, అతడి అ సిస్టెంట్లూ ఒకేసారి వినే సదుపాయముంది.

"హలో!" అన్నాడు వెంకన్న.

"డియర్ డిటెక్టివ్ వెంకన్నా!" అంది ఫోన్‌లో కంఠం—"నువ్వంటే నాకు ఎంతో గౌరవముంది. సురే మీద కత్తి విసిరినవాడు పద్మిని అన్న చలపతి. హత్య చేయాలన్న ఆవేశముంది కానీ తెలివిలేదు. మొద ప్రయత్నం విఫలంకాగానే చప్పబడిపోయాడు. అత గురించి తెలుసుకుని నీకు ప్రయోజనముండదు. ఇం మిగతా విషయాలూ విచారించ నవసరంలేదు. అవి నీ: ముఖ్యంకాదు. సురేష్ ఇచ్చిన ఫీజంటూవా? దాని గురిం సంజాయిషీ ఇచ్చుకునేందుకు అతడు రేపటిదా ఉండడు. అందుకని ఈ కేసుకోసం నీ సమయం వృధ చేసుకోకు. నీ సమయం విలువ తెలిసినవాడిని కాబ చెబుతున్నాను...."

అవతల క్లిక్‌మంది.

"చాలా ఆశ్చర్యంగా ఉంది!" అన్నాడు వెంకన్న

"ఇలా సురేష్ గుమ్మం దాటగానే అలా ఫోన్
చ్చింది. అంటే ఫోన్ చేసినవాడు, దగ్గరలోనే ఉండి
ురేష్‌ని కనిపెడుతున్నాడా-లేక ఇది కాకతాళీయమా?"
ంది రాజమ్మ.

అసిస్టెంటు మాటలు వింటూనే వెంకన్న చటుక్కున
ాడు.

ఫోన్ చేసినవాడు తమకు చాలా దగ్గరలో ఉండి
ండి ఉండాలి. ఎంత దగ్గరలో?—ఈ వీధి మొత్తానికి
మ ఇంట్లోనూ ఎదురింట్లోనూ మాత్రం ఫోన్ ఉంది.
ోన్ ఎదురింటినుంచే వచ్చి ఉండాలి.

వెంకన్న వీధిలోకి వచ్చాడు. ఎదురింటికి తాళంవేసి
ంది.

ఎదురింటివారు ఊరికి వెళ్ళి నాలుగురోజులైంది. మరి
ోన్!

లోపల ఎవరైనా వున్నారేమో!

వెంకన్న వేరే ప్రయత్నాలు చేయలేదు. అతడు
ంసేపు సూటిగా ఆ యింటినే చూస్తున్నాడు. ఆ ఇంటి
ుత్తం ఆకారం అతడి కళ్ళ ముందున్నది. వెనుకవైపు
ుంచి ఆ యింట్లోకి ఎవరైనా దూరే అవకాశమున్నది.
ంటి వెనుక చిన్న సందు ఉంది. సందులోంచి గోడ
ాకితే....

వెంకన్న క్షణాలమీద ఆ ప్రాంతం చేరాడు. ఎదు
ంటివాళ్ళ దొడ్లోంచి ఆ యిరుకు సందులోకి గోడదూకిన
క్తి వెంకన్నకు దొరికిపోయాడు.

"ఎవర్నువ్వు?" అన్నాడు వెంకన్న.

"ఎవరండీ మీరు?" అన్నాడతను.

అదే గొంతు .... వెంకన్న గుర్తుపట్టాడు — "నువ్వ

నాకు ఇప్పుడే ఫోన్ చేశావు ...” అన్నాడు.

“నేను మీ కెందుకు ఫోన్ చేస్తాను?” అన్నాడతను.

“అది తర్వాత — ముందు నువ్వు గోడ దూకడానికి కారణం చెప్పు...”

“తాళాలు గాలిలోకి ఎగరేస్తూ రోడ్డుమీద నడవటం నాకు అలవాటు. అల్పాచమానానికని ఈ సందులో దూరి ఎగురవేయడంలో గోడకు అవతలపడ్డాయి తాళాలు వెళ్ళి తెచ్చుకున్నాను” అంటూ అతడు తాళాలు చూపించాడు.

“అలా కాదు. దొంగతనంగా నువ్వీ యింట్లో దూరి వస్తున్నావంటాను....” అన్నాడు వెంకన్న.

“ఈ యింట్లో అయితే దొంగతనంగా దూరడ మెందుకూ—దర్జాగా వీధి తలుపులు తీసుకునే వెళ్ళగలనుగా—” అన్నాడతను.

“అప్పుడు నువ్వు నాకు ఫోన్ చేసిన విషయం రహస్యంగా ఉండదుగా—” అన్నాడు వెంకన్న.

“మీ రేమంటున్నారో నాకు తెలియదు. ఈ యింటి వాళ్ళు నాకు బంధువులు. వెళ్ళేటప్పుడు నాకు తాళాలిచ్చి కూడా వెళ్ళారు. అసలు వీధి గుమ్మంలోంచి వెళ్ళి ఓసారి ఇల్లంతా ఎలాగుందో చూద్దామని బయల్దేరాను. ఈలోగా ఎలాగూ దొడ్లోకి దూకానుగదా అని దొడ్డి తలుపు తాళంతీసి ఇల్లంతా చూసి వచ్చాను....”

“అప్పుడే నాకు ఫోన్ చేశావు....”

“ఫోన్ చేశాననే అనుకోండి. ఇప్పుడేమంటారు?”

“నాతో పోలీసు స్టేషన్ కు రమ్మంటాను....” అన్నాడు వెంకన్న.

“నేను దొంగతనం చెయ్యలేదు. పోలీస్ స్టేషను కెందుకు

రావాలి? ఈ తాళాలు ఈ యింటివి కావో అవునో పరీక్షించి అప్పుడు నామీద అభాండం వేయండి—"
అన్నాడా వ్యక్తి.

వెంకన్న పరీక్షించగా అవి ఆ యింటి తాళాలేనని తేలాయి. వెంకన్న ఆ వ్యక్తిని ఫోటో తీశాడు. వేలి ముద్రలు తీసుకున్నాడు.

"ఈ రాత్రి సురేష్‌కి ఏం అపకారం జరిగినా—నేను నిన్నే వేటాడతాను. ఈ ప్రపంచంలో ఎక్కడున్నా నిన్ను పట్టుకోగలను—" అన్నాడు వెంకన్న.

"మీరేమంటున్నారో నాకు తెలియదు. కానీ ఆ సురేష్ ఎవరో అతడికి ఈ రాత్రి ఏం అపకారమూ జరగరాదని నేనూ మనసారా కోరుకుంటున్నాను. అయినా మీవంటి డిటెక్టివ్‌ల రక్షణ పొందినాక అతడి ప్రాణాలకు భయమేమిటి?" అని ఆ వ్యక్తి తాళాలతో సహా వెళ్ళిపోయాడు.

# 9

వరదయ్య కంగారుగా — "ఏరా — ఆయన చెబుతున్నది నిజమేనా?" అన్నాడు.

చలపతి ఆశ్చర్యంగా — "ఇంత తక్కువ వ్యవధిలో మీరీ సంగతి ఎలా తెలుసుకున్నారు?" అనడిగాడు. అతడి ప్రశ్నలోనే జవాబు ఉన్నది.

అప్పుడు వెంకన్న తన సంచీలోంచి కత్తితీసి అతడి ముందుంచి—"హత్యచేసి ఏదో సాధిద్దామనుకునేవాడు తను తన భవిష్యత్తును హత్య చేసుకుంటున్న విషయం ఎప్పుడు గుర్తిస్తాడో తెలియదు. నాలాంటి డిటెక్టివులు నీటిలో జాడలు తీయగలరు. ఈ విషయం చెప్పి నిన్ను హెచ్చరించడానికి వచ్చాను—" అన్నాడు.

"ఈ రహస్యం మీ కడుపులో పెట్టి దాచుకోండి. మావాడిలాంటి వెధవ పని మళ్ళీ చేయకుండా నేను చూసుకుంటాను—" అన్నాడు వరదయ్య.

"అది సరే—నేను ఇంకా మీ అమ్మాయితో కూడా మాట్లాడవలసి ఉంది—" అన్నాడు వెంకన్న. అతడు పద్మినిని అడిగి వివరాలన్నీ తెలుసుకున్నాడు. మనసులో ఇద్దరి కథలూ కలుపుకున్నాడు. వెంటనే ఎవరో నాటక మాడినట్లు అతడికి అర్థమైపోయింది.

వెంకన్న పద్మినికి తను అర్థం చేసుకున్న మొత్తం కథ చెప్పి—"ఇందులో ఏదో పెద్ద నాటకముంది. సురేష్ సచ్ఛీలుడని నేను చెప్పలేను. కానీ మీ యిద్దరిమధ్యా ఇటీవల కాలంలో జరిగిన సంఘటనలు మాత్రం ఎవరో కల్పించిన నాటకం. అతడిని నువ్వు అనుమానించడానికి ఈ సంఘటనలే కారణమైతే అతడిని అనుమానించడం అన్యాయమూ, అనవసరమూ—" అన్నాడు.

వరదయ్య కంగారుగా—"అయితే ఇప్పుడేం చెయ్యాలి? చైర్మన్ గారింటికి వెళ్ళి అన్నీ చెప్ప మంటారా?" అన్నాడు.

"ఈ నాటకంలో ఆయన పాత్ర యెంతవరకూ ఉన్నదో నాకు తెలియదు. నేను మాట్లాడేవరకూ మీరు ఆయన్ను కలవకండి—నేను మీకు కబురు పంపుతాను-" అన్నాడు వెంకన్న.

## 10

డిటెక్టివ్ వెంకన్న చైర్మన్ యింటికి వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికి చైర్మన్ ఇంట్లోనే వున్నాడు. ఆయనకు వెంకన్న గురించి తెలుసు.

"నమస్కారం — రండి — కూర్చోండి!" అన్నాడు

చైర్మన్.

"నేను డిటెక్టివునని మీకు తెలుసు. కానీ ఈ రోజు పెళ్ళి పెద్దగా మీ యింటికి వచ్చాను—" అన్నాడు వెంకన్న.

"అంటే?" అన్నాడు చైర్మన్ ఆశ్చర్యంగా.

సురేష్‌కీ, పద్మినికీ మధ్య ఈ మధ్య కాలంలో జరిగిన నాటకం గురించి వెంకన్న ఓపికగా వివరించాడు.

చైరన్ ముఖం గంభీరంగా మారిపోయింది—"అయితే వరదయ్య మీ మధ్యవర్తిత్వం కోరాడన్న మాట!" అన్నాడు వెంకన్న.

"అలా ఎందుకనుకుంటున్నారు?" అన్నాడు వెంకన్న.

"తన కూతురి చరిత్ర నేను బయటపెట్టాను. అది మాపుకుందుకు ఆయన మీ సాయం తీసుకున్నాడు...."

వెంకన్న నవ్వి—"నే నెవరి తరఫున పనిచేస్తూ ఇక్కడికి వచ్చానో తెలిస్తే మీరు చాలా ఆశ్చర్య పడతారు. ఈ విషయమై పరిశోధించమని నన్ను కోరింది మీ అబ్బాయి సురేష్!" అన్నాడు.

"వాడా?" అన్నాడు చైర్మన్ ఆశ్చర్యపడుతూ.

బదులుగా వెంకన్న నవ్వాడు.

"నేను అబద్ధం చెప్పనని వాడికి తెలుసు. ఆ పిల్ల ఎలాంటిదో వాడు కళ్ళారా చూశాడు. అయినా వాడికి ఆమెమీద మోజుచావలేదు. ఆమెలో ఎన్ని తప్పులున్నా క్షమించి పెళ్ళిచేసుకోవాలని వాడు నిర్ణయించుకున్నాడు. అందుకే మిమ్మల్ని నియమించాడు. మీ కల్పిత గాథలు నేను నమ్మను. ఎర్రగా, బుర్రగా ఉన్నదని కుర్రాడు కంగారుపడ్డా — పెద్దవాళ్ళు ఎందుకున్నట్లు? ఈ పెళ్ళి జరుగదు. మీరు నన్ను నమ్మించడానికి ప్రయత్నించ

కండి—" అన్నాడు చైర్మన్.

వెంకన్న ముఖం గంభీరంగా మారింది—"చూడండి చైర్మన్ గారూ—అపరాధ పరిశోధన నా వృత్తి! నిజం తెలుసుకుని పార్టీలకు చెప్పడం నా వృత్తిలోని ఒక భాగం. మీ అబ్బాయి సురేష్‌కీ, వరదయ్య కుమార్తె పద్మినికీ మధ్య ఒక తమాషా నాటకం జరిగింది. ఆ కారణంగా వాళ్ళిద్దరూ పరస్పరం అపార్థం చేసుకున్నారు. ఈ నాటకానికి కారకులెవరు? వరదయ్య అనుకునేందుకు లేదు. ఇంత నాటకం నడిపే స్తోమతూ, అవసరమూ ఆయనకు లేదు. మీవాటం చూస్తుంటే ఈ పెళ్ళి ఎలా ఆపాలా అని ఆత్రపడుతున్నట్లూ, ఆగినందుకు సంతోషిస్తున్నట్లూ అనిపిస్తుంది. ఈ నాటకం మీరే ఆడించారని నేను అంటాను...."

"ఈ మాట అనేముందు నేనీ ఊరి చైర్మన్‌ననీ, బాధ్యత తెలిసిన వాడిననీ మీరు గ్రహించాలి. మా అబ్బాయి ప్రేమించాడు కదా అని ఇష్టం లేకపోయినా ఆ పిల్లను కోడల్ని చేసుకోవాలనుకున్నాను. ఆ పిల్ల ఎలాంటిదో తెలిశాక మావాడికిష్టమున్నా సరే ఈ పెళ్ళి జరుగనివ్వను. అయితే ఇలాంటి విషయాల్లో నాటకాలాడాలని నేననుకోను. ఆ అవసరమూ నాకు లేదు. నాకే కాదు—ఈ పెళ్ళి చెడగొట్టాల్సిన అవసరం ఎవరికీ ఉండదు—" అన్నాడు చైర్మన్.

"ఎవరికీ ఎందుకుండదు? ఉదాహరణకు ఊళ్ళోని ధనికులెవరైనా మీ అబ్బాయికి తమ పిల్ల నివ్వాలనుకున్నారనుకోండి. అందులో అసహజమేమీ లేదు. వాళ్లు మీ అబ్బాయికి సంబంధం కుదిరిపోయిందని నిరుత్సాహపడ్డారనుకోండి — అందులోనూ అసహజముండదు. ఆ

సంబంధం చెడగొట్టడంకోసం వాళ్ళింత నాటకమాడితే అందులోనూ...."

వెంకన్న ఇంకా ఏదో అనబోతూండగా చైర్మన్ ఆపి — "మీరు చెప్పేది చాలా అసహజంగా ఉంది నాకు ..." అన్నాడు.

వెంకన్న గంభీరంగా చైర్మన్‌వంక చూసి — "ఈ నాటకం గురించి మీ కేమీ తెలియనిపక్షంలో ఒక విషయం గుర్తుంచుకోండి. నాటకం జరిగినమాట నిజం. నేను చెప్పిన కారణాలు కాని పక్షంలో ఆ నాటకం మరేదైనా ప్రమాదకరమైన ఉద్దేశ్యంతో నడుపబడి ఉండవచ్చు. మీరు నాతో మనసు విప్పి మాట్లాడి సహకరించగలిగితే— నేనూ మీకు సాయపడగల్గుతాను. మీరు నా సాయం అవసరం లేదనుకుంటే అది వేరే సంగతి.." అన్నాడు.

"ఐ కన్ టేక్ కేరాఫ్ మై సెల్ఫ్! లేని పక్షంలో మునిసిపల్ చైర్మన్ ఎలా అయ్యాననుకుంటున్నారు?" అన్నాడు చైర్మన్.

"అయితే నేను వస్తాను. ఈ రాత్రికి మీ అబ్బాయిని జాగ్రత్తగా చూసుకోండి—" అన్నాడు వెంకన్న.

చైర్మన్ తనలో తను నవ్వుకుని — "డిటెక్టివులకు ప్రతి మామూలు విషయంలోనూ వ్యూహాలు కనబడతాయి...." అనుకున్నాడు.

## 11

వెంకన్న తన ఇల్లు చేరుకోగానే సీతమ్మ అంది— "బాస్! మీరు పంపినతను అతడి గురించి వివరాలు పంపాడు. ఈ రాత్రంతా అతడిమీద నిఘా ఉంటుందని హామీ యిచ్చాడు. అతడి పేరు సుదర్శనరావు అట.

నేరాలతోనూ, పోలీసులతోనూ సంబంధం లేకుండా నాలుగు రిక్షాలు, రెండు ఆటోలు, ఒక టాక్సీ అద్దెకు తిప్పుకుని ఆ ఆదాయం మీదా, బ్యాంకులో ఫిక్స్‌డ్ డిపాజిట్లమీంచి వచ్చే ఆదాయం మీదా హాయిగా రోజులు వెళ్ళబుచ్చుతున్న సుఖజీవి అట. అతడికీ మన ఎదురింటివాళ్ళకీ చుట్టరికం ఉన్న మాట కూడా నిజమేనట—"

ఈ సమాచారం విని వెంకన్న ఆశ్చర్యపడ్డాడు. సుదర్శనరావు చెప్పిన దాంట్లో కొంత నిజముంది. అయితే అతడు తనకు ఫోన్ చేసినమాట మాత్రం అబద్ధం కాదు. అతడు ఎవరు? సురేష్—పద్మినిల వివాహంతో అతడికి ఏం సంబంధం?

సుదర్శనరావు కుటుంబం గురించి పూర్తి వివరాలు చదివాడు వెంకన్న. అతడికి పెళ్ళీడు కూతుళ్ళు లేరు. వివాహమై పదేళ్ళయింది. భార్య జీవించే ఉంది. అతడికీ వ్యవహారంలో ఏ అవసరమూ కనబడడంలేదు. పోనీ డబ్బు తీసుకుని ఎవరికైనా పనిచేశాడా అనుకుందామా అంటే అతడు ఉన్నత కుటుంబీకుడు.

ఈ నాటకంలో తనకు ఎంతో కొంత సమాచారం ఇవ్వగలవాళ్ళు ఇద్దరే ఇద్దరున్నారు. వారిలో ఒకడు సుదర్శనరావు. అతడీ రాత్రి ఏదైనా అఘాయిత్యం తలపెడితే తెలుసుకునేందుకు తన మనిషి కాపలా ఉన్నాడు. అతడేమీ చేయకపోతే తానతడినుంచి అదనపు సమాచారం రాబట్టడం కష్టమే!

తనకు సాయపడగల రెండో మనిషి శేఖర్!

రాత్రి ఎనిమిది కాగానే రాజమ్మ, సీతమ్మలు ఇళ్ళకు వెళ్ళిపోయారు. వెంకన్న భోజనమయ్యేక భార్య పద్మావతి

దేవితో — "దేవీ! నువ్వు అనుమతిస్తే ఒక్క గంట బయటకు వెళ్ళివస్తాను...." అన్నాడు.

"నేను నిమిత్త మాత్రురాలిని. వద్దని మిమ్మల్ని ఆపగలనా?" అంది పద్మావతీదేవి — "ఒక్క గంటలో వెనక్కు రాగలిగితే నేనెంతో సంతోషిస్తాను—"

వెంకన్న తిన్నగా శేఖర్ యింటికి వెళ్ళాడు. అతడి ఇంటికి ఏ విధంగా వెళ్ళవచ్చునో వెంకన్నకు పద్మినిద్వారా తెలిసింది.

అప్పటికి శేఖర్ ఇంట్లోనే ఉన్నాడు—ఒంటరిగా!

"నా పేరు వెంకన్న—నేను డిటెక్టివును!"

శేఖర్ కంగారులో వినయం మిళితంచేసి డిటెక్టివుకు మర్యాదచేశాడు. వెంకన్న కూర్చుని — "సురేష్‌తో సంబంధమైన పద్మిని విషయంలో మీరేదో నాటకమాడారు. నాటకం నాకు తెలిసింది. ఎందుకాడారో నాకు తెలియదు. తెలుసుకుందామని వచ్చాను—" అన్నాడు.

శేఖర్ ముందు కంగారుపడ్డాడు. తనకేమీ తెలియదన్నాడు. వెంకన్న జరిగిన కథంతా ఓ క్రమంలో చెప్పి—"మీరు కాదంటే కుదరదు. ఇదంతా నాటకమే. ఇందులో మీ ప్రమేయం చాలా ఉంది—" అన్నాడు.

శేఖర్ చాలాసేపు ఆలోచించి—"చూస్తూంటే ఇది నాటకంలాగే ఉంది. కానీ ఇందులో నా ప్రమేయం లేదు—" అన్నాడు.

"మీ ప్రమేయం లేకపోతే మరెవరిదో ప్రమేయం ఉన్నది. ఆ వ్యక్తి ప్రమేయంతో ఈ నాటకంలో ఎందరో పాత్రలు నిర్వహించారు. మీరూ అలా మీ పాత్ర నిర్వహించారు. ప్రమేయం ఎవరిదో మీకు తెలిసి

ఉండాలి—" అన్నాడు వెంకన్న.

"తెలియదు—...." అన్నాడు శేఖర్.

"తెలుసు ..." అన్నాడు వెంకన్న.

"మీరలా అనేముందు నా గురించి విచారించండి. నేను చాలా చాలా సామాన్యుణ్ణి. ఏదో చిన్న ఉద్యోగం చేసుకుంటూ నా బ్రతుకు బ్రతుకుతున్నాను. ఇలాంటి నాటకాలు నేనెందుకాడతాను? ఇలాంటి పాత్రల్లో ఒకడిని నేనెందుకౌతాను? ఈ విధంగా ఆలోచిస్తే మీరసలు నా వద్దకు వచ్చివుండేవారుకాదు-"

వెంకన్న సాలోచనగా శేఖర్ వంక చూశాడు.

అవును—ఇదేం నాటకం! ఈ నాటకంవల్ల ప్రయోజనం ఎవరికి? శేఖర్ లాంటి వాళ్ళు ఇలాంటి వ్యవహారాలు నడపలేరు. ఎవరి ప్రమేయంమీదనో ఈ పాత్ర స్వీకరించాడనుకున్నా—ఈ నాటకం నడిపించే మనిషి ఆశించే ప్రయోజనమేమిటి?

ప్రతి ఒక్కడూ తనడిగే ప్రశ్న ఇదే! నేనెందుకు ఇలాంటి నాటకం ఆడతాను?

చైర్మన్ అడిగినా, శేఖర్ అడిగినా, సుదర్శనరావు అడిగినా మరెవ్వరడిగినా ఈ ప్రశ్నకు జవాబు ఏమని చెప్పగలడు?

కానీ—ఇందులో ఏదో నాటకముంది, అదేమిటి?

దీనికి జవాబు ఎక్కడ దొరుకుతుంది?

వెంకన్న శేఖర్ను చివరిసారిగా ఒకే ప్రశ్న వేశాడు- "పద్మినిపై నీకున్న ఆసక్తి ఏమిటి?"

"మొదట్లో ఆమెను అపార్థం చేసుకున్నాను. ఇప్పుడామె ఒప్పుకుంటే వివాహం చేసుకుందుకు సిద్ధంగా వున్నాను—" అన్నాడు శేఖర్.

ఈ మాటల్లో కూడా వెంకన్నకు కూ ఏమీ తెలియ లేదు. అతడు నిరుత్సాహంగా ఇంటిముఖం పట్టాడు.

"అన్నకంటే ముందే వచ్చేశారు—" అంటూ అభి నందించింది అతడి భార్య పద్మావతీదేవి.

## 12

"డియర్ సురేష్!"

సురేష్ కళ్ళు విప్పాడు. అతడి చేతులు వెనక్కు కట్టబడి ఉన్నాయి. మూతికి టేపు అంటించబడి వుంది. అతడు తన ఎదురుగా ఉన్న మనిషిని గుర్తుపట్టి ఆశ్చ ర్యంగా ఏదో అనబోయి పెదవులు సహకరించక ఊరు కున్నాడు.

"మీ యింట్లో ఎవ్వరికీ స్పృహలేదు. నీకు సాయ పడడానికి ఎవ్వరూ రారు—" అన్నాడతను.

సురేష్ అతడివంక చూస్తూ ఉన్నాడు.

"డియర్ సురేష్! మీ నాన్న రాజకీయవాది. అయితే ఆయన ప్రజల అజ్ఞానాన్ని ఉపయోగించుకుంటున్నారు తప్పితే వాళ్ళను తప్పు మార్గాన నడిపించటంలేదు. కానీ నువ్వు—కొంతమంది యువతీ యువకులను మత్తు పదా ర్థాలకు అలవాటుచేసి వారిని నీ ప్రయోజనాలకుపయో గించుకుంటున్నావు. మీ నాన్న పదవిని ఉపయోగించుకుని నువ్వు దేశద్రోహుల ముఠాలో జేరిపోయావు. ఆయనకు తెలియకుండా స్మగ్లింగు వ్యవహారాల్లోకి దిగావు. అంత వరకూ కూడా నిన్ను క్షమించగలను.

అయితే పరువుగల యువతీ యువకులీ వ్యవహారాల్లో నీకు సాయపడాలనుకున్నావు. వారిని నీ గుప్పిట్లో ఉంచు కోవాలనుకున్నావు. అందుకని వారిని మత్తుపదార్థాలకు అలవాటు చేశావు. నీ స్వప్రయోజనం చూసుకున్నావుకానీ

నీ కారణంగా కొన్ని నిండు జీవితాలెలా నాశనమై పోయాయో తెలుసుకోలేను. ఇది చాలా దారుణం.

ఇప్పుడు నువ్వు నీలాంటివారిని మరి కొందర్ని తయారు చేస్తున్నావు. వారందర్నీ నేను స్వయంగా కలుసుకొని హెచ్చరించాను. వాళ్ళు వినలేదు. వారికి నీ పద్ధతి ఆదర్శంగా ఉంది. వారిని లొంగదీయడానికి ఒక్కటే పద్ధతి. ముందు నిన్ను చంపి — ఆ తర్వాత వాళ్ళలో మార్పు రాకపోతే ఒక్కొక్కరినీ వాళ్ళనూ చంపేస్తాను....” అన్నాడతను.

సురేష్ తల ఆడించాడు. అతడు ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నట్లు గ్రహించి ఆ వ్యక్తి—“నీ మాటినుంచి లేపు విడదు. నీ సందేహాలేమిటో నాకు తెలుసు. అన్నింటికీ జవాబులిచ్చి అప్పుడే నిన్ను చంపుతాను. నువ్వు అడగదల్చుకున్నదేమిటంటే — నీ స్మగ్లింగ్ వ్యవహారాల్లో నా జోక్యమెందుకని!

నీలాంటి వాళ్ళను మట్టుబెట్టడానికి నా వంటివాడు, మినహా మార్గంలేదు. చట్టం, ధర్మం మిమ్మల్నేమీ చెయ్యలేవు. నీ ప్రవర్తన ఎలాంటిదో నీ తండ్రికి చెప్పి హెచ్చరించాననుకో. ఆయన నిన్ను సంస్కరించడానికి బదులు—తనూ నీ దారికి మళ్ళవచ్చు. పదవి గురించి పాకులాడుతూ నిన్ను సరైన దారిలో పెట్టనందుకు నీ తండ్రికిప్పుడీ పుత్రశోకం భరించక తప్పదు..” అని ఆగి “నువ్వూ, నీలాంటి వాళ్ళూ కొన్ని అన్యాయాలు చేయడం కోసం పటిష్టమైన ముఠాలేర్పర్చుకున్నట్లే నేనూ నీలాంటి వాళ్ళను మట్టుపెట్టటంకోసం నా మాటను ఏమాత్రమూ వ్యతిరేకించని అనుచరుల్ని ఏర్పర్చుకున్నాను. వాళ్ళ సాయంతో మీ అందర్నీ పరశురాముడిలా వెతికి

వెతికి చంపుతాను. కేవలం నా కారణంగా చెడ్డ వాళ్ళందరూ నాశనం కాకపోవచ్చు. కానీ దేశం చెడ్డ వాళ్ళతో నిండకుండా ఉండడానికి సహాకరించినవాడి నవుతాను....” అన్నాడు.

సురేష్ పెనగులాడుతున్నాడు. అతడికి కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి.

సరిగ్గా అప్పుడే ఆ వ్యక్తి జేబులోంచి ఓ సిరంజి తీశాడు. సురేష్ చూస్తూండగా అందులోకి ఏదో మందు ఎక్కించాడు.

“నీ యింట్లో నీ తండ్రి సంరక్షణలో నీ ప్రాణాలు తీస్తున్నాను. ఈ కథ వెంకన్నకు తెలియబరుస్తున్నాను. ఆయన ద్వారా ఇది దేశంలోని దుర్మార్గులందరికీ హెచ్చరిక కాగలదు. నువ్వు వెంకన్న దగ్గరకు వెళ్లావు. నాకు కాస్త ప్రమాదమేననిపించింది. నీ తండ్రి అధికార మదాంధుడై వెంకన్నను నిర్లక్ష్యం చేయడంవల్లగానీ— ఈ రోజు నాకీ అవకాశం వచ్చేదికాదు—”

ఆ వ్యక్తి సురేష్‌ను సమీపించాడు.

సురేష్ వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నాడు — కట్లు విప్పుకుందుకు.

“నానుంచి నువ్వు తప్పించుకోలేవు. అయినా నీకు నా చేతుల్లో చావుడం అదృష్టం. నేను పుణ్యాత్ముణ్ణి. హంతకుడినే అయినా మంచి హంతకుణ్ణి! ఎంతో మంచి హంతకుణ్ణి! అందుకే నిన్ను చంపాలని నెలరోజుల క్రితమే అనుకున్నప్పటికీ—ఆగాను.

నీకు పద్మిని అనే ఆమెతో వివాహం కుదిరిందని తెలిసింది. నువ్వు ఎందరో అమాయకుల జీవితాలు నాశనం

చేశావు. అలాంటి నిన్ను నాశనం చేస్తూ—తత్ఫలితంగా మరో అమాయక యువతి జీవితం నాశనంచేయటం నాకు ఇష్టంలేదు. అందుకే నా మనుషుల్ని నియమించి మీ వివాహం చెడగొట్టాను. వివాహం చెడిపోయినా ఆమె జీవితం నవ్వులపాలు కాకుండా ఉండడానికి ఓ యువకుణ్ణి సిద్ధంచేశాను...."

సురేష్ అతడి మాటలు వినడంలేదు. ఆ వ్యక్తి చేతిలోని సిరంజి వంకే భయంగా చూస్తున్నాడు. మరు క్షణంలో అది అతడి శరీరంలోకి దిగబడింది....

—:ఐ పో యిం ది:—

# నడచిన పాదాలు నాలుగు

సికిందర్

యాభై ఏళ్ళుంటాయి అతనికి. కారు నలుపు. మంచి లావు, వెడల్పాటి ముఖం. దట్టమైన జుట్టు. లాల్చీ పైజామా మీద వున్నాడు. అతని కళ్ళలో భయాందోళనలు వ్యక్తమవుతున్నాయి.

జాన్ కూడా వచ్చి కూర్చున్నాక, లాల్ ఆ వ్యక్తి మాటలకోసం చూశాడు.

అతడన్నాడప్పుడు గిల్టీగా చూస్తూ, "క్షమించాలి... ఇంత రాత్రి వచ్చి డిస్టర్బ్ చేస్తున్నాను నేను.... నేను చిక్కుకున్న పరిస్థితి నన్నిలా మీ దగ్గరకి రప్పించింది."

"ఏమిటది?" అన్నాడు లాల్ అతన్ని ప్రోత్సహిస్తూ, "ఫరవాలేదు, మీరలా ఇబ్బంది ఫీలవకండి. అర్ధరాత్రి అతిధులు మాకు మామూలే. ముందు మీరు పరిచయంతో ప్రారంభించండి...."

"అలాగే.... నా పేరు జానకిరాం. రియల్ ఎస్టేటు ఏజెంట్ని. ఆస్తులు కొని అమ్ముతుంటాను...."

"వెల్, చెప్పండి."

"మా ఇల్లు దిలీప్ నగర్‌లో వుంది. వరంగల్ పోయే రూట్లో ఉప్పల్ దాటాక అక్కడో కొత్త కాలనీ ఏర్పడుతోంది .... అదే దిలీప్ నగర్ కాలనీ. అక్కడ ఇల్లు కట్టుకొని ఆర్నెల్లయింది. ఇంకా ఎక్కువ ఇళ్ళు అక్కడ ఏర్పడలేదు. అక్కడ చాలా ఏకాంతంగా, నిర్మానుష్యంగా వుంటుంది. ఆ ఇంట్లో నేనూ, నా భార్య రాజమణి వుంటున్నాం. మాకు పిల్లలేరు. నేను బైటికెళ్తే రాజమణి ఒక్కర్తే ఇంట్లో ఒంటరిగా వుంటుంది. నేను పగలంతా పనులమీద తిరిగివచ్చి ఎప్పుడో ఇంటికొస్తాను__"

ఇవాళ దివాన్ దేవిడీలో ఓ పాత బిల్డింగ్ అమ్మకాని కొస్తే సేట్ చీమన్ భాయ్‌కి కుదిర్చిపెట్టి, అడ్వాన్సు ఇప్పించి కాగితాలు వ్రాయించడం పూర్తిచేసేసి తొమ్మి దిన్నరకు ఇంటికి వెళ్ళాను."

అతడన్నాడు పూడుకుపోయిన గొంతుతో. "ఇంట్లో నా భార్య రాజమణి చచ్చిపడివుంది, మిస్టర్ లాల్."

లాల్ చటుక్కున తల తిప్పి జాన్‌ని చూశాడు.

జాన్ వెంటనే సిగరెట్‌ని యాష్‌ట్రేలో కుక్కేశాడు. అతడన్నాడు ముందుకు వంగి, "ఈ విషయం మీరు ఫోన్ చేసినప్పుడే ఎందుకు చెప్పలేదు, జానకిరాం గారూ?"

"ఈ హత్య బైటపడితే తలెత్తుకోలేను!"

"మీ భార్య హత్య చేయబడిందా?"

"అవును, గుండెలో పొడిచి చంపబడింది!"

"మీరెందుకు తలెత్తుకోలేరు?"

"నేను__నేనెలా చెప్పాలి? నా పరువు పోతుంది!"

లాల్ కల్పించుకున్నాడు. "మిస్టర్ జానకిరాం, మీరు వచ్చిన ఉద్దేశం మంచిది కాదు. హత్యను మీరేదో సిగ్గుపడవలసిన విషయంగా దాచలేరు. మీ పరువుప్రతిష్టల కోసమని చట్టం దృష్టినుంచి తప్పించలేరు. ముందు పోలీసులకి తెలపడం మీ విధి. ఆ తర్వాతే మిమ్మల్ని కాపాడుకునే ప్రయత్నాలు చేసుకోవాలి. ఇప్పటికే మీరు చాలా ఆలస్యంచేశారు. వెంటనే పోలీసులకి ఫోన్ చేయండి. లేదా నేను—"

"ఓహ్, అక్కడ మీ భార్య దేహాన్ని దిక్కులేకుండా వదిలేసి ఇక్కడకొచ్చారన్నమాట—"

"శవం అక్కడ లేదు!"

"ఏమైంది?"

"పోలీసులు తీసుకెళ్ళారు—"

"ఏమిటీ!"

అతను అసహనంగా అన్నాడు. "మీరు నన్ను సరిగ్గా చెప్పనీయడంలేదు. మీరు మధ్యలో రాకుంటే అంతా వివరంగా చెప్తాను....

"నేను తొమ్మిదిన్నరకు ఇంటికొచ్చాను. గేటు మూసి వుంది. పిలిస్తే రాజమణి పలకలేదు. లోపల తలుపు బార్లా తెరిచివుంది. ఇంట్లో లైట్లు కూడా వెలుగుతున్నాయి. రెండుసార్లు నేను హారన్ కొట్టాను. అయినా ఆమె రాకపోయేసరికి, నేనే దిగి గేటుతీసి బైక్ లోపలికి పోనిచ్చాను.

"ఇంట్లో చడీ చప్పుడులేదు. బైక్‌కి స్టాండువేసి, బ్యాగు తీసుకొని ఇంట్లోకి నడిచాను. ఆమె ఎదురుపడలేదు. లేకపోతే వరండాలోనో, ముందు గదిలోనో ఎదురు చూస్తూండేది. ఎక్కడుంది చెప్మా అనుకుంటూ

నేను బెడ్ రూంలోకి నడిచాను.

"అక్కడ—మిస్టర్ లాల్ — నా జీవితంలో చూడని ఘోరమైన దృశ్యం చూశాను! నా ప్రాణ సమానం, ఈ ప్రపంచంలో నా సర్వస్వం, నా రాజమణి కింద రక్తపు మడుగులో పడిపోయి ఉంది....

"ఆమె గుండెలో కత్తి కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. ఆమె చచ్చిపోయినట్లు చూడగానే తెలుస్తోంది...రక్తం! అంతా రక్తం! ఆ గదిలోనే స్టీలు బీరువా బార్లా తెరిచివుంది. అందులో దాచుకున్న విలువైన వస్తులేవీ లేవు!

"ఆ షాక్ నుంచి నేను కోలుకుని పోలీసులకు ఫోన్ చేశాను. ఆ ఏరియా సబిన్ స్పెక్టర్ తోపాటు మరొక డిటెక్టివ్ ఇన్ స్పెక్టరూ వచ్చాడు....

"బాలకృష్ణన్ కావచ్చు."

"అంతే, ఆయనే! ఆయనే నన్ను చాలా ప్రశ్నలడిగాడు. అన్నిటికీ చెప్పాను. డాక్టర్ రాజమణిని చూసి గంటన్నర క్రితమే పోయిందన్నాడు. అంటే ఎనిమిదిన్నరకు! పోలీసులొచ్చేటప్పటికి పదిగంటలైంది. నేను ఓ గంటముందు వచ్చివుంటే — రాజమణికి అలా అయ్యేది కాదు!

"పోలీసులు అది దొంగల పని అన్నారు. సిటీ చుట్టుపట్ల బందిపోటుతనాలు బాగా పెరిగిపోతున్నాయట! మా కాలనీ దూరంగా విసిరేసినట్లు వుంటుంది. దొంగలకి అనువైన ప్రాంతం! ముందే అంతా కనిపెట్టి, పకడ్బందీగా ఏర్పాట్లు చేసుకుని వచ్చారన్నారు. ఆమె దగ్గర తాళాలు లాక్కుని చంపేసి, బీరువాలో సొమ్ము దోచుకొని పారి పోయారన్నారు. మొత్తం నగలు, నగదు కలిపి లక్ష

రూపాయలవరకు పోయాయి, మిస్టర్ లాల్!"

"పోలీసులు ఇంకేమన్నారు?"

"అది దొంగల పనే అని కచ్చితంగా చెప్పారు. ఇంకా చాలా ఆధారాలు సేకరించారు. వేలిముద్రలు తీశారు. కత్తిమీద వేలిముద్రలున్నాయి. మంచంమీద ఒక మనీపర్సు దొరికింది. అందులో కొన్ని నోట్లూ, కొంత చిల్లరా వున్నాయి. ఇంకా మిస్టర్ లాల్, చెప్పడం మరిచాను, అక్కడంతా రక్తంతో ఏర్పడ్డ జాడలు వున్నాయి...."

"ఎవరి జాడలు?"

"కుక్కవి."

"కుక్కవా?"

"అవును, మా పెంపుడు కుక్క రాజావి. అది ఇంట్లో ఎక్కడా లేదు. హత్య జరిగినప్పుడు యెక్కడుందో తెలియదు. కానీ నేను రాకముందు, అరగంట క్రితమే ఇంట్లోంచి దాని అరుపులు విన్పించాయట, ఎదురింటి వాళ్ళకి. వాళ్ళంటున్నారు. వాళ్ళింకే కేకలూ శబ్దాలూ వినలేదట. ఆ కుక్క అరుపులు వాళ్ళు పట్టించుకోలేదట.

"రాజా చాలా మంచి కుక్క. తెలివైనది. అది కొంత రక్షణగా వుంటుందనుకున్నాను రాజమణికి. కానీ తెలివైన మనుషులే మోసపోతూంటారు, అదెంత!

"పోలీసులు ఇల్లంతా పరిశీలిస్తున్నప్పుడు, ఒక బ్రెడ్ ముక్క దొరికింది, ఇంటిముందు కాంపౌండు గోడవారగా. అది చూస్తే సగం ముక్క తిన్నట్లుంది. దానికేదో మత్తు మందు పూసివుందన్నారు పోలీసులు. దొంగలు దాన్ని రాజాకి తినిపించి, అది స్పృహ తప్పగానే తమ పని

కానిచ్చునన్నారన్నారు లోపలికి వెళ్ళి. ఇంతలో అది తెలివిలోకొచ్చి, ఇంట్లో కెళ్ళి జరిగింది చూసి మొరుగుతూ, శవం దగ్గర రక్తంలో కాళ్లువేసి గదంతా రక్తమయం చేసిందన్నారు. దాని జాడలు శవం దగ్గరనుంచి బీరువా దగ్గరకి వెళ్ళి అక్కడనుంచి కిటికీ దగ్గరకి వెళ్ళి బయట అదృశ్యమయ్యాయి.

"బీరువా తలుపులకీ, హాండిల్‌కీ, కిటికీ ఫ్రేము కూడా రక్తం అంటుకుంది. ఆ వైపున్న కాంపౌండు గోడకి కూడా రక్తం కర మరకలున్నాయి. దాన్ని బట్టి అది దొంగల జాడ తీయడానికి వెళ్ళిందన్నారు. కానీ ఇంతవరకూ అది తిరిగిరాలేదు—"

"అది కత్తిని ముట్టుకోలేదా?"

"లేదు. కత్తిమీద స్పష్టంగావున్నాయి వేలిముద్రలు. కాని బీరువామీద సాధ్యంకాలేదు. అది రక్తం అంటిన కాళ్ళతో తడిమి చెరిపేసిందట!"

లాల్ సిగరెట్ వెల్గించుకొని సాలోచనగా జాన్‌ని చూస్తూండిపోయాడు.

జాన్ అడిగాడు జానకిరాంని. "మరి అది దొంగల పనైతే మీ పరువుకైమెంది?"

"అది దొంగల పని కాదు" అన్నాడు జానకిరాం.

"దొంగల పనికాదా?"

"కాదు, పోలీసులే అలా భావిస్తున్నారు. అసలేం జరిగిందో నాకు తెలుసు."

"మీకు తెలుసా? అయితే పోలీసులకి ఎందుకు చెప్పలేదు?"

"చెప్తే నా పరువు పోతుంది!"

"మీ పరువు ఎలా పోతుంది?"

"ఈ హత్య కృపాకర్ చేశాడు కాబట్టి!"

"కృపాకర్ ఎవరు?"

"అతను—అతను—సరే, మీ దగ్గర సిగ్గెందుకు? మీ సహాయం కోసమే వచ్చాను. అతను రాజమణికోసం వస్తున్నాడు...."

జాన్ తీక్షణంగా చూశాడతన్ని.

"ఐసీ....అయితే మీరు గొడవపడ్డారా?"

"లేదు, రాజమణిని ఆమె యిష్టానికి వదిలేశాను. పిల్లలు ప్రసాదించలేనప్పుడు పరులనుంచి పొందే అవకాశం కల్పించటం న్యాయం అనుకున్నాను—"

"మీరలా చేశారా?"

"మనస్ఫూర్తిగా! రాజమణి పిల్లలకోసం తపించింది. యెవరు తపించరు? కానీ దైవం నన్ను శపించాడు. రాజమణి నామీద కోపం, విసుగు, విరక్తి పెంచుకుంది. కానీ ఈ మధ్యనే ఆమెలో మార్పు గమనించాను. చాలా శాంతంగా, తృప్తిగా, సంతోషంగా కన్పించసాగింది.

"ఇంటికి ఓ యువకుడి రాకపోకలు గమనించాను. పరిస్థితిని అర్థంచేసుకున్నాను. ఏ అభ్యంతరమూ చెప్ప లేదు. ఆమె నన్నసహ్యించుకోకుండా అలా సుఖంగా సంతోషంగా వుంటే చాలనుకున్నాను. ఆమె భ్రమగానీ ఈ వయసులో ఆమెకు పిల్లలు కలుగుతారనుకోను. ఆమెకు నలభైఐదు దాటాయి."

"కృపాకర్ ఎప్పట్నుంచి వస్తున్నాడు?"

"రెండు నెలలవుతోందనుకుంటాను...."

"అయితే, ఇప్పుడీ హత్య అతను చేశాడని ఎలా అంటున్నారు?"

"ఆధారాలున్నాయి. మంచంమీద మనీపర్సు దొరికిందన్నాను. అది కృపాకర్ దే. నేను చూసి వెంటనే అందులోంచి అతని పేరున్న కార్డును తొలగించాను. అదెవరిదో తెలియకూడదు పోలీసులకి! వాళ్ళు దొంగల పని అనుకుంటున్నారు—అనుకోనివ్వండి అలాగే!

"ఆ కత్తిమీదా పర్సుమీద వేలిముద్రలు కలుస్తున్నాయన్నారు. అవి కృపాకర్ వని తెలిస్తే, అతన్ని పోంతకుడిగా పట్టుకుంటే, అతనితో రాజమణికున్న వ్యవహారం బైటపడితే, నేను అభాసవుతాను! తలెత్తుకోలేను! అలా జరక్కూడదు! వాళ్ళమధ్య వ్యవహారం వెలుగులోకి రాకూడదు! అందుకే మీ దగ్గరకొచ్చాను."

"మేమేం చేయగలం?" అన్నాడు జాన్ విసుగ్గా.

"కృపాకర్ ఆమెతో ఎందుకు గొడవపడ్డాడో, దేనికి చంపాడో నాకనవసరం. కానీ మధ్యలో నా సొమ్ము దోచుకుపోయాడు. అది నా కవసరం! అది నాకొచ్చేలా చూడండి, అంతే చాలు నాకు! రాజమణిని వాడేంచేసినా నాకనవసరం. చచ్చిపోయిన ఆమెకోసం బ్రతికున్న నేను బజార్నపడలేను—"

"మేమేం చేయాలి?" జాన్ అడిగాడు తలెత్తి.

"వెళ్ళి బెదిరించండి వాణ్ని. ఇంట్లోనే వుంటాడు వాడు. అశోక్ నగర్ లో ఓ యింట్లో అద్దెకి ఉంటున్నాడు మేడమీద. పట్టుకొని బెదిరించండి! నీ మనీపర్సు పోలీసులకి దొరికింది—కత్తిమీద నీ వేలిముద్రలున్నాయి—నిన్ను పట్టివ్వడం క్షణాల్లో పని-మర్యాదగా దోచుకుంది వాపసు ఇస్తావా—లేక—"

జాన్ నవ్వేశాడు. "మీరు తప్పుడు చోటుకి వచ్చారు. ఆ పని కిరాయి మనుషులు చేస్తారు."

"వాళ్ళని నేను నమ్మను!" అన్నాడు జానకిరాం మొండిగా.

"కానీ మీ రహస్యాన్ని మేమూ కాపాడలేం. మేం లాయర్లం కాము. డిటెక్టివ్‌లం. ఇదిప్పుడు కాన్ఫిడెన్షియల్ కాజాలదు. నేరం జరిగిపోయింది—మీ మిసెస్ హత్య. ఇటువంటి కాపిటల్ క్రైమ్‌లో పోలీసుల్ని తప్పుదోవ పట్టిస్తూ మీతో సహకరిస్తే, మా లైసెన్సులు ఊడడమేగాక, రేపు జైలు వరండాలు ఊడ్వవలసిన పరిస్థితీ రావచ్చు.

"నో, నో, హంతకుడెవరో తెలిసి మీరిలా పోలీసులతో గేమ్ ఆడలేరు. పోస్టుమార్టమ్ ఒకటుంది—అందులో మీ భార్య పాతివ్రత్యంపట్ల సందేహాలు కలిగితే, హత్యకు ముందు ఆమె హంతకుడికి తనువు అర్పించిందని తెలిస్తే, అదీ ఇష్టపూర్వకంగా అని నమ్మితే, అప్పుడా హంతకుడు ఆమె ప్రేమికుడే అయి వుంటాడని అనుమానిస్తే మీరనుకుంటున్నట్లు ఆ వ్యవహారం మరుగున ఉండిపోదు—వెలుగులోకొస్తుంది!"

"లేదు, ఆమె తనువు అర్పించివుండదు!"

"ఎలా తెలుసు? అతను మరి దేనికి వస్తున్నాడు?"

"వాళ్ళ సంబంధాలు ఇంతకుముందెప్పుడో పాడయి వుంటాయి. అటువంటప్పుడు ఇద్దాళ్ళికి కలిసి గడిపే అవకాశంలేదు."

"మనకేదీ నిశ్చయంగా తెలియదు. ఆమెబట్టలెలా వున్నాయి?"

"బాగానే వున్నాయి. నలగలేదు, చినగలేదు. జుట్టు కూడా చెదరలేదు."

"అయితే ఆమె మీద దౌర్జన్యం జరగలేదు. హత్యా

సమయంలో ఘర్షణ జరగలేదు. కాబట్టి ఆమె తనువు అర్పించివుంటే అది హంతకుడి బలవంతంమీద కాదు. ఆమె ఇష్టపూర్వకంగా జరిగింది. కనుక పోలీసులు వూహిస్తున్న ఆ దొంగ—హంతకుడు — ఎవరో అనామకుడు కాడు. ఆమెకు తెలిసినవాడు. బాగా పరిచయమున్నవాడు. ఆమె రహస్య ప్రేమికుడు—ఇలా అన్పిస్తుంది పోలీసులకి! అప్పుడు మిమ్మల్ని ఉక్కిరి బిక్కిరి చేసేస్తారు ఇంటరాగేషన్‌లో! అంతే, మీరు తెల్లబోయి అంతా కక్కేస్తారు శుభ్రంగా."

జానకిరాం ఆశ్చర్యంగా చూశాడు లాల్‌ని.

లాల్ అన్నాడు. "వెల్, మీరొచ్చిన పనికి మమ్మల్ని ఒప్పించాలన్న పట్టుదలతో మీరీ వాస్తవాలు అంగీకరించడం లేదు. పోస్టుమార్టమ్‌లో విషయం తెలుస్తుంది. అవి మేము చూసుకుంటాము. ఇప్పుడు కుక్క ఎక్కడికి వెళ్ళిందని మీరనుకుంటున్నారు?"

"కృపాకర్ దగ్గరికే! అతనితో అది చాలా క్లోజ్‌గా వుంటుంది. చాలాసార్లు దాన్ని తనింటికి తీసుకెళ్ళాడు. దారి తెలుసు దానికి. తెలివిలో కొచ్చి, అది అతని పనే అని గ్రహించి అతనికోసం వెళ్ళి వుంటుంది .... కానీ అతను బ్రతకనిస్తాడా? చంపేసి వుంటాడు....అందుకే ఇంతవరకూ దాని జాడ లేదు."

"నో, అది అతన్ని చేరుకుని వుంటే అక్కడ న్యూసెన్స్ క్రియేట్ చేస్తుంది. తన యజమానురాల్ని చంపాడని ఎదురుతిరుగుతుంది. అతనిమీద దాడిచేస్తుంది. చుట్టుపక్కల వాళ్ళని ఎలర్టుచేస్తుంది. అప్పుడు కృపాకర్ పట్టుబడిపోతాడు...."

అతను ఆందోళనగా చూశాడు.

"అది జరిగితే నేను భయపడిందంతా అవుతుంది!"

లాల్ నవ్వాడు, "ఏదో సామెత చెప్పినట్లుంది. మీ పరువు గురించి ఇప్పుడు భయపడటంలో అర్థంలేదు. కృపాకర్ మీ ఇంటికొస్తూంటే ఆ చుట్టుపక్కల అందరికీ మీకంటే ముందే తెలిసిపోయుంటుంది. రేపీ హత్య గురించి తెలిస్తే వాళ్ళే కృపాకర్‌ని పోలీసు దృష్టికి తెస్తారు."

అతని ముఖం జేవురించింది.

## 2

ఆ యింటి గేటు తట్టిన రెండు నిమిషాలకి ఆమె వచ్చి తీసింది. ముప్ఫై ఏళ్ళుంటాయి. పసిమిఛాయ వళ్ళు. నిద్ర మత్తులో గేటుని రెండు చేతులతో ఆధారంగా పట్టుకుని, కళ్ళు చిట్లిస్తూ, "ఎవరు కావాలేమిటి ఇంత రాత్రి?" అనడిగింది.

లాల్ గొంతు సరిచేసుకున్నాడు, "కృపాకర్ కావాలి...."

"లేడతను. ఏం పనేమిటి ఇంత రాత్రి?"

"పారుగూర్నుంచి వచ్చాం, సొంత పని."

"అక్కడ కొంపలు మునిగిపోతున్నాయి...." జాన్ అన్నాడు.

అప్పుడామె ఉలిక్కిపడింది. ఇద్దర్నీ మార్చి మార్చి పరీక్షగా చూస్తూ అడ్డంగా తలూపింది. "లేదు, మీరు అబద్ధం ఆడేస్తున్నారు! మీరెవరో నాకు తెలిసేసింది. డిటెక్టివ్ లాల్ అండ్ జవాన్! పేరు మోసిన డిటెక్టివ్‌లు...."

జాన్ కంగారుపడ్డాడు, "నేను జవాన్‌ని కాను!" అన్నాడు.

"మీ రెవరు?"

"నేను జాన్ ని."

"ఓహ్, అయితే నా పొరపాటు దిద్దేసుకు నేస్తాను. మీరు క్షమించేసేయాలి...."

"మీరే క్షమించాలి, ఇంత రాత్రి ఇబ్బంది పెడు తున్నందుకు."

"లేదు, లేదు!" ఆమె చటుక్కున గేటు తీసింది, "రండి! మీరు! నాకు ఇబ్బందిలేదు...."

జాన్ తటపటాయించాడు. "ఇంట్లో మీరు...."

"నేనూ మా స్వరూపా వుండేశాం. మావారు ఫ్యాక్టరీకెళ్ళేశారు, నైట్ డ్యూటీకి. మీరు రండి."

డిటెక్టివ్ లు ఆమె వెనుక నడిచి లోపలికెళ్ళారు. ఆమె ముందు గదిలో కుర్చీలు చూపిస్తూ, "కూర్చోండి మీరా కుర్చీల్లో కూర్చోండి!" అంది.

ఇద్దరూ చెరో కుర్చీలో కూర్చున్నారు.

ఆమె నవ్వింది, "ఇప్పుడు అడిగేసేయండి. ఏం తీసు కుంటారు కడుపులోకి? కప్పులో కాఫీయా, లేక ప్లేటులో ఏమైనా తినేస్తారా?"

డిటెక్టివ్ లు వాడలిపోయి చూశారు.

"ఏమీ వద్దు ఇంత రాత్రి" అన్నాడు జాన్ బల వంతంగా నవ్వుతూ.

చెవులు గట్టిగా మూసుకున్నాడు లాల్. సహనం కోల్పోయి అన్నాడు తీవ్రంగా "కృపాకర్ గురించి మాట్లాడండి, కృపాకర్! అతనెక్కడున్నాడు?"

"నాకు తెలియదు. నాకు చెప్పేసి వెళ్ళిపోయాడు. పైన గదిలో కిరాయికి వున్నాడు. అతనేం చేశాడు, డిటెక్టివ్ గారూ?"

"ఎప్పుడు వెళ్ళాడు?"

"గడియారంలో ఆరు గంటలకి వెళ్ళిపి తొమ్మిది గంటలకి వచ్చేశాడు. మళ్ళీ వెంటనే వెళ్ళేశాడు—"

"అప్పుడతని చేతిలో ఏమున్నాయి?"

"తెలియనే తెలియదు! అతను పైకేసీ కిందికేసీ మెల్లెక్కుతూంటే, బయట అడుగుల చప్పుడు వినేశాను. అతన్ని చూసేయలేదు."

"అతని గదికి పక్క వచ్చిందా—పక్క?"

"పక్కా? ఏమో, నేను చూసేయలేదు. కానీ అది మెరుగుతోంటే వినేశాను పైన...."

"ఎప్పుడు—?"

"అతను వచ్చేసిన కాస్సేపటికే!"

డిటెక్టివ్‌లు ఒకర్నొకరు చూసుకున్నారు ఒక్క క్షణం.

"కృపాకర్ ఏం చేస్తుంటాడు? ఎలాటివాడు? అతని కెవరూ లేరా?"

"కృపాకర్ మంచివాడు. మా స్వరూప అంకుల్ అని పిలిచేస్తుంది. అతను బిస్కట్లు తెచ్చి తినిపిస్తాడు. కాలెండర్లో సరిగ్గా ఆరు నెలలనుంచీ ఉంటేస్తున్నాడు మా గదిలో! ఓల్డు సిటీలో—ఫీల్ ఖానా దగ్గర ఏదో మోటారాఫీసులో ఉద్యోగం నడిపేస్తున్నాడు. గడియారంలో మార్నింగ్ ఎనిమిది గంటలకి మెట్లు దిగి వెళ్ళేసి, మళ్ళీ గడియారంలో నైట్ తొమ్మిదింటికి నడిచి వచ్చేస్తాడు. అతనికి బంధువులెవరూ లేరు....అతని కోసం ఒక అమ్మాయి మాత్రం వచ్చేస్తోంది...."

"అమ్మాయా?"

తలూపిందామె. "ఆటో అమ్మాయి. పేరు రజని.

కృపాకర్ పరిచయం చేశాడు. పరిణయమాడేస్తారట తొందర్లో—క్యాలెండర్లో తేదీ చెప్పేయలేదుగానీ—వెరీ త్వరలో చేసుకొంటామని చెప్పారు."

"ఆమె ఎక్కడుంటుంది? ఏం చేస్తుంది?"

"అంబర్ పేటలో ఉండేదంటట! ఫుల్ అడ్రసు చెప్పేయలేదు. ఏం చేస్తుందో కూడా చెప్పేయలేదు. ప్రతి రెండు రోజులకి ఆటోలో ఇక్కడికి వచ్చేస్తుంది—ఇద్దరూ గదిలో చాలా మాట్లాడుకునేస్తారు. కానీ ఇవ్వాళ మధ్యాహ్నం పోట్లాడేశారు!"

"ఎందుకని?"

"ఆటో అమ్మాయి అనుమానించేసింది—అతను మరో స్త్రీతో గడిపేస్తున్నాడని. అవ్వ! లాల్ గారూ, అది నేను నమ్మేయలేదు. కృపాకర్ గురించి ఎవరైనా అలా మాట్లాడేస్తే వూరుకోను. ఆ ఆటో అమ్మాయికి నేను చాలా నచ్చింపజేసి వెళ్ళగొట్టేశాను. కృపాకర్ మంచి వాడు."

"ఆమె ఎప్పట్నుంచి వస్తోంది?"

"క్యాలెండర్లో పదిహేను రోజులనుంచీ! ఆమె వచ్చే రోజున కృపాకర్ త్వరగా వచ్చేసేవాడు. చాలా సార్లు సెకండ్ షో సినిమా ఫిలింకి వెళ్ళేశారు. ఇంతకీ కృపాకర్ ఏం చేసేశాడు, డిటెక్టివ్ గారూ? అతనితో మీకేం పని? కృపాకర్ ఏదైనా చెడ్డ పని చేసేశాడా? అతనలా చెయ్యడు—నాకు తెలుసు—మీరు పొరబడేశారనుకునేస్తున్నాను...."

లాల్ లేచాడు. "లేదు, మీకు తెలియకుండా కృపాకర్ చాలా చేశాడు. ఇల్లు కదలని వాళ్ళని నమ్మించడం చాలా తేలిక. మేముకసారి అతని గదికి

వెళ్ళి చూస్తాం."

"తాళం వుండేస్తుంది."

"చూద్దాం."

లాల్ గబగబా నడిచి వెళ్ళిపోయాడు. జాన్ కూడా లేచి వెనుక వెళ్లాడు. ఆమె తలుపు వరకూ వచ్చి ఆగిపోయింది. డిటెక్టివ్‌లు వరండాలోకొచ్చి పక్కనున్న మెట్లెక్కసాగారు. లాల్ తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

"గాడ్, చచ్చిపోయాను....ఆమె ఎందుకలా మాట్లాడుతుందంటావు నిజంగా?"

జాన్ నవ్వాడు, "పై కాలజీలో దానికేదో పేరుంది. నత్తికి దగ్గరగా జబ్బు. జబ్బుల పేర్లు నాకు గుర్తుండవు."

"నీకు నీ గర్ల్ ఫ్రెండ్స్ పేర్లు గుర్తుంటాయా!"

జాన్ మాట్లాడలేదు. ఇద్దరూ పైకి చేరుకుని గది ముందాగారు. పైన చీకటిగా వుంది. తలుపు మూసి బయట గొళ్ళెం పెట్టి వుంది. తాళంలేదు. పక్కన కిటికీ తెరచివుంది.

లాల్ గొళ్ళెంతీసి తలుపు నెట్టాడు. అది తెరుచుకో సాగింది. లాల్ అడుగు లోపలికి వేసి స్విచ్ కోసం తలుపు పక్కన తడిమాడు. గదంతా చీకటిగావుంది. ఆ చీకట్లో అతనేదో పసిగట్టి చటుక్కున అడుగు వెనక్కి వేసి బయటకొచ్చేశాడు.

"ఏమిటి, లాల్?"

"అగ్గిపుల్ల గీయ్....లోపలేదో వున్నట్లుంది...."

జాన్ అగ్గిపెట్టె తీసి పుల్ల గీశాడు. ఆ వెలుగులో గది అస్పష్టంగా కనిపించసాగింది.

లాల్ గదిలోకి చూస్తూ "రైట్, అదే అను కున్నాను .... ఇప్పుడు లోపలికెళ్ళి కర్చీఫ్‌తో స్విచ్ నొక్కు!" అన్నాడు.

జాన్ లోపలికి అడుగువేసి, కర్చీఫ్ తీసి పట్టుకుని స్విచ్ వేశాడు. ఒక్కసారి ప్రకాశవంతమైన గదిలో అతడా దృశ్యం చూసి వూపిరి బిగబట్టాడు. గది మధ్యలో అమ్మాయి శవం ఆ శవాన్ని రెప్పవేయకుండా చూస్తూండిపోయాడు లాల్.

ఆ గదంతా ముగ్గువేసినట్లుంది....

గచ్చంతా ముద్దలు ముద్దలుగా రక్తం అలుముకునుంది. ఆ జాడలు శవం చుట్టూ ఒకసారి తిరిగి, తలుపు దగ్గరకి వచ్చి ఆగిపోయాయి. అవి బాగా ఆరి రక్తం గడ్డకట్టుకుపోయి చాలా సేపే అయింది....

ఆ జాడలు చెప్పే అర్థాన్ని మరో ఆధారంతో కూడా ధృవపరచవచ్చు. బ్రిటానియా బిస్కట్లు. టేబుల్ అంచున విప్పివున్న ఆ ప్యాకెట్‌లో నాలుగైదు బిస్కట్లు తక్కువ వున్నాయి. ఆ జాడలు ఎటు చూసినా రెండు పాదాలవే కన్పిస్తున్నాయి. వాటిని బట్టి అవి జంతువు జాడలనీ, అది ఫలానా జంతువనీ, చతుష్పాది అనీ వూహించవచ్చు. ఇంకా—అదెందుకలా నడవవలసి వచ్చిందో — రెండు పాదాలమీద — ఎవరి ప్రోత్సాహంతో అదలా నడిచిందో, వారి ఉద్దేశాన్ని గ్రహించడం కూడా కష్టం కాదు.

అయితే అది ఎటు వెళ్ళిందన్న ప్రశ్న ఉద్భవిస్తుంది. జాడలు ముందు తలుపు దగ్గర అంతమవడాన్ని బట్టి, ఆ తలుపు బయటనుంచి గొళ్ళెం పెట్టిబడి వుండడాన్నిబట్టి, బయట దాని జాడలు లేకపోవడాన్నిబట్టి, అది గదిలో

బందీ కావాలి. కానీ అలా లేదు. అదృశ్యమైంది. అదృశ్యమై ఎక్కడికో వెళ్ళిపోయింది.... అది బయటపడ డానికి ప్రయత్నించినట్టూ ఆ తలుపు పక్కనే వున్న కిటికీ ఫ్రేముకి రక్తం మరకలయ్యాయి. కానీ ఆ కిటికీకి వున్న వూచలగుండా అది వెళ్ళలేదు.

శవం మాత్రం దాని మౌలిక స్థితినుంచి కదల్లేదు. ఎలా కూలిన దేహం అలాగే వుంది, గుండెలో పిడికంటూ దిగిన కత్తితో. వెల్లకిలా పడివుంది, తల కుడివైపుకు వాల్చేసి, చేతులు బార చాపి, కాళ్ళు అసవ్యస్తంగా వుంచి, కళ్ళు ఎదురుచూడని ఆ దాడికి ప్రతీకలుగా పెట్టి చూస్తోంది ఎటో—ఇంకా ఇరవై నిండని ఆ అందమైన యువతి.

ఆమె వంటిమీద బట్టలు నలగలేదు, జుట్టు చెదరలేదు. చేతి గాజులు చిట్లలేదు. రిస్టువాచీ ఆగిపోలేదు.... ఆమె గుండె మాత్రం ఆగిపోయి చాలా సేపయింది....

అటో అమ్మాయి అర్థాంతరమైన చావుని చవి చూసింది.

## 3

ఉదయం పదకొండున్నరకు కృష్ణన్ ఏజెన్సీ ఆఫీసుకు వచ్చి, ఒంటరిగా ఏదో వ్రాసుకుంటోన్న లాల్‌ని చూసి, "ఎంతవరకొచ్చింది? ఏం చేస్తున్నారు మీరు? జాన్ ఏడీ?" అన్నాడు హడావుడిగా.

లాల్ తలెత్తిచూసి, కాగితం పెన్నూ పక్కకు తోసేసి అన్నాడు. "జాన్ కృపాకర్ పనిచేసే ట్రాన్స్‌పోర్టు ఆఫీసుకెళ్ళాడు. కాస్సేపట్లో రావచ్చు, ఇన్ఫర్మేషన్ తీసుకొని. నేనేం చేయడంలేదు. మీదెంత వరకు వచ్చింది?"

కృష్ణన్ నిట్టూర్చాడు. "పోస్టుమార్టమ్ పూర్తయ్యింది. రెండు శవాలమీదా రిపోర్టు అందింది. కానీ మీరు ఉత్సాహంగా వున్నట్లు లేరు."

"అసలు కేసులోనే థ్రిల్ లేదు. ఎవరు చేశారో తెలుస్తోనే వుంది. ఈ రెండు హత్యలూ ఒకే వ్యక్తిచేత ఒకే పద్ధతిలో రెండు వేర్వేరు కత్తులతో జరిగాయి. వాటిమీద వ్రేలిముద్రలు మొదటి మర్డర్ ప్లేస్‌లో దొరికిన మనీపర్సు మీదా, రెండో హత్యాస్థలంలో కొన్ని వస్తువులపైనా వేలిముద్రలతో కలుస్తున్నాయి. అవునా? వెల్, అవి కృపాకర్‌వి. అతను పరారయ్యాడు. అతన్ని గాలించడం మీవంతు——"

కృష్ణన్ కసిరాడు. "ఆ ఫూల్——జానకిరాం అప్పుడే చెప్పేస్తే కృపాకర్‌ని పట్టుకోవటం సులువయ్యేది!"

"అతన్ని చివాట్లు పెట్టారుగా——ఇక వూరుకోండి. ఇప్పుడు పోస్టుమార్టమ్‌లో రాజమణి గురించి——ఆమె——ఆమె శీలం గురించి సంగతులేమైనా చెప్పండి——"

"నో, ఇంటర్‌కోర్స్, మిస్టర్ లాల్."

"నో ఇంటర్‌కోర్స్? వెల్, అయితే వాళ్ళిద్దరు కలిసి గడపలేదన్న మాట! అంతకుముందే వాళ్ళ మధ్య సంబంధాలు చెడివుంటాయి. అయితే కృష్ణన్, నలభై అయిదు దాటి నడివయసులో పడ్డ స్త్రీతో, ఇంకా ముప్ఫై నిండని నవయువకుడు కృపాకర్‌కి రోమాన్స్ అంత రంజుగా వుండదు. ప్లెజర్ కోసం చేసివుండడు. డబ్బు కోసం చేసివుంటాడు. అలాగే కుదిరి వుంటుంది అగ్రిమెంట్. ఆమెకు పిల్లలు, అతనికి డబ్బు. ఫిజికల్ కాంటాక్టు తప్ప, మానసికంగా వాళ్ళిద్దరు దగ్గరై వుండరు. ఆ డబ్బు దగ్గరే పేచీ వచ్చినట్లుంది. అతనికి ఆశ పెరిగి

వుంటుంది. ఆమె తిరస్కరించి వుంటుంది-అలా వానుతూ పేచీ నిన్న తారాస్థాయికి చేరుకుంది.

"కానీ కృష్ణన్, అతడామెతో ఘర్షణ పడలేదు. గొడవ చేయలేదు. అది బయట ఎవరికీ వినిపించలేదు. అతను వేరే ఆలోచనతో వచ్చాడు ఏర్పాట్లన్నీ చేసుకుని. గుట్టుగా జరిగిపోవాలనుకున్నాడు పని. మత్తుమందిచ్చాడు కుక్కకి. నవ్వుతూ బాకు దింపాడు రాజమణి గుండెలోకి. నడుములోంచి తాళాలు తీసుకుని ఖాళీ చేసేశాడు బీరువాని. పరారయ్యాడు ఆ సొమ్ము తీసుకుని!

"కానీ అక్కడ్నుంచి తన గదికొచ్చేటప్పటికి అక్కడ తన గర్ల్ ఫ్రెండ్—ఆ ఆటో అమ్మాయి—రజని వుండటం చూసి బెదిరిపోయాడు. వాళ్ళిద్దరు పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. నిన్న మధ్యాహ్నం ఆమె అతని నిజాయితీని శంకించి గొడవచేసింది. అదలావుంది. ఇప్పుడీ కృపాకర్ వున్నట్టుండి అంత సొమ్ముతో, చిత్రమైన వాలకంతో గదికి రావటంతో, ఆమె ఎలర్టు అయివుంటుంది. అతడి నిజరూపం గ్రహించేసి వుంటుంది. అప్పుడెంత ప్రమాదమో తెలుసా కృష్ణన్ కృపాకర్ కి? నోరు నొక్కి ఆమె గుండెలో బాకు దించేశాడు. తన బట్టలూ సరంజామా సర్దుకొని చెక్కేయబోయాడు—

"ఇంతలో ఇక్కడ మన జానకిరాంగారి కుక్క లేచి, తోక దులుపుకొని, ఇంట్లో జరిగింది పసిగట్టి కృపాకర్ ని వెతుక్కుంటూ వచ్చేసింది. అదలా చడీ చప్పుడు లేకుండా లోపలికి రాగానే, సామాను సర్దుకుంటూన్న కృపాకర్ కి ప్రాణాలెగిరిపోయి వుంటాయి. తేరుకొని, అదింకా గొడవచేయకముసుపే దాన్ని లాలిస్తూ కాక తాళీయంగా ఇంటి యజమానురాలి అమ్మాయికోసం

తెచ్చిన బిస్కట్ ప్యాకెట్ అక్కడ టేబుల్ మీద వుండటంతో, దాన్నందుకొని బ్రహ్మాండమైన ఉపాయంతో కుక్కకు బిస్కట్లు అందిస్తూ, అదలా రెండు కాళ్ళమీద లేచి నడుస్తూ తింటూంటే, శవం దగ్గర రక్తంలో తడిసిన దాని పాదాలు జాడలు అద్దుతుంటే, నెమ్మదిగా జాగ్రత్తగా తన సామానుతో తలుపు దగ్గరకు చేరుకొని, అది అదే ఏమరుపాటులో వున్న క్షణాన గబుక్కున బైటకు గెంతి, తలుపు లాగి గొళ్ళెంపెట్టేసి వుంటాడు."

కృష్ణన్ తలెగరేశాడు. "అంతే జరిగింది!"

"అప్పుడు కుక్క బందీ అయింది" అన్నాడు లాల్ తిరిగి కొనసాగిస్తూ, "అతనింకే ఆపద లేకుండా తప్పించుకోగల్గాడు. కుక్క బయటపడడానికి ప్రయత్నించింది—అప్పుడా కిటికీ ఫ్రేముని రక్తం కాళ్ళతో ముట్టుకుంది. ఆ వూచల్లోంచి సాధ్యంకాలేదు. తర్వాత వెనుక గదిలో కెళ్ళింది. అక్కడ వెనుక బాత్ రూంకి తెరచుకునే తలుపు తీసివుంది. అక్కడ్నుంచీ అది బయటపడింది.

"కానీ ఆ తర్వాత అదెక్కడి కెళ్ళిందో, అతన్ని పట్టుకుందో లేదో తెలియదు. పట్టుకుంటే మాత్రం దాన్ని సజీవంగా వుంచడు. పట్టుకోలేకపోతే తిరిగిరావాలి. కానీ ఇంతవరకూ అదెందుకు రాలేదో అర్థం గావడంలేదు."

కృష్ణన్ తల విదిలించాడు. "పట్టుకొని ప్రాణాలు పోగొట్టుకొని వుంటుంది. కృపాకర్ వూరొదిలి పారిపోతే మేమిప్పుడు చాలా కష్టపడాలి. ఆ రెండు హత్యలూ 8-30—10-00 మధ్య జరిగాయి. రెండో హత్య తెలిసి, కృపాకర్ ని అనుమానించేటప్పటికి చాలా ఆలస్యమై పోయింది.... ఆ వ్యవధి, చాలు అతను కనుమరుగవడానికి.

"కానీ లాల్, ఆ ఆటో అమ్మాయి కృపాకర్ గదికి ఎప్పుడొచ్చిందో తెలియదు. ఇల్లుగలామె చూడలేదు. ఆమెకు డూప్లికేట్ తాళంచెవి ఇచ్చాడని అంటోంది. అతను లేని సమయంలో వస్తే ఆమె గది తెరచి కూర్చుంటుందట. ఆ అమ్మాయి గురించి మీకేం తెలుసు, లాల్?"

"ఆ యింటామె చెప్పిందానికంటే వేరే ఏమీ తెలియదు."

కృష్ణన్ అన్నాడు, "అయితే వినండి, ఆమె కన్య కాదు."

లాల్ కలవరంగా చూశాడు, "కన్య కాదా?"

"కాదు. పోస్టుమార్టమ్ చెప్తోంది. వివాహిత కూడా కాదు. కృపాకర్ ఆమెను మభ్యపెట్టాడని కూడా అనుకోడానికి వీల్లేదు."

"ఎందుకు లేదు?"

"ఆమె ఇల్లెక్కడో తెలీదు. ఆమె గురించి మనకేమీ తెలీదు. ఆమె శవం ఫోటోలు అంబర్‌పేట పోలీసులకి పంపాం. వాళ్ళు కనుక్కుని చెప్పారు. ఆమె పేరు రజని. ఆమె అక్కడో ఇంట్లో ఒంటరిగా వుంటోందిట. పగలంతా ఇంట్లోనే వుండి రాత్రంతా బయట ఎక్కడో గడుపుతుందట. ఆమెపట్ల అక్కడెవరికీ మంచి అభిప్రాయంలేదట. కొందరు ఆమె 'ప్రాస్' అంటున్నారుట. అయితే ఆమె పనిచేసే జాయింట్ ఎక్కడో చెప్పలేక పోయారట."

"ఇదంతా ఆశ్చర్యంగా వుంది కృష్ణన్."

"ఆమె ప్రాస్, ఇందులో సందేహంలేదు."

"అయితే కృపాకర్ ఆమె ఎవరో తెలియకుండానే

ప్రేమించాడా, లేక తెలిసే ప్రేమించాడా? వాళ్ళిద్దరు త్వరలో పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారు కూడా...."

"తెలియదు. కానీ ఆమె గురించి మరో నిజం కూడా తెలుసుకోండి" అంటూ ఓ ఫోటో తీసిచ్చాడు కృష్ణన్.

లాల్ అందుకుని చూశాడు. అందులో ఇద్దరు స్త్రీ పురుషులున్నారు. ఆ స్త్రీ రజని. పురుషుడి వీపు భాగం మాత్రం కన్పిస్తోంది.

"ఇతనెవరు?" అన్నాడు లాల్ పరికించి చూస్తూ, "ఈ ఫోటో ఎక్కడిది?"

"ఆమె ఇంట్లోనే దొరికింది. ఇంకా వుండాలి. కానీ ఇదొక్కటే దొరికింది. బహుశ ఈ ఫోటోలో వ్యక్తిని ఆమె బ్లాక్ మెయిల్ చేసి వుండాలి. ఆమె నడత మంచిది కాదు. మనసు మంచిది కాదు. కృపాకర్‌ని ఆమె మోసం చేసే దృష్టితోనే ప్రేమ నటిస్తూండాలి...."

"కానీ .... ప్రేమ నటిస్తోంటే నిన్న మధ్యాహ్నం కృపాకర్‌తో ఎందుకు పోట్లాడింది, పర స్త్రీ విషయంలో?"

"అది ప్రియురాలి లక్షణం కదా? తను అచ్చమైన ప్రియురాలని అతన్ని నమ్మించాలి కదా?"

# 4

మధ్యాహ్నం రెండున్నరకు తిరిగి వచ్చాడు జాన్.

"పార్ట్‌నర్, ఇంట్రెస్టింగ్ న్యూస్! నెత్తిన కొట్టనా?"

"కొట్టకు, కూర్చుని కక్కు!"

నవ్వాడు జాన్ కూర్చుని, "అయితే కాచుకో! కృపాకర్ పెద్ద అడ్వెంచర్ చేశాడు ఎప్పుడో—"

"అడ్వెంచర్?"

"యా! గట్స్ వున్నాయతనికి. అతని ట్రాన్స్‌పోర్టు ఆఫీసులో తెగ పొగుడుతున్నారు. సరిగ్గా నెల క్రితం ఏం జరిగిందో నీకు తెలుసా?"

"ప్రశ్న లెయ్యకు! చెప్పేదేదో త్వరగా ఏడువ్!"

"అయితే విను—సరిగ్గా నెలరోజుల క్రితం కృపాకర్ ఆఫీసు డబ్బు తొమ్మిదివేలు తీసుకొని బ్యాంకులో వేయ డానికి వెడుతూండగా, నయాపుల్ దగ్గర బస్సులో ఎవరో బ్యాగు లాక్కొని పారిపోయాడట—అతను అరుస్తూ వెంటపడ్డా లాభంలేకపోయిందట. ఎవరూ దొంగని అడ్డగించి పట్టుకోలేకపోయారు. వాడు క్షణాల్లో అదృశ్యమైపోయాడు. కృపాకర్ వెళ్ళి అఫ్జల్‌గంజ్ స్టేషన్‌లో రిపోర్టిచ్చాడట. అప్పుడు వాళ్ళు చూపించిన ఏరియాలో ఆపరేట్ చేసే పిక్‌పాకెట్స్ ఫోటోల్లో ఒకతన్ని గుర్తించాడట. అతను సోము. కానీ అతని కోసం పోలీసులు ఎంత గాలించినా దొరకలేదట. సిటీ వదిలి పారిపోయాడనుకున్నారట—

"ఇలా వుండగా..పదిహేను రోజుల క్రితం ఒకనాడు కృపాకర్ ఇంటికొస్తోంటే, అదే నయాపుల్ దగ్గర ఆ సోము అనేవాడు ప్రత్యక్షమయ్యాడట. కానీ అదెలా? మోటార్‌సైకిల్ మీద ఒక పెద్దమనిషితో కలిసి పోతున్నాడట. కృపాకర్ వెంటనే ఆటో ఎక్కి వెంటాడాడట. అంతే, ఆ తర్వాత మూడో రోజున ఆఫీసు డబ్బు మొత్తం తెచ్చి జమ కట్టేశాడట."

"ఓహో, అదెలా?"

"అదంతే. అంతకంటే చెప్పలేదట. సోముని పట్టుకుని బెదిరించి తెచ్చానన్నాడట. అంతే, ఈ సంగతి పోలీసులకి చెప్పలేదట."

"నో, అంత సింపుల్ కాదు. పిక్‌పాకెట్‌ని బెదిరించలేదు."

"అయితే ఏం చేశాడంటావు?"

"సోము గురించి చెప్పు, ఎవరతను?"

జాన్ ఒక ఫోటో తీసి చూపించాడు. "చూడు—పోలీసులనుంచి తెచ్చాను. చాలాసార్లు పట్టుబడ్డాడట. అతనికో అడ్రసంటూ లేదట. హైస్కూలు చదువు. మిమిక్రీ చేసేవాడట. అది లాభసాటి కాదని ఇందులో దిగాడట. అతనో పెద్ద గ్యాంగ్‌తో కలిసి పనిచేస్తున్నట్లు అన్నారు...."

"చూశావా, అందుకే కాదన్నాను. గ్యాంగ్‌ని బెదిరించడమంటే తమాషా అనుకున్నావా?"

"అయితే ఏం చేశాడు?"

"అబద్ధం చెప్పివుండాలి. ఆ డబ్బును మరెక్కడో తెచ్చివుండాలి."

"ఎక్కడ్నుంచి తెస్తాడు? అతని కెందుకా తపన? పోలీసులు గాలిస్తున్నారుగా?"

"వెల్, ఇంకేం తెలుసుకున్నావు?"

"అతను త్వరలో ఒక ఆటో కొంటున్నట్లు చెప్పాడట—సెకండ్‌హాండ్‌లో. డ్రైవర్ని పెట్టి నడిపిస్తాడట. డబ్బు ఏర్పాటు చేసుకుంటున్నాడట.... కానీ లాల్, ఆ ఆటో డబ్బు కోసం రాజమణిని చంపాడంటే నమ్మబుద్ధి గావడంలేదు. దానివల్ల అతను కష్టాలే పడతాడు. ఇది నా నమ్మకమే కాదు, బలమైన ఆధారం కూడా వుంది—ఈ హత్యల్లో అంతా అసహజత్వమే వుంది!"

"ఏమిటది?"

జాన్ రెండు ఫోటోలు తీసిచ్చాడు, "చూడు,

కృష్ణన్ దగ్గర్నుంచి తెచ్చాను. మొదటిది రాజమణి హత్య ఫోటో, రెండోది రజనిది.

"ఈ రెండు ఫోటోల్లో ఒకటి కామన్‌గా వుంది. రక్తంలో ఏర్పడ్డ అడుగుజాడలు — కుక్కవి. వాటిని జాగ్రత్తగా చూడు... తేడా కన్పించడంలేదూ? మొదటి ఫోటోలో జాడలు పెద్దవిగా, రెండో ఫోటోలో చిన్నవిగా లేవూ?"

"వున్నాయి, అయితే?"

"రెండుచోట్లా ఒకే జంతువు తిరిగినప్పుడు జాడలు ఒకే సైజులో వుండాలి కదా?"

"వుండాలని లేదు. రక్తం ఎక్కువ తక్కువ అంటుకోవచ్చు—దాన్నిబట్టి వుంటుంది."

"సరే, అదలా వుంచు. ఈ రెండు ఫోటోల్లో మరొకటి కామన్‌గా వుంది. నడచిన పాదాల సంఖ్య. రెండు ఫోటోల్లోనూ కుక్క రెండు కాళ్ళమీద లేచినట్లు అనుకున్నాము కాని జాగ్రత్తగా చూస్తే నాలుగు కాళ్ళ మీదే నడిచింది.

లాల్ జాగ్రత్తగా చూశాడు.

"వెల్, జాన్ అర్థమైంది—రాత్రి నేను మన హీరో యిన్ని ఒక ప్రశ్న అడగడం మర్చిపోయాను."

"మన హీరోయినా?" అన్నాడు జాన్ తికమకగా.

"వనజాక్షి, అభ్యంతరమా? ఆమె మాటలెలా వున్నా మనిషి ఆశాపరేఖ్ లా వుంది. అందుకే మన-నా అభిమాన హీరోయిన్, ఓ.కే?"

"ఏమిటా ప్రశ్న?"

"అడుగుతాను చూడు!"

లాల్ ఫోనెత్తి ఒక నెంబర్ తిప్పాడు.

వెంటనే వచ్చింది రెస్పాన్స్. "హలో, ఎవరు పిలిచేశారండీ?"

"నేను లాల్‌ని?"

"అయ్యో, లాల్! ఏమిటి .... కృపాకర్ ఏమై పోయేశాడు?"

"వెతుకుతున్నాం, మిమ్మల్నొక ప్రశ్న అడగాలి."

"అడిగేయండి! నాకంతా భయంగా వుందేసింది...."

"కృపాకర్ తనవెంట ఎప్పుడైనా కుక్కను తీసుకొచ్చేవాడా?"

"కుక్కనా? ఏమోకానీ .... ఇవాళ ఉదయం ఏం జరిగేసిందో తెలుసా మీకు, లాల్?"

"ఏం జరిగింది?" కుతూహలంగా అడిగాడు లాల్.

"మా స్వరూప .... అది చూసేసింది .... చూసేసి అర్చింది. నేను వెళ్ళి చూద్దును గదా....అక్కడ వెనుక వరండాలో .... అది ఆ పిల్లి .... మా వీధిలో తిరిగేసే క్యాట్ పిల్లి..భయంకరంగా కన్పించేసింది, లాల్ గారూ! దాని మూతికి....దాని మూతికంతా రక్తం అంటేసింది! కాళ్ళకంతా రక్తం అంటేసింది! దేన్నో చంపివచ్చినట్లు కన్పించేసింది! నేను భయంలో అరుపు కేకవేసేసరికి పారిపోయేసింది. కానీ....కానీ అది మళ్ళీ వచ్చేసినా రావచ్చు! ఓహ్, దాన్ని చూస్తేనే....దాన్ని మీరు వెంటనే వచ్చి అరెస్టు చేసేసి పట్టుకుపోయేస్తారా, డిటెక్టివ్ లాల్ అండ్ జాన్ గారూ?"

లాల్ రిసీవర్ విసిరికొట్టి గభాల్న లేచాడు ఎర్రబడి పోతున్న ముఖంలో, "వెల్, ఆ పిల్లి పుణ్యం కట్టుకుంది! కమాన్, లెటజ్ రన్, పార్టనర్!"

ఆమె వుఱుకుతూ వచ్చి గేటుతీసింది.

డిటెక్టివ్‌లు కారుదిగి, ఒక నిద్రమందు కలిపిన పాల సీసా, ఒక మూతగల వెదురు బుట్టతో ఇంట్లో ఘరికారు.

ఆమె దగ్గరొక పాత సాసరు అడుక్కొని అందులో పాలుపోసి, వెనుక వరండాలో వుంచి, అవతల గదిలో కూర్చున్నారు నిశ్శబ్దంగా. గడియారంలో ముల్లు పరుగిడుతోంది. కాలం దొర్లిపోతోంది. వాళ్ళలో టెన్షన్ పెరిగిపోతోంది.... అరగంటయ్యాక కరుణించిందా మార్జాలం. దాని మ్యావ్! మ్యావ్!లు విని ఉలిక్కిపడి డిటెక్టివ్‌లు చూశారు. అది వరండాలో ఎక్కివచ్చి, కిచెన్ వైపు వెళ్తూ మధ్యలో పాలసాసర్ని చూసి ఆగిపోయింది. మూతిపెట్టింది. నాలుకాడిస్తూ సాసర్లో పాలు పూర్తిచేసింది....

దానికేసి ఉద్రేకంగా చూస్తున్న డిటెక్టివ్‌లకి దాని మూతికీ, కాళ్ళకీ మరకలు కన్పిస్తూనే వున్నాయి.

అది కిచెన్ వైపు కొంతదూరం వెళ్ళి, చటుక్కున కూర్చుండిపోయింది. తల అటూ ఇటూ ఆడించింది. ముందు కాళ్ళతో గోక్కుంది. చిన్నగా మూల్గుతూ అడ్డంపడిపోయింది. మరి కొన్ని క్షణాల్లో గాఢ నిద్రలో వుంది.

డిటెక్టివ్‌లు ఉరికి వెళ్ళి దాని దగ్గర కూర్చున్నారు. శరీరాన్ని జాగ్రత్తగా పరిశీలించి దాని మూతికీ కాళ్ళకీ వున్నవి రక్తం మరకలేనని నిర్ధారించారు. బుట్టలో నిర్బంధించారు.

లాల్ లేచి నిలబడ్డాడు, "వెల్, ఈ పిల్లి మనల్ని గట్టెక్కించింది!"

"గుట్టు రట్టు చేసింది!" చేతులు చరిచాడు జాన్.

"కానీ జాన్, ఆ కుక్క ఇప్పుడు లేదు .... అది రాజమణికంటే ముందే చంపబడింది."

"మరి దాని అరుపులు....అవెలా విన్పించాయి రెండు హాత్యా స్థలాల్లోనూ?"

లాల్ అదోలా నవ్వాడు. "విన్పిస్తాయి .... మిమిక్రీ చేస్తే విన్పిస్తాయి....నువ్వెళ్ళి ఆ రజని పనిచేసేదెక్కడో కనుక్కో జాన్. ఆమె కాల్ గర్ల్. ఏ హోటల్‌కు లేదా బార్‌కు వెళ్ళేదో తెలుసుకుంటే ఆ సోముని పట్టుకోవడం సులువవుతుంది. వాళ్ళిద్దరికి కనెక్షన్స్ వుండితీరాలి! వాళ్ళిద్దరు కలిసి ఇందులో పనిచేశారు. త్వరగా వెళ్ళు. నేను కృష్ణన్‌కి ఈ పిల్లిని అప్పగించి వివరాలు తెలుసుకుంటాను...."

జాన్ తలూపి వెంటనే వెళ్ళాడు.

లాల్ బుట్టనెత్తుకొని ఆమెవైపు తిరిగాడు, "మీరు నా ప్రశ్నకి జవాబు చెప్పనేలేదు — కృపాకర్ వెంట ఎప్పుడైనా కుక్క వచ్చేదా?"

ఆమె అడ్డంగా తలూపింది వెంటనే, "కుక్కరాలేదు. ఎప్పుడూ వచ్చేయలేదు. రాత్రి మాత్రం అరుపులు వినేశాను పైన. కానీ ఆ అమ్మాయిని .... మీరెందుకు కాల్ గర్ల్ అన్నారు, లాల్? మంచి అమ్మాయి ఆమె."

లాల్ నిట్టూర్చి కదిలాడు. "నాకీ లోకంలో మంచి కంటే చెడే ఎక్కువ కన్పిస్తోంది, ఏం చేయమంటారు?"

# 6

జాన్ సాయంత్రం ఆరుగంటలకి ఫోన్ చేశాడు.

"పార్టనర్, నీ హీరోయిన్ రజనిని ఆటో అమ్మాయని ఎందుకంటుం దంటావు?"

"ఆమె ఎప్పుడూ ఆటోలో వచ్చేది కాబట్టి."

"అవును, అందులో అసహజంలేదు. కానీ—ఎప్పుడూ ఒకే ఆటోలో రావడం విచిత్రం కదూ?"

"ఒకే ఆటోలో వచ్చేదా? వెల్, ప్రొసీడ్!"

"కృపాకర్ ఇంటిదగ్గరే మొదలుపెట్టాను ఎంక్వయిరీ. ఇది నీ హీరోయిన్ గమనించలేదు. కానీ ఆ వీధిలో కొందరంటున్నారు — ఆమె ఎప్పుడూ ఒకే ఆటోలో వచ్చేదట! నెంబర్ కూడా చెప్పారు."

"వెల్, వెరీ వెల్."

"ఆ నెంబర్‌తో నేనా ఆటోవాలాని పట్టుకున్నాను. అతను ముందు నోరు విప్పలేదు — నేను కేసు తీవ్రత చెప్పగానే పాఠం ఒప్పజెప్పేశాడు! రజనిని రోజూ సాయంత్రం ఇంటినుంచి క్లబ్బుకి తీసుకెళ్తాడట. మళ్ళీ తెల్లవారుజామున తెచ్చి డ్రాప్ చేస్తాడట. మధ్యలో ఆమె ఎక్కడైనా ఆగితే వెయిట్ చేస్తాడట. నెల పద్ధతి పైన ఇది కుదుర్చుకున్నాడట."

"అయితే ఆమె ఏ క్లబ్‌కి వెళ్తోంది?"

"చెప్తే ప్రాణాలు పోతాయన్నాడు. నేను గ్యారంటీ ఇచ్చాను. అప్పుడు చెప్పాడు, బర్కత్‌పురాలో ఓ అడ్రసు. నేనక్కడికి వెళ్ళి విచారిస్తే అది జూదగృహమని తెలిసింది. అక్కడ గాంబ్లింగ్‌తో పాటు ఇంకా చాలా జరుగుతున్నాయి...."

"వెరీగుడ్, అడ్రసు చెప్పు!"

జాన్ చెప్పిన అడ్రసు రాసుకున్నాడు లాల్.

"వెల్, జాన్, నిన్న ఆమె క్లబ్‌కి వెళ్ళలేదటనా?"

"లేదట, కృపాకర్ ఇంటి దగ్గర డ్రాప్ చేసి వెళ్ళిపోయాడట తొమ్మిదిగంటలకి. ఆమె మళ్ళీ రావద్దందట."

"ఓహ్, ఆ క్లబ్‌తో చాలా పనుంది .... ఆ కుక్క చచ్చిపోయింది, జాన్. కృష్ణన్ దగ్గర ఆ బ్రెడ్ ముక్కను చూశాను. అది నిజంగా కుక్క తిన్నట్లులేదు. దానికేదో సెడేటివ్ పూశారంతే. దాన్ని కుక్క కొరికిన గుర్తులు లేవు. పంటిగాట్లుగానీ, కాలిగోటి గుర్తులుగానీ లేవు. ముక్క సగానికి విరిచి అక్కడ పడేశారంతే...."

"వెరీ కన్నింగ్!"

"వెల్, వీక్ పాయింట్స్ ఒకొక్కటే బయట పడుతున్నాయి....జాన్, నువ్విక వచ్చేయ్."

లైను కట్ చేసి లాల్ మరో నెంబర్ తిప్పాడు.

వెంటనే రెస్పాన్స్ వచ్చింది....

"యస్, చిసీజ్ టాస్క్‌ఫోర్స్. ఇన్‌స్పెక్టర్ దుబే స్పీకింగ్ ...."

"లాల్ హియర్, ట్విన్ సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీ."

"ఓహ్, లాల్. చెప్పండి...."

"మీకో టిప్. ఈ అడ్రసు తీసుకోండి...." లాల్ చెప్పాడు.

"ఓ.కే. ఏమిటిది, లాల్?"

"ఆ ఇల్లు జూదగృహం. అక్కడ గాంబ్లింగ్‌తో పాటు ఇంకా నానా గలీజు పనులు జరుగుతున్నాయి. మీ కర్తవ్యం గుర్తుచేస్తున్నాను...."

"ఓహ్ థాంక్యూ, మిస్టర్ లాల్! థాంక్యూ!"

"మేమక్కడ ఎదురుచూస్తాం" అని లాల్ ఫోన్ పెట్టేశాడు.

# 7

రాత్రి పదిగంటలకి బర్కత్‌పురాలోని ఆ యింట్లో వాళ్ళంతా తమతమ పనుల్లో జోరుమీద వుండగా,

టాస్క్‌ఫోర్స్‌వారు మెరుపు దాడిచేసి అదరగొట్టేశారు. అవాక్కయిపోయి, ఒక్కొక్కరే బయటకు వచ్చి వ్యాను ఎక్కారు. మొత్తం ఇరవైమంది జల్సారాయుళ్ళతో పాటు అయిదుగురు వలపుల రాణుల్నీ తోలుకెళ్ళి పోయారు టాస్క్‌ఫోర్స్‌వారు.

పదిన్నరకల్లా అక్కడింకెవరూ లేరు, డిటెక్టివ్‌లు తప్ప.

వాళ్ళు వేగంగా గదులన్నీ చూసుకుంటూ వెనుక పెరట్లోకెళ్ళారు. అక్కడ లైటు వేసి నలువైపులా చూసి కుడివైపు గోడవారగా వెళ్ళి నిలబడ్డారు. అక్కడ నేలను పరిశీలిస్తూ అక్కడున్న ఆస్బెస్టాస్ రేకుల్ని తొలగించి చూశారు. కింద భూమి ఇటీవలే తవ్వి తిరిగి కప్పబడినట్లుంది....

జాన్ పెరడంతా తిరిగి ఓ మూల పారాపలుగూ చూశాడు. వాటికింకా మట్టి అంటుకొనుంది. పారందుకుని తిరిగి ఆ స్థలానికి వచ్చి గబగబా అక్కడి మట్టిని తీయ సాగాడు. లాల్ సిగరెట్ తాగుతూ చూస్తూ నిల బడ్డాడు. మట్టితీస్తూ జాన్ ఒక్కసారి ఆగిపోయాడు. అప్పటికి రెండడుగులు తీశాడు. అలా తీస్తున్నప్పుడు పారకేదో తగిలినట్లయింది. వంగి పరీక్షగా చూశాడు. ఆ వెంటనే అర్చాడు—

"కాలు....కుక్క కాలు!"

లాల్ గబుక్కున చూశాడు. అతని కళ్ళు పెద్ద వయ్యాయి.

"వెల్, ఇంకా తవ్వు!"

జాన్ తవ్వుతోంటే కుక్క శరీరం క్రమంగా బయట

పడసాగింది. ఇద్దరూ గ్లవ్స్ తొడుక్కుని, కర్చీఫ్ అడ్డం పెట్టుకుని దాన్ని పట్టి లాగారు. పైన పడేసి అక్కడ కూర్చుని దాని కాళ్ళని పరిశీలించారు. దాని ముందరి కాళ్ళకు మాత్రమే రక్తం మరకలున్నట్లు చూశారు.

అప్పుడు జాన్ అప్రయత్నంగా ఆ గొయ్యిలోకి చూసి అదిరిపడ్డాడు.

"ఏమిటి?" లాల్ అడిగాడు అటువైపు చూస్తూ.

"చూడు.... చెయ్యి....ఎవరిదో చెయ్యి!"

ఆ గొయ్యిలో ఓ పక్కనుంచి బయటపడ్డ చేతిని చూస్తూనే లాల్, పారందుకుని గబగబా, వేగంగా మట్టిని తవ్వి పారెయ్యసాగాడు. జాన్ కళ్ళప్పగించి చూస్తున్నాడు. మట్టి తొలుగుతోంటే బయల్పడతూన్న ఆకారాన్ని ఊపిరి బిగబట్టి చూడసాగాడు ...మానవాకారం.

"ఓ గాడ్! కృపాకర్ ....కృపాకర్ ...." గొణిగాడు జాన్.

"ఎవరది—ఎవరు?"

ఇద్దరూ ఉలిక్కిపడ్డారు వెనుక మాటలు విని.

లాల్ చేతిలో పార జారిపోయింది. జాన్ గబుక్కున నిలబడ్డాడు.

జానకిరాం వేగంగా కదిలి ముందుకొచ్చాడు. డిటెక్టివ్లు తేరుకొనే లోపున అతని మనుషులు మెరుపులా వచ్చి చుట్టుముట్టేశారు.

# 8

ఇన్స్పెక్టర్ కృష్ణన్, మరి కొందరు సబిన్స్పెక్టర్లూ, కానిస్టేబుల్స్తో వచ్చి వుద్రేకంగా అరిచాడు. "జానకిరాం! మీరెలా వచ్చారు ఇందులోకి?"

"నన్నడగండి, నేను చెప్తాను" అన్నాడు లాల్, టలు దులుపుకుంటూ.

కృష్ణన్ అతన్ని చూశాడు. అతని వాలకం చూసి ందోళన చెందాడు. జాన్ కూడా అలాగే వున్నాడు. ద్దరి చేతుల్లో రివాల్వర్లున్నాయి. ఒకపక్క కుర్చీలో ధలకుండా కూర్చున్నాడు జానకిరాం. నేలమీద అతని నుచరులు మూల్గుతూ, మెలికలు తిరుగుతూ కూర్చు న్నారు.

"ఫైటింగ్?" అడిగాడు కృష్ణన్.

"చిన్న ఎక్సర్‌సైజు, అంతే" చెప్పాడు లాల్.

"ఏమిటిదంతా? ఎలా జరిగింది?"

"మీ కెవరికీ తెలియదు. జానకిరాంకి కూడా తెలీదు. గాస్క్‌ఫోర్సు వాళ్ళు వచ్చి ఇందాక రెయిడ్ చేసి ళ్ళారు. మేం వెనుక పెరట్లో తవ్వకాలు సాగిస్తున్నాం. ంతలో జానకిరాం వచ్చేశాడు తన టీముతో. ఈ టీము- ళ్ళంతా దొంగల ముఠా. జేబులు కత్తిరిస్తారు. ఆ గద్ద ుక్కతనే సోము. వీళ్ళందరికీ జానకిరాం గురువు. ఈ ాద—పాన—గానా బజానాశాల అతనితే. ఇతను ామమాత్రపు ఎస్టేట్ ఏజెంట్. మెయిన్ బిజినెస్, ెనుక చేసే పనులు ఇవన్నీ!"

"ఓహ్ వివరించండి, లాల్!"

"యూసీ కృష్ణన్, ఈ జానకిరాంని మూడువైపుల ుంచీ ఎడాపెడా వాయించేస్తున్నారు; అతని భార్యా, ్రపాకరూ, ఆ ఆటో అమ్మాయీ! భార్య మానసికంగా యాందోళనలు కల్పిస్తోంటే, మిగతా ఇద్దరూ ఆర్థి ుగా క్షవరం చేసేస్తున్నారు. అలాటి పరిస్థితిలో నకిరాం ఆ ముగ్గుర్నీ మట్టుబెట్టాలనుకున్నాడు.

కృష్ణన్, ముగ్గుర్నీ మట్టుబెట్టడం అంత సామాన్యమైన పనికాదు. ఏ పరిస్థితిలోనూ తను చట్టానికి చిక్కిపోయే ప్రమాదం లేకుండా-రెండు కన్పించే హత్యలు సృష్టించి, ఒకటి కన్పించని హత్యను చేశాడు. కన్పించని హత్యకు గురైన హతుడ్నే కన్పించే రెండు హత్యలకీ కారకుడిగా చూపించి చట్టాన్ని ఆ దోవ పట్టిస్తే — ఆ చట్టం ఆ హంతకుడి కోసం గాలిస్తూ వుంటుంది. తనిక్కడ క్షేమంగా వుండిపోవచ్చు.

రజని ఇంట్లో దొరికిన ఫోటోలో వ్యక్తి ఇతనే. ఇతని దగ్గర పనిచేస్తూ, ఇతన్నే ట్రాప్ చేసి బ్లాక్ మెయిల్ చేసిన ఆమె ధైర్యాన్ని మెచ్చుకోవాలి. ఇతనికి భార్యా భయం ఎక్కువ. పైగా ఆమె ముందు ఇన్ఫీరియారిటీ. ఆమె డామినేషన్ ఇతనిమీద వుంది. బైట తను నడిపే ఈ వ్యవహారాలు ఆమెకు తెలియకుండా జాగ్రత్త పడుతున్నాడు. లేకపోతే తుఫాను లేస్తుంది. ఆమె అరిచి గొడవ చేసిందంటే గుట్టు రట్టవుతుంది-జైలుపాలవుతాడు తర్వాత.

ఈ వీక్ పెస్ నే కనిపెట్టి రజని అతన్ని బ్లాక్ మెయిల్ చేసింది. బాగా డబ్బు గుంజింది. ఇతను కిక్కురుమనకుండా వున్నాడు. అయితే, ఎప్పుడైతే సోము కృపాకర్ దగ్గర డబ్బు కాజేశాడో, ఆ తర్వాత కృపాకర్ అతని జాడతీసి స్థావరం కనుక్కున్నాడో, అప్పుడే మొదలైంది జానకిరాం బిజినెస్‌లో ముసలం.

కృపాకర్ సోముని పట్టుకొని బెదిరించలేదు. అలా చేస్తే డబ్బు రాకపోక ప్రాణాలే పోతాయి. అందువల్ల వేరే ఆలోచనతో స్థావరాన్ని వీళ్ళ చర్యల్నీ కనిపెట్టసాగాడు. ఆ స్థావరమే ఈ క్లబ్బు. దీని యజమాని ఈ

జానకిరాం అనీ, అతనిక్కడ చాలా చట్టవ్యతిరేక కలాపాల్ని సాగిస్తున్నాడనీ తెలుసుకొని, అతన్ని జాగ్రత్తగా కనిపెడుతూ యింకా, ఇల్లూ, యింట్లో భార్యనూ, భార్యాభర్తలమధ్య సంబంధాల్నీ, తెలుసుకొని—మూడురోజుల్లో నిర్ణయానికొచ్చి—ఆ భార్యను అప్రోచ్ అయ్యాడు తన ప్రపోజల్‌తో.

అతను ఆఫీసు డబ్బుకోసమే ఈ రిస్కు తీసుకోలేదు. మరో ఆలోచన వుంది—స్వంత కోరిక—ఆటో కొనుక్కోవాలనుకున్నాడు. అందుకవసరమయ్యే డబ్బుకోసం ఈ మార్గాన్నెన్నుకుంటే సులువవుతుందనుకున్నాడు. అయితే పోయిన ఆఫీసు డబ్బునే ముందుగా వసూలుచేసి జమ కట్టేశాడు. ఆ తర్వాత తన ఆటో డబ్బుల కోసం ప్రయత్నాలు ప్రారంభించాడు. ఇక్కడతని నిజాయితీ రుజువవుతోంది.

వెల్, రాజమణికి కృపాకర్ ద్వారా భర్తచాటు వ్యవహారాలు తెలిసిపోయి అతన్ని సాధిస్తూనే, ఇటు కృపాకర్ బ్లాక్ మెయిల్‌కీ లొంగిపోయింది. అతనికి డబ్బులిస్తూ భర్తని రక్షించుకుంటూపోయింది—ఈ బ్లాక్ మెయిల్ సంగతి భర్తకి తెలియనివ్వద్దని హెచ్చరించాడు కృపాకర్. లేకపోతే క్షణాల్లో తన ప్రాణాలు పోతాయి.

వెల్, పోనేపోయాయి. జానకిరాం ఈ బ్లాక్ మెయిల్ పసిగట్టాడు. తనకి ముప్పు గ్రహించాడు. చేస్తున్న దెవరో తెలుసుకుందుకు మనిషిని నిఘా పెట్టించాడు ఇంటిమీద. కృపాకర్ రాకపోకల్ని తెలుసుకున్నాడు. అతని వివరాలన్నీ తెలుసుకున్నాడు. అప్పుడాలోచించాడు. తన

రహస్యాలు తెలుసుకున్నవాళ్లు పెరిగిపోతున్నారు. ముందు రజని. తర్వాత తన భార్య. ఇప్పుడీ కృపాకర్. ఈ ముగ్గుర్నీ అంతమొందించడంతో తనకి శాంతిలేదని తీర్మానించుకున్నాడు—

అప్పుడీ పథకం వేశాడు. ముందు అతని భార్య చావుకీ, మరో శత్రువు రజని చావుకీ సంబంధ ముందేట్లుగా పరిస్థితుల్ని సృష్టించాడు. తనింటికి కృపాకర్ రాకపోకలకి ఒక రంగుపూసి అది రంకులా భ్రమింపజేశాడు. తర్వాత రజనిని ఏవో కారణాలు చెప్పి కృపాకర్ మీదికి తోలాడు—అతనితో పరిచయం పెంచుకొని ప్రేమలోకి దింపమనీ, ప్రేమ నటించమనీ. ఆమె అమాయకంగా నమ్మి ఒప్పుకుంది. ఆమె ఎవరో తెలియక కృపాకర్ నిజంగానే ప్రేమించేశాడు. జానకిరాం ట్రాప్‌లో పడ్డాడు.

అంతే, అప్పుడు రంగం సిద్ధమైంది. ఒకవైపు మిస్ట్రెస్, మరోవైపు ప్రేమించే ప్రియురాలూ, నడుమ మతి చలించిన మగవాడు. డబ్బాశతో ఆ మిస్ట్రెస్‌ని చంపేసి, రహస్యం తెలుసుకున్నందుకు భయంతో ప్రియురాల్నీ అంతంచేసి సొమ్ముతో పరారయ్యాడెక్కడికో! వాట్. వండర్‌ఫుల్ సెటప్! అంతే కృష్ణన్ ఈ సెటప్‌తో వరుసగా ముగ్గుర్నీ చంపుకుంటూపోయాడు.

కృపాకర్‌ని—అతను ఆఫీసునుంచి వస్తున్నప్పుడో, మరెక్కడో కిడ్నాప్ చేసి క్లబ్బులో మట్టుబెట్టేశారు. అతని వేలిముద్రలు రెండు కత్తులమీద అద్దుకొని జాగ్రత్త చేసుకున్నారు. అతని జేబులో మనీపర్సు తీసుకున్నారు.

వాటితో ఈ గద్దముక్కు తను జయుద్దేరి ముందు రాజమణి కోసం వెళ్ళాడు. అక్కడ పక్కకి విషం

వూసిన రొట్టెపెట్టి చంపాడు. ఒక సెడేటివ్ పూసిన రొట్టెముక్కని అక్కడ ప్లాంట్ చేశాడు. అప్పుడింట్లోకి వెళ్ళి కృపాకర్ వేలిముద్రలున్న కత్తితో రాజమణి గుండెలో పొడిచాడు. ఆమె కూలిపోగానే కత్తినలాగే వదిలేసి, బొడ్లో తాళాలు తీసుకొని బీరువా తెరిచాడు. సొమ్ము సంచీలో నింపుకున్నాడు.

ఆ తర్వాత చచ్చిపోయిన కుక్కని తెచ్చి, దాని ముందరి కాళ్ళ రక్తంలో ముంచి జాడలు సృష్టించాడు. ఆ పని ఒక్కడు చెయ్యడం కష్టం కాబట్టి మరొకడు తోడ్పడి వుండాలి. ఇంకెక్కడెక్కడ మరకలు చెయ్యాలో చేసి, వెళ్ళిపోయారు — మనిషన్ని మంచం మీద పడేసి, కుక్కని గోనెసంచీలో మూటగట్టుకుని.

అప్పుడా రెండవవాడు కుక్క శవంతో క్లబ్బు కొచ్చేశాడు. ఇక్కడ గొయ్యితీసి కుక్కనీ, కృపాకర్‌నీ పాతిపెట్టేశారు. అక్కడ సోము, కృపాకర్ దగ్గర తీసుకున్న తాళాలతో అతని గదికెళ్ళి రహస్యంగా తెరచి కూర్చున్నాడు రెండో కత్తితో.

జానకిరాం సూచన మేరకు ఆ మధ్యాహ్నం కృపాకర్‌తో పోట్లాడి వెళ్ళిపోయినందుకు క్షమాపణ చెప్పుకునే నెపంతో వెళ్ళింది రజని అతని గదికి, సరిగ్గా తొమ్మిదిన్నరకి. అప్పుడు వూహించనివిధంగా అక్కడ మృత్యువాత పడింది. సోము, కృపాకర్ వేలిముద్రలున్న రెండో కత్తిని ఆమె గుండెలో దింపేసి, సాక్ష్యాధారాలు సృష్టించి వెళ్ళిపోయాడు.

అంతే కృష్ణన్, అలా ఈ ఆపరేషన్ ముగిసింది. ప్రమాదకారులు టోకున టోకన్‌లు తీసుకున్నారు పర

లోకానికి. ఇక్కడ జానకిరాం పార్టీ స్వేచ్ఛగా వూపిరి పీల్చుకుంటున్నారు...." అని లాల్ వివరించాడు.

"కానీ మీరతన్నెలా అనుమానించారు?" అడిగాడు కృష్ణన్.

లాల్ నవ్వి సోముని చూశాడు. "ఆ పిక్‌పాకెట్ ఎప్పుడైతే పదిహేను రోజుల క్రితం ఒక పెద్దమనిషితో మోటార్ సైకిల్ మీద వెళ్తూ కృపాకర్‌కి కన్పించాడని తెలిసిందో....అప్పుడే అనుమానించాను. ఎందుకో తెలియదు, జానకిరాంకి బైక్ వున్నంతమాత్రాన అతనే ఆ పెద్దమనిషని అనుకోలేం. కానీ నేనదే యాంగిల్‌లో ఆలోచిస్తూపోతే చాలా వీక్‌పాయింట్లు బయటపడ్డాయి! వాటిని డెవలప్ చేస్తే పాజిటివ్ ప్రింట్ ఇలా వచ్చింది! కృపాకర్ ఎన్నడూ తనవెంట ఏ కుక్కనీ గదికి తేకపోతే, జానకిరాం తన కుక్కతో అతనికి బాగా చనువుందనీ, తరచు ఇంటికి తీసుకొస్తుంటాడనీ, దానికి దారి తెలుసనీ చెప్పటంలో ఉద్దేశ్యం ఏమిటి?

తర్వాత—రజని శవం దగ్గర జాడలు, కేసుని విడగొట్టడానికి ఇవి చాలా తోడ్పడ్డాయి. హంతకుడు తను సృష్టించిన జాడలతో తనే దొరికిపోయాడు. ఆ జాడలు మొదట వ్యాసంలో కంటే పరిమాణంలో కొంచెం పెద్దవిగా ఏర్పడ్డాయి. జాన్ ఇది దృష్టికి తెచ్చినా, అప్పుడు వాటి వరిజినాలిటీపట్ల నాకు వేరే అనుమానాలు కలుగలేదు. అయితే అవి రెండు పాదాల జాడలు, కానీ అక్కడ నడచిన పాదాలు నాలుగన్నాడు.

అయితే కృపాకర్ ఎందుకలా చేశాడన్న ప్రశ్న వచ్చింది. ఎందుకా జాడల్ని టాంపరింగ్ చేసి అక్కడ

కుక్కతో లేని డ్రామాను తనపై సృష్టించుకున్నాడు? ఏ విధంగా చూసినా ఇది కన్విన్సింగ్ లేదు, ఆ ఎవిడెన్స్‌ని ఎవరో అతనిమీద బనాయిస్తే తప్ప!

అంతే, అదే సంభవమనిపించింది .... ఆ ప్రకారంగా చూస్తే హంతకుడు కృపాకర్ కాలేదు. ఇంకా అతను సజీవంగా వుండలేదు! ఇదీ రుజువైపోయింది — అసలక్కడ నడిచింది కుక్క కాదనీ, పిల్లీ అనీ తెలిసినప్పుడు!

ఆ పిల్లి నాలుగు కాళ్ళకీ రక్తం వుండటంతో జాన్ వాదనకి ఆధారం చిక్కింది. హంతకుడు గదిలో వుండగా ఆ పిల్లి వచ్చి వుంటుంది. అప్పుడతను తరిమేస్తే కిటికీగుండా పారిపోయింది. కాబట్టి కిటికీకి రక్తం మరకలయ్యాయి. అప్పుడు హంతకుడికో ఆలోచన వచ్చి— అక్కడ బిస్కట్ పాకెట్‌ని చూడటంతో — మనం వూహించిన విధంగా సాక్ష్యాధారాలు సృష్టించాడు. అలా కుక్క కృపాకర్‌ని వెతుక్కుంటూ ఇక్కడకొచ్చిందనీ, ఇక్కడ్నుంచి మళ్ళీ అనుసరిస్తూపోయిందనీ అనుమానేలా చేశాడు. అందుకే జానకిరాం మా దగ్గరకు వచ్చి కుక్కతో కృపాకర్‌కున్న స్నేహాన్ని కల్పించి చెప్పాడు—

అయితే ఇంత ఆర్భాటంగా చేసిన హంతకుడు ఎవరు? జానకిరాం కాదు. అతను ఎలిబీ సృష్టించుకొని వచ్చాడు, ఏదో అగ్రిమెంట్ నెపంమీద. పోతే అనుచరుడు సోము వున్నాడు. అతనికి మిమిక్రీ వచ్చు. అతనే రెండు హత్యాస్థలాల్లోనూ కుక్కలా మొరిగి దాని ఉనికిని ఎస్టాబ్లిష్ చేశాడు,"

"టూ మచ్ తెలివి!" అన్నాడు కృష్ణన్.

"దట్సాల్, మీరిక వీళ్ళందర్నీ తీసుకెళ్ళండి. కృపాకర్ శవాన్ని కనుక్కున్నాం! పెరట్లో అతని శవం సంగతి చూడండి, కృష్ణన్...." అంటూ లాల్, కర్చీఫ్ తీసి మొహం తుడుచుకున్నాడు.

పెరట్లో సగం తీసిన గొయ్యిలో ప్రపంచంలో ఎవరికీ వుండని ఓర్పూ, నిర్లిప్తతలో ఎదురుచూస్తోంది కృపాకర్ శవం...

—:ఐ పో యిం ది:—

సీరియల్

# రక్తపుటేర్లు

వసుంధర

(గత సంచిక తరువాయి)

శ్యామలరావు అందగాడు కాకపోవడం మాత్రమే కాదు. కురూపికింద వస్తాయి. అయితే శ్యామలరావు బియ్యే ప్యాసయ్యాడు. చిన్న ఉద్యోగం కూడా చేస్తున్నాడు. తండ్రి ఆస్తిలోంచి అతడికి పదెకరాలు వాటా కూడా వస్తుంది. ఈ కారణంగా శ్యామలరావు కోసం ఎందరో ఆడపిల్లల తలిదండ్రులు తిరుగుతున్నారు. అందువల్ల శ్యామలరావుకు తను చాలా అందగాడినన్న భ్రమ ఏర్పడింది.

చాలా సంబంధాలనతను పిల్ల అందం నచ్చక వదిలేశాడు. పిల్ల అందం నచ్చిన నాలుగు సంబంధాలను కట్నం నచ్చక వదిలేశాడు.

ఆఫీసులో అతడితోపాటు ఉద్యోగం చేస్తున్న ఊర్మిళ అతణ్ని ప్రేమిస్తోంది. ఆమె ప్రేమకు కారణం ఒక్కటే—ఆమెకు మొగుడు కావాలి! తండ్రి కట్నం యిచ్చి పెళ్ళి చేయలేదు. ఊర్మిళ చాలామందిని ప్రేమించబోయింది. ఎన్నోచోట్ల విఫలురాలైంది. ప్రస్తుతం ఆఫీసులో బ్రహ్మచారిగా మిగిలింది శ్యామలరావొక్కడే!

ఊర్మిళ అందమైనదనే చెప్పుకోవాలి. అందువల్ల

శ్యామలరావుకు ఆమె ప్రేమ గర్వకారణంగా ఉంది. అలాగని ఆమెను పెళ్ళి చేసుకోనూలేడు. ఊర్మిళకూ అతడికీ కులం కలవలేదు. తండ్రి ఈ పెళ్ళికి ఒప్పుకోడని అతడికి తెలుసు. తండ్రి ఒప్పుకోని పెళ్ళి చేసుకోవడం అతడికిష్టంలేదు.

పెళ్ళి చేసుకుంటాడన్న ఆశతో ఊర్మిళ శ్యామల రావుతో పార్కుల్లోనూ, సినిమాల్లోనూ తిరుగుతోంది.

అందువల్ల శ్యామలరావు ప్రిస్టేజి పెరుగుతోంది. అది పెంచుకోవడంకోసమేకాక అతను తన ఆనందంకోసం కూడా ఆమెతో తిరుగుతున్నాడు. ఒక అందమైన ఆడపిల్ల ఏకాంతంలో కూర్చుని కబుర్లు చెబుతూంటే ఆ అనుభవమతడికి చాలా బాగుంది. అందుకే అతడామెకు తెలిసికూడా తన ప్రేమ పెళ్ళికి దారితీయదన్న విషయం చెప్పలేదు.

"ఊర్మిళా-నిజంగా నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?" శ్యామలరావీ ప్రశ్న యథాలాపంగా అడగలేదు. అది అతడి మనసును వేధిస్తున్న ప్రశ్న కావడం ఒకటైతే, ఆమె యిచ్చే జవాబు పదేపదే వినాలన్న రెండవ కారణం కూడా అతడిచేత తరచు ఆ ప్రశ్నను వేయిస్తూ ఉంటుంది.

"నీకీ అనుమాన మెందుకొచ్చింది?" అన్నది ఊర్మిళ.

శ్యామలరావు తన అహంకారాన్నెప్పుడూ వదులుకో లేదు—"నా చుట్టూ ఎందరో ఆడపిల్లల తలిదండ్రులు తిరుగుతున్నారు. అయినా నీ ప్రేమ ఒక్కటే నాకెంతో ఆనందాన్ని కలిగిస్తోంది. బహుశా నేనూ నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నానుకుంటాను. అందువల్ల నే నీ ప్రేమ గురించి ధృఢి చేసుకోవాలనిపిస్తుంది—"

ఊర్మిళ తమాషాగా నవ్వి—"నీ చుట్టూ తిరిగేవాళ్ళు నీ చదువు, డబ్బు, నీ తండ్రి సంప్రదాయం చూసి వస్తున్నారు. కానీ నేను నీ వ్యక్తిత్వంపట్ల ఆకర్షితురాలినై నిన్ను ప్రేమిస్తున్నాను. చెప్పాలంటే నాది ప్రేమకాదు. ఆరాధన!" అంది.

శ్యామలరావు గర్వంగా నవ్వి — "నీ ఆరాధన నా అదృష్టం—" అన్నాడు.

"నువ్విలా అనుకోవడం నా అదృష్టం—" అంది ఊర్మిళ.

"ఇద్దరూ ఒకరి ప్రేమనొకరు అదృష్టంగా భావిస్తున్నాం. అంటే ఒకరిపై ఒకరికి బాగా నమ్మకం ఏర్పడిందన్నమాట. అలాంటప్పుడు ఒక్కసారి మనమిద్దరం కలిసి 'ఏ మహాబలిపురమో తిరిగివస్తే ఎంత బాగుంటుంది?" అన్నాడు శ్యామలరావు.

"బాగుంటుందని నాకూ అనిపిస్తోంది—" అంది ఊర్మిళ.

శ్యామలరావు కళ్ళు మెరిశాయి—"నిజంగా నాతో వస్తావా?" అన్నాడు.

"రానప్పుడు మన ప్రేమకు అర్థమేమిటి?" అంది ఊర్మిళ.

"అయితే రేపే ప్రయాణమవుదాం—"

"కుదరదేమో—" అంది ఊర్మిళ.

"ఎందుకు కుదరదు? ఆఫీసరు చాలా మంచివాడు. అడగ్గానే సెలవిస్తాడు—"

"ఆయన సెలవివ్వడం సమస్య కాదు. ఈ రోజే మన పెళ్ళి జరిగే అవకాశ ముండదేమోనని అనుమానిస్తున్నాను—" అంది ఊర్మిళ.

"ఈ రోజే పెళ్ళా—అంత తొందరేమొచ్చింది?"

"మనం కలిసి తిరగాలనుకుంటే అది పెళ్ళయినాకనే కదా!"

"అంటే నీకు నమ్మకం లేదా నామీద?"

"నాకు నామీదా, నీమీద కూడా నమ్మకముంది. కానీ నీకు నీమీద నమ్మకముందో లేదో తెలియదు—" అంది ఊర్మిళ.

"అదేం?"

"మన ప్రేమ పెళ్ళికి దారి తీస్తుందన్న నమ్మకం నీకు లేనప్పుడే పెళ్ళికి ముందు నాతో కలిసి బయట ఊళ్ళు తిరగాలనిపిస్తుంది—"

"ఎంత మాటన్నావు?" అన్నాడు శ్యామలరావు.

"అయ్యో! నేను నిన్ను తప్పు పట్టడం లేదు. నీ వ్యక్తిత్వంపట్ల బలంగా ఆకర్షించబడినదానను నేను. నిన్ను ప్రేమిస్తూ, ఆరాధిస్తున్నదానను నేను. అలాంటి నేను నీతో ఏకాంతంగా ఉండడం సంభవిస్తే నన్ను నేను నిగ్రహించుకోలేను. నువ్వు తప్పుచేయకూడదనుకున్నా నా ప్రోత్సాహమే నిన్ను తొందరపడేలా చేయవచ్చు. అందుకనే పెళ్ళికాకుండా నీతో ఏకాంతంగా ఉండదల్చుకోలేదు—" అంది ఊర్మిళ.

ఏమాత్రం తెలివున్న మగాడైనా ఊర్మిళ అన్న మాటల్లోని వెటకారాన్ని అర్థం చేసుకోగలడు. శ్యామలరావు తెలివిలేనివాడు కాడు. కానీ అహంకారం తెలివిని మింగేస్తుందని దానికొక ఉదాహరణగా ఉన్నాడతనిప్పుడు. అందుకే ఊర్మిళ మాటలకు గర్వపడ్డాడతను. ఆ కారణంగానే అతడి మనసులో ఊర్మిళ అంటే కొంత యిష్టం కూడా ఏర్పడివుంది. ఎందుకంటే....

ఒక పర్యాయం శ్యామలరావు వయసురేపే కోర్కెలను చంపుకోలేక ఒక స్నేహితుడి సలహామీద ఓ వేశ్య యింటికి వెళ్ళాడు. ఆ వేశ్య అతణ్ణి చూసి— "నాకు నువ్వు బొత్తిగా నచ్చలేదు. అన్యథా భావించకు. నువ్విక్కణ్ణించి వెళ్ళిపోతానంటే నేను నీకు పది రూపాయలు ఇచ్చుకుంటాను—" అంది.

ఈ అవమానం శ్యామలరావు ఎవరికీ చెప్పుకోలేదు. ఆ తర్వాత అతను మళ్ళీ వేశ్య దగ్గరకు వెళ్ళాలని ప్రయత్నించలేదు. అయితే ఏకాంతంలో తనంటే ఇష్టపడే ఆడదానితో సుఖించాలన్న కోర్కె ఆనాటి నుంచీ పెరిగి పెద్దదవుతోంది. పెళ్ళి ఓ పట్టాన కుదిరేలా కనబడ్డంలేదు. ఉన్నదల్లా ఊర్మిళ. ఆమెను ఒక్క సారైనా అనుభవించగలిగితే బాగుంటుందని ఉంది. కానీ ఊర్మిళ కూడా పెళ్ళి అంటోంది.

"మన పెళ్ళెప్పుడో?" అని నిట్టూర్చాడతను.

"నువ్వు తల్చుకుంటే ఈ రోజే పెళ్ళి. రేపే మహా బలిపురం—"

"నేను తల్చుకుని లాభంలేదు—"

"ఎందుకని?"

"మా నాన్నకు మన పెళ్ళి ఇష్టంకాదు. వర్ణాంతర వివాహాలనాయన ఒప్పుకోడు—"

"అయితే ఎలా? మన పెళ్ళి జరుగదా?"

"ఎందుకు జరుగదు? నేను నిన్ను తప్ప ఇంకెవ్వరినీ పెళ్ళిచేసుకోను గదా!"

"అయితే ఆ విషయమాయనకు చెప్పొచ్చుగదా!"

"ఆయనకు గుండెజబ్బుంది. సమయం కోసం వేచి చూస్తున్నాను—"

"పోనీ మీ అమ్మకు చెప్పి — నెమ్మదిగా ఆవిడ చేత మీ నాన్నకు చెప్పించొచ్చుకదా!" అంది ఊర్మిళ.

"ఇలాంటి పెళ్ళిళ్ళకు మా అమ్మ మొదలే ఒప్పుకోదు. ఈ ప్రపంచంలో మా నాన్న తప్ప ఇంకెవ్వరూ ఆవిడ నొప్పించలేరు—" అన్నాడు శ్యామలరావు.

"సరే—అంతకాలం మహాబలిపురం వాయిదావేయి-" అంటూ ఊర్మిళ లేచింది. శ్యామలరావు దగ్గర సెలవు తీసుకుని ఆమె బజార్లోకి నడిచింది. బజార్లో ఆమెకు స్నేహితురాలు ఎదురయింది.

"ఎక్కణ్నించి, పార్క్నుంచేనా?" అందామె.

"అవును—"

"పెళ్ళిచేసుకుంటానన్నాడా?"

"ఇంకా లేదు—"

"ఊర్మిళా—నిన్ను చూస్తే జాలేస్తోందే! ఆ కోతి వెధవ చుట్టూ యెందుకు తిరుగుతావే? నీ అందానికి దాసోహమనే అందమైన కుర్రాళ్ళు బోలెడు మంది వుంటారు."

ఊర్మిళ అదోలా నవ్వి—"నా అందానికి దాసోహమనే వాళ్ళు నా కక్కర్లేదు. నన్ను పెళ్ళి చేసుకునే వాళ్ళు కావాలి. నేను శ్యామలరావు మీద ప్రేమ, ఆరాధన నటిస్తున్నాను. అతడు తప్పక నా దారికి వస్తాడు. ఇలాంటి ప్రేమ, ఆరాధన ముఖ్యంగా అతడికి ఏ ఆడదానినుంచీ లభించవు. ఇంట్లో చెప్పలేక తటపటాయిస్తున్నాడు. ఏదో ఓ రోజున అతడికా ధైర్యం కూడా వస్తుంది—" అంది.

"అతనొప్పుకుంటే పెళ్ళి చేసుకుంటావా?"

"మహారాజులా!" అంది ఊర్మిళ.

"పెళ్ళికోసం ఇంతలా వ్యక్తిత్వాన్ని చంపుకున్న నిన్ను చూస్తూంటే నాకు జాలివేస్తోంది—" అంది స్నేహితురాలు.

"ఎందరో పెళ్ళి చేసుకుని వ్యక్తిత్వాల్ని చంపుకుంటున్నారు. నేను పెళ్ళికి ముందే చంపుకుంటున్నాను. కాస్త వెనకా ముందూ తేడా — అంతేగా!" అంది ఊర్మిళ.

"ఒకవేళ అతను నిన్ను మోసంచేస్తే!"

"అలాంటి అవకాశం అతడికివ్వను—"

"అలాంటి మోసంకాదు. నిన్ను పెళ్ళిచేసుకోకుండా వేరే ఎవరినైనా పెళ్ళి చేసుకుంటే?" అంది స్నేహితురాలు.

"అతడు నన్ను పెళ్ళిచేసుకుంటాడన్న నమ్మకం నాకు వుంది. అలా జరుగని పక్షంలో అతణ్ని చంపేస్తాను..." అంది ఊర్మిళ.

"అవేం మాటలే — చ ం ప డ ం అంత తేలికనుకున్నావా?"

ఊర్మిళ నిట్టూర్చి — "అన్నివిధాలా అతడికంటె అధికురాలినై ఉండీ—ఆడ పుట్టుక పుట్టిన కారణంగా అతడి వెంట తిరుగుతూన్నాను. అది నా దురదృష్టం. అతడి అదృష్టం. ఆ అదృష్టాన్నతడు గుర్తించకపోతే నేను తట్టుకోలేను. పెళ్ళికోసం ఇంతకంటె హీనమైన పని నేను చేయలేను. ఆ అసహాయ స్థితి నాకు కల్పించే ఆవేశంలో నేనొక హంతకురాలిగా మారడం పెద్ద ఆశ్చర్యంకాదు—" అంది.

అయితే ఆమె హంతకురాలిగా మారే పరిస్థితులు

శ్యామలరావింట్లో ఏర్పడుతున్నట్టే లెక్క!

అతను పార్కునుంచి ఇంటికి వెళ్ళగానే తండ్రి చెప్పాడు-"రేపు మనం పెళ్ళిచూపులకు వెడుతున్నాం-" అని.

శ్యామలరావు తండ్రినేమీ అడగలేదు. విశేషాలనతను తల్లినడిగి తెలుసుకున్నాడు.

పిల్ల పేరు నిర్మల. చిదిమి దీపం పెట్టుకునేలా ఉంటుందిట. పాతికవేల రూపాయలు కట్నం. వాళ్ళు బాగా ఉన్నవారు. అందువల్ల ఈ సంబంధం అన్ని విధాలా అతడి తండ్రికి నచ్చింది. పిల్ల నచ్చితే వెంటనే తాంబూలాలు పుచ్చుకోవాలని కూడా ఆయననుకుంటున్నాడు.

పిల్ల అందంగా ఉంటుందనగానే శ్యామలరావులో కొత్త ఉత్సాహం కలిగింది. ఆసక్తి పెరిగింది—"వాళ్ళకు నేను నచ్చానా?" అనడిగాడు.

"అసలు నిన్ను చూసేకదా — వాళ్ళీ సంబంధానికి వచ్చారు—" అంది తల్లి.

* * *

మర్నాడు అతను ఆఫీసుకు సెలవు పెట్టాడు. బస్సులో ఉదయమే బయల్దేరి రెండు గంటల్లో పెళ్ళివారి ఊరు చేరుకున్నారు. అప్పుడు చూశాడు శ్యామలరావు పెళ్ళికూతుర్ని.

పెళ్ళికూతురు నల్లగా ఉంది. నలుపంటే బొగ్గులాంటి నలుపు. ఆమె నల్లటి ముఖంలో కూడా పళ్ళు తెల్లగా మెరవడంలేదు. పసుపు రంగులో ఉన్న ఆ పళ్ళ రంగు విషయంలో అతడికేమీ సందేహముండకూడదనేమో ఓ రెండు పళ్ళు కాస్త స్పష్టంగానే కనబడుతున్నాయి.

ఆమె ఎంతో ప్రయత్నించినా ఆ పళ్ళు అతడికప్పుడప్పుడు దర్శనమిస్తూనే వున్నాయి.

"నిన్న చూశాకనే కదా — వాళ్ళీ సంబంధానికొచ్చారు—" అన్న తల్లి మాటలు అతడికి గుర్తురాలేక పోలేదు. కానీ గుర్తురానట్లు మనసును సరిపెట్టుకున్నాడు.

శ్యామలరావు తండ్రి చాలా ఉత్సాహంగా ఉన్నాడు. ఆయనా, పెళ్ళికూతురు తండ్రి ఏమేమో మాట్లాడుకుంటున్నారు. శ్యామలరావు తండ్రిని, తల్లిని చాటుకు పిలిచాడు. అయిదు నిమిషాలు వాళ్ళు మాట్లాడుకున్నారు.

"పిల్లనిదివరకు చూశారా మీరు?" అనడిగాడు శ్యామలరావు.

"ఇదే మొదటిసారి చూడ్డం—" అంది తల్లి.

"ఎలా ఉంది మీకు?"

"లక్షణంగా లక్ష్మీదేవిలా ఉంది—" అంది తల్లి.

లక్ష్మీదేవిలా ఉండే పిల్లల్నింక చూడకూడదని శ్యామలరావు మనసులో అనుకుని తండ్రివంక తిరిగాడు. ఆయన అతడి ఉద్దేశ్యం గ్రహించినట్లు—"ఈ సంబంధం నాకు నచ్చింది. వియ్యంకుడు చాలా మంచివాడు—" అన్నాడు.

"కానీ నాకు పిల్ల నచ్చలేదు—" అన్నాడు శ్యామలరావు.

తల్లి, తండ్రి కూడా ఆశ్చర్యంగా — "ఎందుకని?" అన్నారు.

కారణం వాళ్ళకు అర్థంకానందుకు ఆశ్చర్యపడినా— ఆ పిల్లను తనకు అంటగట్టే ప్రమాదమున్నదని శ్యామలరావు తలిదండ్రులకు ఆ పిల్లలోని అవకరాలన్నీ చెప్పాడు.

అంతా విని తండ్రి కొడుకును మందలించి—"అందా

న్నవ్వరూ కొరుక్కుతినరు. ఆ పిల్ల నీకంటే వెయ్యిరెట్లు అందంగా ఉంది—" అన్నాడు. ఆయన కంఠంలో దృఢ నిశ్చయం కనబడింది.

శ్యామలరావు భయపడ్డాడు. అందుకని అతను చటుక్కున వియ్యంకుడి వద్దకువెళ్ళి — "మా అమ్మకూ, నాన్నకూ ఈ సంబంధం నచ్చింది కానీ నాకు మీ అమ్మాయి నచ్చలేదు—" అని చెప్పేశాడు.

ఈ సంఘటనకు అంతా తెల్లబోయారు.

అప్పుడక్కడ ఉన్న యువకుడొకడు శ్యామలరావు భుజంమీద చెయ్యివేశాడు—"మిస్టర్! ఒకసారి నాతో పక్కకు వస్తావా?"

అడగడమైతే అడిగాడు కానీ అతనించుమించు శ్యామలరావుని ఓ గదిలోకి లాక్కుపోయాడు. అప్పుడు తలుపులువేసి—"నా పేరు ప్రతాప్!" అన్నాడు.

"ఎవరున్నువ్వు!" అన్నాడు శ్యామలరావు.

"కంగారుపడకు — నేను చెప్పేది పూర్తిగా విను. ముందు నీ ఎదురుగా ఉన్న అద్దంలో నీ ప్రతిబింబం ఒక్కసారి చూసుకో—" అన్నాడు ప్రతాప్.

అప్రయత్నంగానే శ్యామలరావు అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకున్నాడు. పక్కనే ప్రతాప్ ఉన్నాడేమో శ్యామలరావు రూపం మరీ వికారంగా ఉంది.

"ఏమిటి నువ్వనేది?"

"నా పక్కన నువ్వెలాగుంటావో చూశావుగా— నీకంటే నేను వెయ్యిరెట్లు అందగాడినిని ఎవరైనా చెబుతారు. నేను నిర్మలను ప్రేమించాను. ఆమె తండ్రిని అడిగాను. వరస కలవదని ఆయన ఒప్పుకోలేదు. ఏదో

దూరపు వరుసలో మాకు అన్నా చెల్లెళ్ళ బంధుత్వం ఉన్నది. వరుస చాలా చాలా దూరం అయినప్పటికీ పాటించక తప్పలేదు. నిర్మలకు పెళ్ళిచూపులంటే వరు డెలాగుంటాడోనని చూడాలని వచ్చాను. నీకు అంద మొక్కటే కాదు. సంస్కారం కూడా లేదు—" అని ఒక్క క్షణం ఆగాడు ప్రతాప్.

"నేను చాలా మొండివాణ్ని. తల్చుకుంటే ఏమైనా చేయగలను. కానీ కొన్ని నియమాలకు లొంగివుంటాను. అందువల్ల నిన్నేమీ చేయకుండా వదిలిపెట్టాను. అయితే నీ కుసంస్కారాన్ని నేను క్షమించలేను. నీ ప్రవర్తనకు క్షమార్పణ చెప్పుకుని వెళ్ళకపోతే నిన్ను రోజురోజుకూ క్రూరంగా హింసించి చంపుతాను—" అంటూ ప్రతాప్ జేబులోంచి చిన్న కత్తితీసి—"ఆలోచించుకో—అయిదు నిమిషాలు వ్యవధి. నేను పోలీసుల కూడా భయ పడను. యెవరూ నన్నేమీ చెయ్యలేరు. నా మనసు ఎంతో సున్నితమైంది. అయితే సున్నిత మనస్కులను కష్టపెట్టే వారిపట్ల అది కఠిన పాషాణంగా కూడా మారుతుంది—" అన్నాడు.

శ్యామలరావు అతడి చేతిలోని కత్తివంకా, క్రూరంగా మెరిసే అతడి కళ్ళవంకా భయంగా చూశాడు. ఏదో అనాలని అనుకుని ఆగిపోయాడు. ప్రతాప్ కళ్ళు అత నడక్కుండానే ఎన్నో ప్రశ్నలకు జవాబు చెబు తున్నాయి.

"నేను కావాలని అలా ప్రవర్తించలేదు. నా తలి దండ్రులు డబ్బుకాశపడి ఈ సంబంధం నామీద రుద్దా లనుకుంటూంటే నేను ఆవేశంతో అలా మాట్లాడేను. సంస్కారం గురించి మర్చిపోయాను—" అన్నాడతను.

తర్వాత అతను ప్రతాప్ తో కలిసి గదిలోంచి బయటకు వచ్చేడు. నిర్మల తండ్రిని సమీపించి—"నా తొందరపాటును మన్నించండి. నా మాటలకు మీ మనసు నొప్పించివుంటే అది ఉద్దేశపూర్వకంగా కాదనీ, నాకు నచ్చకపోయినంతమాత్రాన మీ అమ్మాయి కురూపి అని నేను అభిప్రాయపడ్డాననీ అనుకోకండి—" అన్నాడు.

అప్పుడు నిర్మల అక్కడే ఉంది. ఆమె చటుక్కున శ్యామలరావు వంక చూసి — "చూడగానే నచ్చే అమ్మాయి కావాలంటే మీరు జాహ్నవిని చూడవల సింది—" అంది.

"జాహ్నవి ఎవరు?" — ఈ ప్రశ్న శ్యామలరావు మనసులోనే ఉండిపోయింది. అతను పైకి ఏమీ అనలేదు.

నిర్మల తండ్రి మాత్రం తేలిగ్గా—"కుర్రాళ్ళకేం తెలుస్తుంది? అతను ముందు పిల్ల నచ్చలేదన్నాడు. తర్వాత అందుకు సారీ చెప్పాడు. అందుకే అన్నీ పెద్ద వాళ్ళకు వదిలిపెడితే అంతా మేమే చూసుకుంటాం—" అన్నాడు. ఆయన ఈ సంబంధాన్ని అప్పుడే పూర్తిగా వదలదల్చుకోలేదు.

* * *

"చాలా థాంక్స్ ప్రతాప్!" అంది నిర్మల.

గార్డెన్లో వేరే ఇంకెవ్వరూ లేరు అక్కడ.

ఎందుకూ అని ప్రతాప్ అడగలేదు. శ్యామలరావు మాటలు అందరికంటే నిర్మలనే ఎక్కువగా కష్టపెట్టాయి. అతడిచేత క్షమార్పణ చెప్పించడం నిర్మలకు ఆనందం కలిగించడంలో ఆశ్చర్యంలేదు. కానీ ఆ క్షణంలో తనకంత ఆవేశమెందుకు కలిగింది?

"నిజానికి నాకు వాడు నచ్చలేదు. వాడికి నేను

నచ్చేస్తానేమోనని భయపడ్డాను. నా అదృష్టం బాగుంది. అయితే నేను నచ్చలేదని ముఖంమీదే చెప్పడంమాత్రం చాలా బాధ కలిగించింది—" అంది నిర్మల—"నేను అందవికారినే కావచ్చు. అంతమాత్రాన ఆ మాట పదే పదే నాముందు చెప్పి నా మనసుకు కష్టం కలిగించడం అన్యాయం కదూ?"

ప్రతాప్ ఆమెవంక కోపంగా చూసి—"నువ్వు అందవికారివని ఎవరన్నారో చెప్పు—వాళ్ళని...." అని ఆగిపోయాడు.

నిర్మల నవ్వుతూ—"ఆఖరికి నా తలితండ్రులామాట అన్నా పట్టించుకోను. కానీ అద్దంలో నా ప్రతిబింబం చెప్పేమాట కాదనలేనుగదా—" అంది.

"అద్దంలో నువ్వు చూసేది నీ ప్రతిబింబాన్ని. కానీ నేను నీ అసలు రూపాన్ని చూస్తున్నాను. నామాట మీద నీకు నమ్మకమేనా?"

"ఎందుకు కాదు?"

"అలాగైతే నా ముందు నీ అందాన్ని చిన్నబుచ్చుకోకు. నాకు చెప్పలేనంత కోపం వస్తుంది—"

"కోపమా?" అని నవ్వి—"నీ కళ్ళకు నేనెంత అందంగా కనిపిస్తానేమిటి?" అంది నిర్మల.

"చెప్పనా?" అని ఓసారి చుట్టూచూశాడు ప్రతాప్. ఎవ్వరూ లేరు. అతడు చటుక్కున ఆమె ముఖాన్ని రెండు చేతులలోకి తీసుకుని బలంగా ముద్దు పెట్టుకున్నాడు.

నిర్మలకు క్షణం ఊపిరాడలేదు. అయితే కాలం స్తంభించిపోతే బాగుండునని మాత్రం ఆమెకు అనిపించింది. ఆమె రెండు చేతులూ అతడి నడుం చుట్టూ

బిగుసుకున్నాయి. కౌగిలి బిగికోసం ఆమె అతడికి బాగా దగ్గరగా జరిగింది.

ఆ ముద్దులో వేడివుంది. తియ్యదనం వుంది. అన్నింటికీ మించిన కాంక్ష ఉంది.

వాళ్ళు విడిపోవడానికి కొంతసేపు పట్టింది.

"చాలా థాంక్స్ ప్రతాప్!" అంది నిర్మల.

"ఇలాంటి వ్యవహారాల్లో మగాడే ఆడదానికి థాంక్స్ చెప్పుకోవాలి——"

ఏదో అనబోయి ఆగిపోయింది నిర్మల. ప్రతాప్ తనే మళ్ళీ అన్నాడు. "ఇక్కడ ఎవ్వరూ లేరు కాబట్టి ఇబ్బందిలేకపోయింది. నలుగురిలో ఉండగా నా కంటికి నువ్వెలా కనిపిస్తున్నదీ అడక్కు. ఒక్క క్షణం నీ వంక పరిశీలనగా చూశానంటే నిన్ను ముద్దు పెట్టుకోవాలని పిస్తుంది——"

"ప్రతాప్——నీకులా నన్ను ప్రేమించే మగాడు నాకు దొరకడు. నన్ను నువ్వే ఎందుకు పెళ్ళిచేసుకోవు?" అంది నిర్మల.

"నీకు తెలియనిదేముంది? మీ బంధువుల్నీ మా బంధువుల్నీ అటూ ఇటూ లింకులు కలుపుకుంటూపోతే ఎవరో నిన్ను నాకు చెల్లెల్ని చేశారు——"

"కానీ——" అని క్షణంగా ఆగింది నిర్మల——"మన మధ్య అన్నా చెల్లెళ్ళ బంధం ఏనాడో తెగిపోయిందని నీకు తెలుసు——"

"వావి వరసలమీద నా కెన్నడూ నమ్మకంలేదు. ఆడ, మగ అన్నవి రెండే ఈ ప్రపంచంలోని వరుసలు. అయితే దగ్గర బంధువుల వివాహం మంచిదికాదని శరీర శాస్త్రం చెబుతోంది. ఆ శరీర శాస్త్రాన్ని సగం మాత్రమే

అనుసరిస్తున్నదీ అన్నా చెల్లెళ్ళ పద్ధతి. నిజానికి అన్నకు చెల్లెలంతో బావకు మరదలూ అంతే! ఇదెవ్వరూ చెప్పినా పట్టించుకోరు. అందుకే నేనెవరికీ చెప్పను—"

"నేను నా తలిదండ్రుల్నెదిరించి వచ్చేస్తాను. మన మిద్దరం ఎక్కడికైనా వెళ్ళిపోదాం—" అంది నిర్మల.

"జన్మనిచ్చిన తలిదండ్రుల మనసుకు కష్టం కలిగించే పని నేను చెయ్యలేను. మరొకర్ని చెయ్యమని ప్రోత్సహించలేను. అంతా అప్సరస అనే జాహ్నవి నన్ను ప్రేమించింది. మాకు జాతకాలు కలువలేదు. జాహ్నవి అవన్నీ పట్టించుకోరాదంటుంది. కానీ నేను పెద్దలకోసం ఆ సంబంధాన్ని వదిలేశాను—" అన్నాడు ప్రతాప్.

ఆ విషయం నిర్మలకు తెలుసు. టాపిక్ మార్చడం కోసం ఆమె — "ప్రతాప్—నువ్వు రాకపోతే ఆ అవమానంతో నేను కుమిలిపోయేదాన్ని—" అంది.

"నేను నిన్ను అవమానంనుంచి రక్షించడానికిరాలేదు. నా బెంగకొద్దీ వచ్చాను. నా ప్రియురాలు నాకు శాశ్వతంగా దూరమైపోతుందేమోనన్న బెంగతో వచ్చాను. అదృష్టం నన్ను రక్షించింది—" అన్నాడు ప్రతాప్.

"నిజం చెప్పొద్దూ — ఏకాంతంలో నువ్వు నన్నిలా తరచుగా కలుసుకుంటూంటే నాకు పెళ్ళి వద్దనిపిస్తూ వుంటుంది—" అంది నిర్మల. ఏకాంతంలో ప్రతాప్ ఆవేశమెలా ఉంటుందో గుర్తుచేసుకోనేందుకు నిర్మలకు ఇందాకటి ముద్దు చాలు. అతడి కోరికలో ఎంత బలం? ఎంత ఆవేశం? వివాహం చేసుకున్న భర్త కూడా తన నంత కాంక్షతో దగ్గరకు తీసుకుంటాడనిపించదు. ప్రతాప్ యెంత పొగిడినా నిర్మలకు తన అందం ఏపాటిదో తెలుసు.

"నాకూ అలాగే అనిపిస్తుంది. అయితే నేను మగవాణ్ని కావడంవల్ల అది నా స్వార్థం అనిపించు కుంటుందన్న భయం—"

"నీది స్వార్థమే అయితే నాకు నీ స్వార్థమే కావాలి—" అని ఆమె—"రేపు సాయంత్రం అయిదు నుంచి రాత్రి పదిదాకా ఇంట్లో యెవ్వరూ ఉండరు. నేను పెళ్ళికి వెళ్ళవలసినదాన్నే. కానీ నీకోసం ఉండిపో తున్నాను. దొడ్డి తలుపు తీసి ఉంచుతాను. అదే దారిని రావచ్చు—" అంది.

ప్రతాప్ కళ్ళు మెరిశాయి. అతనామెవంక ఉత్సాహంగా చూసి — "నేను నీకిచ్చిన భేతాళ విగ్రహం భద్రంగా ఉంచావా?" అన్నాడు.

"ఆఁ అది ఎవరికళ్ళా పడకుండా నా పెట్టెలో దాచాను—"

"నేను వచ్చేసరికల్లా అది బయటకు తీసి శుభ్రంగా తుడిచి గదిలో మూలగా వున్న బల్లమీద పెట్టి ఉంచు-" అన్నాడు ప్రతాప్.

"అయితే పూజ ఉందా?" నిర్మల కంఠంలో సన్నని వణుకు.

"అవును. ఒక నిమ్మకాయ...." అని ప్రతాప్ ఏదో చెప్పబోతూండగా ఆమె అతణ్ని వారించి—"అంతా నాకు తెలుసు. అన్నీ సిద్ధంగా ఉంచుతాను—" అంది.

ప్రతాప్ ఆమె వంక చూసి — "పూజ పేరు చెప్పి నిన్ను బాధిస్తున్నానుకదూ?" అన్నాడు.

"నేనా బాధ గురించి ఆలోచించను. పూజ అనంతరం జరిగేదే నా మనసును మధుర భావనలతో నింపేస్తుంది" అంటూ నిర్మల తన ముంజేతివంక చూసుకుంది. అక్కడ

సన్నగా పొడుగ్గా ఉన్న మచ్చను చూసుకొని-"ఈసారి మచ్చ ఎక్కడో?" అనుకుంది. ఆమె భావనలో నేల మీద నగ్నంగా పడుకుని ఉన్న తన శరీరంపై కదులుతున్న ప్రతాప్ చేతివ్రేళ్ళ అనుభూతి శరీరానికి అప్పుడే కలుగుతోంది. ఆ వ్రేళ్ళెక్కడ ఆగుతాయో?

ఆమె కళ్ళకు రెండు నిమ్మ చెక్కలు కూడా కనిపిస్తున్నాయి.

అయినప్పటికీ — "రేపు తప్పక వస్తావు కదూ?" అంటూ ఆమె ప్రతాప్ వంక అర్థింపుగా చూసింది.

• • •

ఆ రోజు హోటల్ స్వప్నాలో మధురిమ కాబరే నృత్యం. వార్త ఊరంతా పెద్ద విశేషంలా పాకిపోయింది.

హోటల్ ముందు జనం తీర్థ ప్రజలా ఉన్నారు. అడ్వాన్సుగా టికెట్సు సంపాదించడానికి వచ్చినవారికంటె అక్కడ ఏదో సమయంలో ఆమె దర్శనం కాకపోతుందా అని వచ్చినవారే ఎక్కువ.

మధురిమ యెక్కడికి వెళ్ళినా ఇంత హడావుడీ జరుగుతుంది. అందుకని ఆమె ఏ ఆర్భాటమూ లేకుండా మగ దుస్తుల్లో, మారువేషంలో ఎప్పుడో హోటల్లో ప్రవేశించింది. ఆ విషయమెంతో రహస్యంగా ఉంచబడింది. ఆ విషయం తెలియని అమాయక యువకులు చాలామంది అక్కడ ఆమె కోసం ఎదురుచూస్తూనే ఉన్నారు.

మధుసూదనరావుకు స్వప్నా హోటల్ యాజమాన్యంతో పరిచయముంది. ఆయనకీవార్త చేరింది. ఆయన డేంజర్‌కు కబురు అందజేశాడు. డేంజర్ శ్రీకాంత్‌తో కలిసి మంత్రాంగం చేశాడు. రాత్రి ఆమె నాట్యం

ప్రారంభమయ్యేలోగా—ఆమెను మధుసూదనరావు గదికి తరలించాలి.

శ్రీకాంత్ ముందు తానొక్కడూ హోటలు దాపులకు వెళ్ళాడు. తీర ప్రజలా ఉన్న జనాన్ని చూసి ఆశ్చర్య పోయాడు. తర్వాత స్నేహితుణ్ని కలుసుకునే మిషతో లోపలకు వెళ్ళాడు.

మధురిమ ఉంటున్నది రూం నంబరు ముప్పైఏడు. శ్రీకాంత్ సరిగ్గా అక్కడే ఆగాడు. ముఖ్యులైన వారెవరూ లేనట్లు ఆ గదిముందు ఏ విధమైన కోలా హలమూ లేదు. అతను ఒక్క క్షణం మాత్రం తటపటా యించి గది తలుపు తట్టాడు.

తలుపు తెరుచుకుందుకు ఎంతోసేపు పట్టలేదు. తలుపు తీసినది భీమసేనుడు. అతడి మహాకాయాన్ని చూస్తూ శ్రీకాంత్ భయపడ్డాడు.

"ఒక ముఖ్యమైన సమాచారం తీసుకువచ్చాను. మధురిమగారున్నారా?" వినయంగా అడిగాడు శ్రీకాంత్.

భీమసేనుడు ఆశ్చర్యంగా—"ఎవర్నువ్వు?" అన్నాడు.

"నన్ను ప్రొప్రయిటరుగారు పంపారు. లోనికి రానిస్తారా?"

భీమసేనుడు బక్కలా ఉన్న శ్రీకాంత్‌ని చూసి ఏమాత్రమూ సందేహించలేదు. తలుపులు తీసి లోనికి రానిచ్చాడు.

లోపల ఆఫ్రికన్సుకు మించి నల్లగా ఉన్న భారతీయ వనితను చూసి శ్రీకాంత్ ఆశ్చర్యపడ్డాడు — "ఇది మధురిమగారి అసలు రూపమా, లేక మారువేషమా?" అన్నాడతను.

"రెండూ కాదు. దిష్టి చుక్క—" అన్నాడు భీమ

సేనుడు — "మధురిమ స్నానం చేస్తున్నది. కొద్దిసేపు అలా కూర్చో!"

శ్రీకాంత్ ఆశ్చర్యంగా ఆమెను చూస్తూ వెళ్ళి సోఫాలో కూలబడ్డాడు. అందమైన ఆడవాళ్ళు ముఖాలకు నల్లటి చుక్క పెట్టుకుంటారు. మధురిమ ఏకంగా మనిషి నే పక్కన ఉంచుకుంది. తన అందానికి దిష్టి తగులుతుందని ఆమెకు భయమా? నిజానికి ఈ నల్లని యువతి పక్కన ఉండడం వల్ల నే మధురిమ అందం ద్విగుణీకృతంగా కన బడి మరింత దిష్టి తగులవచ్చు.

భీమసేనుడు కానీ, ఆ యువతి కానీ శ్రీకాంత్ తో మాట్లాడలేదు. వాళ్ళు బొమ్మల్లా తమతమ స్థానాల్లో కూర్చున్నారు. కొద్దిసేపటికి బాత్రూం తలుపులు తెరుచుకుని మధురిమ వచ్చింది.

ఆమెను చూస్తూనే శ్రీకాంత్ కు మతిపోయిందని పించింది.

ఎంత అందం? ఏ కవి కలానికీ, ఏ గాయకుడి గళానికీ అందని అపురూప సౌందర్యం ఇంత దగ్గరనుంచి చూడ గలగడం తన అదృష్టం.

అందమైన ఆడవాళ్ళు చాలామంది ఉంటారు. కానీ మధురిమ అందం వేరు. ఆ అందం శిల్పంగా మలచబడడం కోసం సృష్టించబడిందా అన్నట్లుంది ఆమె శరీర సౌష్టవం. తన వంపుసొంపులు, మేనిఛాయ ప్రదర్శించ బడడం కోసమే అన్నట్లు ఆమె వస్త్రధారణ చేసింది. ఏ పురుషుడూ ఆమెను చూసి ఊరుకోలేడు.

"అందుకే ఈమె క్యాబరే నర్తకి అయింది—" అను కున్నాడు శ్రీకాంత్.

మధురిమ శ్రీకాంత్ ని సమీపించి—"ఎవరున్నవ్వు?"

అంది.

"కొన్ని క్షణాలాగితే కానీ మాట్లాడలేను—" అన్నాడు శ్రీకాంత్. అయితే కొన్ని క్షణాలు ఆగినా కూడా అతను మాట్లాడలేకపోయాడు. అప్పుడు మధురిమ అక్కణ్ణించి వెళ్ళి ఒక లాంగ్ కోటు తొడుక్కుని వచ్చింది.

శ్రీకాంత్ కు వచ్చిన పని గుర్తొచ్చింది — "నన్ను ప్రొప్రయిటరుగారు పంపించారు. మీరు హోటల్లో ఉండటం అంత శ్రేయస్కరంకాదని కబురు చెప్పమన్నారు—" అన్నాడతను.

"ఎందుకని?"

"మీకోసం ఎంత డబ్బయినా ఇస్తామని చాలామంది పెద్దలంటున్నారు. ఎలాగో అలా ఏర్పాటు చెయ్యమని ఆయనపై ఒత్తిడి తీసుకొని వస్తున్నారు. ఆయనకు మీ సంగతి తెలుసు. మీ మనసు కష్టపెట్టడం ఇష్టంలేదు. కానీ పరిస్థితిని తను అదుపులోకి తీసుకురాలేనేమోనని భయపడుతున్నారు. కాసేపట్లో మీ గదికి చాలామంది రావచ్చు. ఈలోగా మీరు నగర సంచారానికి బయల్దేరడం మంచిదని ఆయనన్నారు-" అన్నాడు శ్రీకాంత్.

అతనీమాట చెప్పటంలో రెండు రకాల ప్రయోజనాలున్నాయి. కాబరే నృత్యాలుచేసే మధురిమ అంత శీలవతా? అన్న సందేహం ఒకటి ఉండనే వున్నది. డబ్బుకు లొంగేదీ లేనిదీ సూటిగాకాక పరోక్షంగా అడిగినట్లవుతుంది.

ఆమె డబ్బుకు లొంగుతుందని తెలిస్తే ఏ బాధాలేదు. అలాకాక నిక్కచ్చి మనిషి అయిన పక్షంలో నగర సంచారానికి బయల్దేరుతుంది. ఒకసారి నగరంలో అడుగు

పెట్టిందంటే దేంజరా మెను అపహరించగలడు!

మధురిమ తమాషాగా తనకు మాత్రమే సాధ్యపడు తుందనిపించే ఓ నవ్వు నవ్వింది. తర్వాత నెమ్మదిగా—

"మొదట్లో నా బుద్ధి వికసించక నాకంటూ కొన్ని నియమాలేర్పరచుకున్నాను. అందులో మగవాళ్ళకు దూరంగా ఉండడమొకటి. ఇప్పుడు నా బుద్ధి వికసించడమే కాదు. శరీరం కూడా మగవాడిని కోరుతోంది. అయితే పెళ్ళి చేసుకొని ఒక మగవాడికి కట్టుబడాలని మాత్రం నేననుకోవడంలేదు. నా అందచందాలను ప్రదర్శించే నృత్యం చేస్తూ ఎందరో మగవాళ్ళను రెచ్చగొడుతున్నాను. వారిలో కొందరికైనా తృప్తిపరచవలసిన బాధ్యత నాకున్నది. అయితే ఈ ప్రపంచంలో నేనొక్కతెనే ఆడదాన్ని కాదు. నాచేత రెచ్చగొట్టబడిన మగవాడు మరెచ్చటికైనా వెళ్ళి సుఖం పొందవచ్చును. అందుకని...." అని ఆగిందామె.

శ్రీకాంత్ కుతూహలంగా — "ఏమని నిర్ణయించుకున్నారు?" అన్నాడు.

"నన్ను గాఢంగా కాంక్షించే పురుషుడి విషయంలో మాత్రమే నేను లొంగదలిచాను.—" అందామె.

"మిమ్మల్ని ఏ పురుషుడైనా గాఢంగా కాంక్షించగలడు. ఒక పురుషుడిగా నేనీ విషయం చెబుతున్నాను" అన్నాడు శ్రీకాంత్.

మళ్ళీ నవ్వింది మధురిమ.

"గాఢమైన కాంక్ష అనేది పరీక్షించకుండా తెలుసుకోవడం కష్టం. తన ప్రాణంలో ప్రాణం అనుకునే కన్నబిడ్డకోసం తన సర్వస్వమూ అర్పించగలదు స్త్రీ. ఆఖరికి మానం కూడా అర్పించగలదు. కానీ ప్రాణం అర్పించ

కలదా? హఠాత్తుగా ఏ బందిపోటు దొంగలో, ఏ క్రూరమృగాలో గ్రామాలపై దాడిచేస్తే తల్లీ బిడ్డలు, అన్నాతమ్ముళ్ళు—ఇలా ఎందరో ఎవరి ప్రాణాన్ని వారు సంరక్షించుకోవడం కోసం చెట్టుకొకరు, పుట్టకొకరు చెదిరి విడిపోవడమన్నది ఎన్నోసార్లు ఎన్నోచోట్ల జరిగింది. అలాంటప్పుడు గాఢమైన కాంక్ష అన్న పదానికి అర్థమే లేదు. కొందరు కాంక్షను డబ్బుతో కొలుస్తారు. ఒక ఆడదానికోసం లక్షలకు లక్షలు తగలేసి అదే కాంక్ష అనుకుంటారు. డబ్బుంది కాబట్టి ఖర్చుచేస్తే అది కాంక్ష అనిపించుకోదు—"

మధురిమ చెప్పుకుని పోతూంటే శ్రీకాంత్ మధ్యలో ఆపి-"గాఢమైన కాంక్షను మీరెలా గుర్తించగల్గుతారు?" అన్నాడు.

"నాకోసం యేమైనా చేయగలగాలి!" అంది మధురిమ.

"యేమైనా అంటే — ప్రాణాలు తీసుకోవాలా?" అన్నాడు శ్రీకాంత్.

"అప్పుడది చాలా తెలివితక్కువ పరత్న అవుతుంది. నన్ను పొందడంకోసం యేమైనా చేయాలనుకుంటాడు కానీ ప్రాణాలు తీసుకోవడానికి ఎవడూ ఒప్పుకోడు. అందువల్ల అసలుకే మోసంగదా!" అంది మధురిమ.

"మరైతే యేం చేయాలి?"

"మంగళ నా చిన్ననాటి స్నేహితురాలు. నాక్రీగంటి చూపుకోసం ఎందరో పురుషులు ఎదురుచూస్తూంటే— ఒక్క పురుషుడైనా తనను లాలించి దగ్గరకు తీసుకోవక పోతాడా అని ఎదురుచూస్తోంది. నా స్నేహితురాలిని

అంది మధురిమ.

"ఎవరా మంగళ?" అన్నాడు శ్రీకాంత్.

"మంగళా?" అంది మధురిమ.

భీమసేనుడిచేత దిష్టిచుక్కగా అభివర్ణించబడిన యువతి వారిద్దరినీ సమీపించింది. శ్రీకాంత్ షాక్ తిన్నాడు.

"ఈ షరతు చాలా దారుణం—" అన్నాడతను. యే పురుషుడికైనా మంగళ సమక్షమే అవాంఛనీయం.

"దారుణమైనా కాకపోయినా, కష్టమైనదేనని పిస్తుంది. ఇంతవరకూ ఈ షరతును ఎవ్వరూ అనుసరించలేకపోయారు—" అంది మధురిమ.

"అసలు ప్రయత్నించను కూడా ప్రయత్నించరు—" అన్నాడు శ్రీకాంత్. అతనొక్కమారు మంగళను పరీక్షగా చూడాలనుకొని చూడలేక ఆ ప్రయత్నంనుంచి విరమించుకున్నాడు.

"ప్రయత్నించకేం — అలా ప్రయత్నించిన వారు మొత్తం ముగ్గురున్నారు. అయితే నాకోసం మొక్కుబడిగా మంగళ దగ్గరకు వెళ్ళిన బాపతు మనుషులువాళ్ళు. నామీద ఎంత కాంక్ష ఉన్నదో అంతటి కాంక్షనూ మంగళపై చూపగలిగినప్పుడే నా షరతు అనుసరించినట్లవుతుంది—" అంది మధురిమ.

"అది సరే — మీకు నగర సంచారానికి వెళ్ళటం మంచిది—"

"నాకలాంటి భయాలేలేవు. ఇక్కడ నన్ను నేను రక్షించుకోగలను. భీమసేనుడు నా పక్కనుండగా నన్నెవ్వరూ యేమీ చెయ్యలేరు—" అందామె.

శ్రీకాంత్ లేచి—"సరే-మీ యిష్టం—" అన్నాడు.

మధురిమ అతడివంక జాలిగా చూసి — "అసలు ఉద్దేశ్యం నేను గ్రహించాను. అందుకే నా షరతు చెప్పాను. కావాలంటే మంగళను నీ కూడా తీసుకుని వెళ్ళు. నన్ను కోరేవారికి నా షరతు గురించి చెప్పు. మంగళ ఎవరైనా సిఫారసుచేస్తే వారికి నన్ను నేను సంతోషంగా అర్పించుకుంటాను. ఇది తిరుగులేనిమాట. చనిపోయిన నా తల్లిమీద ఆనవేసి చెబుతున్నాను—" అంది.

"మీ మాట తిరుగులేనిదే కావచ్చు. షరతు కూడా తిరుగులేనిదే అయింది—" అన్నాడు శ్రీకాంత్.

"డబ్బున్నవాళ్ళు డబ్బుతో నన్ను కొనాలనుకుంటూంటే నేను మంగళను అడ్డువేసి కాసుకుంటున్నాను" అంది మధురిమ.

ఏమనుకున్నాడో శ్రీకాంత్—"మంగళను నాతో తీసుకుని వెడతాను—" అన్నాడు.

* * *

డేంజర్ కోపంగా శ్రీకాంత్ వంక చూసి—"ఇదన్న మాట నువ్వు సాధించుకొచ్చిన నిర్వాకం—" అన్నాడు.

మంగళ డేంజర్ వంకే చూస్తూ—"నాకు ఇతడికంటే నువ్వే బాగా నచ్చావు—" అంది నవ్వుతూ.

"తల్లీ — నాకు నువ్వూ వద్దు. నీ మధురిమా వద్దు. నేను కోరుకునేది నాకోసం కాదు — ఓ పెద్దమనిషి కోసం—" అన్నాడు డేంజర్.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీకోసం ఏమైనా చేస్తాను. ఏం కావాలో చెప్పు—" అంది మంగళ.

"నన్ను ప్రేమిస్తున్నావా? ఏమిటి నాలోని

విశేషం?" వెటకారంగా అడిగాడు డేంజర్.

"గుండు. బోడిగుండున్న వాళ్ళంటే నాకు చాలా యిష్టం. చిన్నప్పుడు మా మామ్మగారికి బోడిగుండుండేది. ఆవిడెంతో మంచిది. నన్నెంతో అభిమానంగా చూసు కునేది. ఆవిడపోయినప్పుడు నేనెంతగానో ఏడ్చాను. అప్పుడు మా నాన్న నన్ను చేరదీసి ఓదార్చాడు. అసలు మా నాన్న నన్నెప్పుడూ చేరదీసేవాడుకాదు. అంత కాలం ఆయనకు జుత్తుండేది. వాళ్ళమ్మ పోయిందని గుండు చేయించుకున్నాడు. గుండున్నాన్నాళ్ళూ నన్ను బాగా చూశాడు. జుత్తు రాగానే మళ్ళీ మామూలు మనిషైపోయాడు. అప్పుడే నేననుకున్నాను. పెద్దయ్యాక ప్రేమిస్తే గుండున్నవాళ్ళనే ప్రేమించాలని!"

ఆమె నిజం చెబుతోందో వెటకారం చేస్తోందో ఇద్దరికీ అర్థంకాలేదు. డేంజర్ మాత్రం నెమ్మదిగా—"అయితే నాకోసం నీ మధురిమను ఒక్కసారి నా దగ్గరకు తీసు కొస్తావా?" అన్నాడు.

"అది తప్ప ఇంకేమైనా అడుగు. ఎందుకంటే అందుకు వేరే షరతుంది కదా!" అంది మంగళ.

డేంజర్ అప్పటికప్పుడు మంగళకు ఫోటో ఒకటి తీశాడు. క్షణాలమీద ప్రింటు చేశాడు. శ్రీకాంత్‌ని అక్కడే ఉండమని తను మధుసూదనరావు ఇంటికి బయ ల్దేరాడు.

"నా కోసం మధురిమ కష్టపడుతోంది. ఎవరికోసమో మీ డేంజర్ కష్టపడుతున్నాడు. అందరూ స్వార్థ త్యాగులే!" అంది మంగళ.

డేంజర్ ఎంత దూరం వెళ్ళాడో చూద్దామనో ఏమో ఆమె వీధి గుమ్మంలో నిలబడింది. అదే మంచిదనుకున్నాడు

శ్రీకాంత్. ఆమె కాసేపు అక్కడే నిలబడితే తనకు కొద్దిసేపైనా ఆవిడ ముఖారవిందాన్ని చూసే బాధ తప్పుతుంది.

*　　*　　*

మంగళ వీధివైపే చూస్తూ అలా నిలబడింది.

రోడ్డుమీద నడుస్తున్న ఒకరిద్దరు యువకులు అప్రయత్నంగా ఆమె వంక చూసి హడిలిపోయి నడకను పరుగుగా మార్చుకుని వెళ్ళిపోయారు. మంగళ ఆ దృశ్యం చూసి ఏ మాత్రమూ బాధపడకుండా మనసారా నవ్వుకుంది.

సరిగ్గా అప్పుడే ఆమె ఆశ్చర్యపడే సంఘటన జరిగింది.

ఒక యువకుడు అదే దారిన పోతూ ఆమెను చూసి చటుక్కున ఆగిపోయి—"వాటే బ్యూటీ!" అన్నాడు.

మంగళ అతడివంక గుర్రుగా చూసి-"నాకు ఇంగ్లీషూ అర్థమవుతుంది, వెటకారమూ అర్థమవుతుంది—" అంది.

"నాకు ఇంగ్లీషు వచ్చు. కానీ వెటకారం తెలియదు" అన్నాడతను.

"పోనీ — ఇప్పుడు నువ్వేమన్నావో తెలుసునా?" అందామె.

"వాటే బ్యూటీ!" మళ్ళీ అన్నాడతను.

"అంటే అర్థం తెలుసునా?" అందామె.

"లోపలకు రావచ్చా?" అన్నాడతను.

"ఎందుకు?" అన్నదామె.

"నేనన్న మాటలకు అర్థం చెబుతాను—"

"అయితే నేనే బయటకు వస్తాను—" అందామె.

అతనేదో అనేలోగానే ఆమె రోడ్డుమీదకు వచ్చింది.

అప్పుడు రోడ్డు నిర్మానుష్యంగా వుంది. అతను చటుక్కున ఆమె చేయి పట్టుకుని దగ్గరగా లాక్కుని బుగ్గలమీద ముద్దుపెట్టుకొని ఆమెను వదిలిపెట్టి—"నిన్ను చూస్తే నిగ్రహించుకోవటం కష్టం — ఇది నడిరోడ్డయి పోయిందని జంకి ఇంతటితో వదిలాను. ఇంకెప్పుడూ నా మాటలకు అర్థాలడక్కు—" అన్నాడు.

మంగళ ఆశ్చర్యంగా అతడివంక చూసి — "నువ్వు మధురిమను గాఢంగా కాంక్షిస్తున్నావా?" అంది.

"మధురిమా? ఆమె ఎవరు?" అన్నాడతను.

అప్పటికి శ్రీకాంత్ గుమ్మంలోనికి వచ్చి ఆ యువకుణ్ని గుర్తుపట్టి—"అరే—ప్రతాప్—" అన్నాడు. వాళ్ళిద్దరికీ ముఖపరిచయం మాత్రం వుంది.

"అవును — ఇది డేంజర్ ఇల్లు కదూ!" అన్నాడు ప్రతాప్—"ఈ బ్యూటీ ఇక్కడికెలా వచ్చింది?"

"ఏదో డేంజర్ పనిమీద వచ్చింది. నువ్వు లోపలకు వస్తావా?" అన్నాడు శ్రీకాంత్.

"ష్యూర్—" అన్నాడు ప్రతాప్.

ప్రతాప్, మంగళ లోపలకు వెళ్ళారు.

"డేంజర్ ఇంట్లో లేడా?" అన్నాడు ప్రతాప్.

"కొద్ది సేపట్లో వచ్చేస్తాడు—" అన్నాడు శ్రీకాంత్.

ప్రతాప్ కుర్చీలో కూర్చుని జేబులోంచి పది రూపాయల నోటు తీసి — "కూల్ డ్రింక్ లేదా— ఐస్ క్రీమేనా తీసుకురమ్మా—" అన్నాడు.

శ్రీకాంత్ నోటు అందుకున్నాడు.

"పరాయి మగాడి దగ్గర నన్నొదిలేసి పోతావా—నాకు భయం—" అంది మంగళ కంగారు నటిస్తూ.

"అద్దంలో నిన్ను నువ్వు చూసుకోనంత సేపూ—నీకే

భయముండదు. నేను వస్తాను—" అంటూ శ్రీకాంత్ కదిలాడు.

శ్రీకాంత్ గది వదలగానే ప్రతాప్ అవకాశం కోసం ఎదురుచూస్తున్నవాడిలా ఆమెను సమీపించి బలంగా కౌగలించుకొని గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

మంగళ వుక్కిరిబిక్కిరై పోయింది. అతడి ఆవేశం ఆమెకు ఆశ్చర్యంగా వుంది. ఇలా జరుగుతుందని ఆమె వూహించినట్లు లేదు.

ప్రతాప్ ఆమెను వదిలిపెట్టి—"వాటే బ్యూటీ—అంటే ఏకాంతంలో నేను చెప్పే వివరణ ఇలా వుంటుంది—" అని—"నీతో కాసేపు మాట్లాడాలనే శ్రీకాంత్‌ను బయటకు పంపాను. నాకు నువ్వు కావాలి. ఎప్పుడు ఎలా దొరుకుతావో చెప్పు. నీతో నాకు చాలా పని వుంది—" అన్నాడు.

"నాతోనా? మధురిమతోనా?"

"మధురిమా? ఈ పేరు ఇందాకా రోడ్డుమీద కూడా అన్నావు. ఎవరా మధురిమ!"

"మధురిమ పేరు నీకు తెలీదంటే నేను నమ్మను—" అన్నదామె.

"నీ నమ్మకంతో నాకు నమ్మకంలేదు. ముందా మధురిమ ఎవరో చెప్పు—" అన్నాడు ప్రతాప్.

"ప్రముఖ కాబరే నర్తకి! ఈ రోజు హోటల్ స్వప్నాలో ఆమె ప్రదర్శన వుంది—" అంది మంగళ.

"అలాటిదేదో వున్నదని విన్నాను. కానీ నర్తకి పేరు నాకు గుర్తులేదు. అయినా అలాంటి నృత్యాలంటే నాకు ఆసక్తి లేదు—" అన్నాడు ప్రతాప్.

"అయితే ఈ రాత్రి నువ్వామె నృత్యం చూడ్డానికి

వెళ్ళటం లేదా?"

"లేదు—"

"కావాలంటే నీకు టికెట్ ఏర్పాటు చేయగలను—"

"వద్దు. నాకు నువ్వే కావాలి!"

తొలిసారిగా మంగళ కనులలోనికి సిగ్గువచ్చింది. ఆమె ప్రతాప్ వంక చూసింది. అతడి చూపులకు తట్టుకోలేక ఆమె చూపులు నేలవ్రాలాయి.

"నిజంగా నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?"

"అబద్ధపు ప్రేమలు నాకు తెలియవు. నాకు నిజంగా నువ్వు కావాలి!"

"అయితే నన్ను పెళ్ళి చేసుకుంటావా?" సూటిగా అడిగింది మంగళ.

"ఇప్పట్లో నా పెళ్ళి జరగదు—" అన్నాడు ప్రతాప్.

"ఎందుకని?"

"నాలో కొన్ని లోపాలున్నాయి—"

"ఏమిటా లోపాలు?" అని—"వైద్యం చేయించుకోలేకపోయావా?" అనడిగింది మంగళ.

"అవి వైద్యానికి లొంగే లోపాలు కాదు. క్షుద్ర శక్తులకు సంబంధించినవి—"

"క్షుద్ర శక్తులా?" ఆశ్చర్యంగా, భయంగా అడిగింది మంగళ.

"అవును—క్షుద్ర శక్తులే!"

మంగళ ఒక్క నిమిషం మాట్లాడలేదు. తర్వాత—"ఏమిటా లోపాలు? నాకు చెప్పు—" అంది.

"నామీద కొన్ని క్షుద్రశక్తులు ప్రయోగించబడ్డాయి. అవి నన్ను హఠాత్తుగా వశపరుచుకొని మళ్ళీ వదిలిపెడు

తూంటాయి. అవి నన్ను వశపర్చుకున్నప్పుడు నేను మామూలు మనిషిలా ప్రవర్తించలేను—"

"కొంపదీసి ప్రస్తుతం నువ్వు క్షుద్ర శక్తి వశంలో లేవుగదా!" భయంగా అంది మంగళ. అతడు తన్నంత గాఢంగా వాంఛిస్తున్నాడంటే అది క్షుద్ర శక్తి ప్రభావమేమోనని ఆమెకు అనుమానం వచ్చింది.

"క్షుద్రశక్తి వశంలో ఉంటే ఇలాగుండును. ఆ రూపానికి నువ్వు తట్టుకోలేవు. అందుకే నేను ప్రస్తుతం బేతాళపూజ చేస్తున్నాను. ఆ పూజ ఒక్కటే నన్ను క్షుద్ర శక్తుల బారినుండి రక్షించగలదు—" అన్నాడు ప్రతాప్.

"బేతాళ పూజా? అదెలా చేస్తారు?" అంది మంగళ కుతూహలంగా.

"బేతాళ విగ్రహం, ఒక చాకు, ఒక నిమ్మకాయ, ఇంత ఉప్పూ, కారం — అంతే! సరదాగా వుంటే ఆ పూజ నువ్వూ మొదలుపుగాని—" అన్నాడు ప్రతాప్.

మంగళకు అదంతా తమాషాగా వుంది. అతడు వేళాకోళమాడుతున్నాడేమోనని ఆమెకు అనుమానం కూడా వచ్చింది.

"అసలు బేతాళ పూజ గురించి నీకెవరు చెప్పారు?" అందామె.

"అఘోరీ బాబా!" అన్నాడు ప్రతాప్.

"అఘోరీబాబా నీకూ తెలుసా?" అంటూ గదిలో ప్రవేశించాడు శ్రీకాంత్. అతడి చేతిలో మూడు అయిస్‌క్రీం కప్పులున్నాయి.

ముగ్గురూ మూడూ అందుకొన్నాక—"నీకు అఘోరీ బాబా తెలుసా?" అన్నాడు ప్రతాప్.

"నాకు తెలియదు. కానీ డేంజర్ కు తెలుసు—"

"ఎలా తెలుసు?"

"అది మాత్రం నాకు తెలియదు—"

ముగ్గురూ అయిస్ క్రీం తిన్నారు.

మంగళ లేచి నిలబడి—"నేనూ, ఇతనూ హోటలుకు వెడతాం—" అంది.

"అప్పుడే వెళ్ళిపోతావా?" శ్రీకాంత్ కంగారుగా అన్నాడు.

"మీ డేంజర్ దగ్గర నా ఫోటో వుందిగా— నేను ఇక్కడుండి చేసేదేముంది?" అంది మంగళ.

"నేను నీతో హోటలుకు వస్తానని ఎలాగను కున్నావ్?" అన్నాడు ప్రతాప్.

"నేను కావాలనుకొంటే నాతో వస్తావు!" అంది మంగళ.

"అతను నిన్ను కావాలనుకోవడమా? జాహ్నవిలాంటి అందమైన అమ్మాయి అతణ్ని ప్రేమిస్తే జాతకాలు కలవలేదని కాదన్నాడు. పెద్దల మాటలేనిదే ఏ అమ్మాయి జోలికీ వెళ్ళడతను—" అన్నాడు శ్రీకాంత్.

"జాహ్నవి ఎవరు?" అంది మంగళ.

"జాహ్నవి ఎవరో చెప్పడానికైనా నీతో కొంత దూరం వస్తానులే—" అన్నాడు ప్రతాప్.

ఇద్దరూ ఆ ఇంట్లోంచి బయటపడ్డాక—"నేను నిన్ను కావాలనుకొంటున్నట్లు నలుగురికీ చెప్పకు. నేను శ్రీరామ చంద్రుడికంటె గొప్ప నీతిమంతుడనని ప్రజల్లో ఓ సదభిప్రాయముంది. అది పోగొట్టుకోవటం నాకిష్టముండదు—" అన్నాడు ప్రతాప్.

"జాహ్నవి ఎవరో చెప్పు—" అంది మంగళ.

"అవన్నీ తర్వాత చెబుతాను. ముందు నీ హోటలు గదికి వెళదాం—" అన్నాడు ప్రతాప్.

"అక్కడకు వెళ్ళి మధురిమను చూస్తే ఇంక నువ్వు నా ముఖం కూడా చూడవు—" అంది మంగళ.

"నీకా భయం అక్కర్లేదు—" అన్నాడు ప్రతాప్.

"ఎందుకని?"

"ఇందాకా నువ్వు జాహ్నవిని గురించి అడిగావు. సృష్టిలోని మొత్తం అందాన్నంతా భగవంతుడు జాహ్నవికే ఇచ్చేశాడు. మిగులూ తగులూ ఏదైనావుంటే మధురిమలాంటి వాళ్ళకు ఇచ్చి వుంటాడు. జాహ్నవికే చలించలేదు నేను. నీ మధురిమకు చలించను—"

"అంటే నేను అంగత్తెను కాదని ఒప్పుకొంటావన్న మాట!" అంది మంగళ.

"అందం సంగతలా వుంచు. రుచి సంగతి తీసుకో. తియ్యగావుండే పరవాన్నం కంటె కుంకుమ రసంలా వుండే బీరంటేనే ఎంతోమందికి మోజు. జాహ్నవి అందమైనదని అంతా అంటారు. కానీ నాకు నిన్ను చూస్తే కలిగిన ఆకర్షణ జాహ్నవిని చూస్తే కలగదు. నిన్ను చూడగానే కావాలనిపిస్తుంది. మనసు వశం తప్పుతుంది—"

ప్రతాప్ మాటలు మంగళకు చాలా ఆనందాన్ని కలిగించాయి. ఇద్దరూ హోటలు గది చేరుకొన్నారు. మంగళ ప్రతాప్‌ని మధురిమకు పరిచయం చేసింది.

* * *

"నువ్వు చాలా అదృష్టవంతుడివి. నా స్నేహితురాలి

మెప్పు పొందవు. ఆమెపై చూపే నీ ప్రేమ నిజాయితీని నిరూపించుకున్నావంటే నన్ను గెల్చుకొన్నట్లే!" అంది మధురిమ.

"గెల్చుకొని నిన్నేం చేసుకోను?" అన్నాడు ప్రతాప్ ఆశ్చర్యంగా.

మధురిమ దెబ్బతిన్నట్లు అతడివంక చూసి—"నిజంగా తెలియకే అడిగావా ఈ ప్రశ్న?" అంది.

"అవును మరి—నాకు కావలసింది మంగళ — నువ్వు కాదు—"

మధురిమ ప్రతాప్ వంక ఆశ్చర్యంగా చూసింది. మనిషి ఎంతో గొప్పగా, హుందాగా వున్నాడు. ఆ రెంటికీ తోడు గర్వం కూడా వున్నదా? అది గర్వమే అయితే సామాన్యమైన గర్వంకాదు. సమస్త పురుష ప్రపంచాన్నీ తనకు బానిసలుగా చేసుకోగల సామర్థ్యమున్న మధురిమను కూడా లక్ష్యం చేయనంతటి గర్వం!

"అంటే నువ్వు మంగళను నా కోసం కోరుకో లేదా?"

"నీ కోసం కాదు—నా కోసం కోరుకొన్నాను—"

మధురిమ బుగ్గలు కోపంతో ఎరుపెక్కాయి. మంగళ కిదంతా తమాషాగా వుంది. ఇలా జరుగుతుందని ఆమె అనుకోలేదు. ప్రతాప్ పై ఆమెకు మనసులో అభిమానం పెరగసాగింది.

"అయితే విను. నాకోసం కోరుకొన్న వాళ్ళకే మంగళ లభిస్తుంది—"

ప్రతాప్ ఓ క్షణం మధురిమను పరిశీలించి చూశాడు. తర్వాత మంగళను చూశాడు, మనసులో ఏదో

గణించుకొని నిట్టూర్చాడు. అప్పుడు మళ్ళీ మధురిమవంక చూసి—"మంగళను వదులుకోవటం కష్టమే! కానీ నిన్ను భరించలేను. ఆమెను వదులుకోక తప్పదు. సెలవు. సారీ మంగళా!" అంటూ గది వదిలిపెట్టాడతను.

మంగళ అసహాయంగా మధురిమవంక చూసింది. తన కోసం తనను ప్రేమించిన అపురూపమైన ఆ యువకుడిని వదులుకోవటం కష్టమేననిపించిందామెకు. అయితే తనేం చేయగలదు?

మధురిమ ఆవేశంతో పిడికిళ్ళు బిగించి సోఫాలో కూలబడి—"భీమసేన్!" అంది.

భీమసేనుడామె దగ్గరకు వచ్చి-"చెప్పండి మేడమ్!" అన్నాడు.

"అతను గుర్తున్నాడా?" అందామె.

"వున్నాడు—"

"అతను నా మనసు కష్టపెట్టాడు—"

"ఊఁ."

"ఊఁ ఏమిటి—వెళ్ళు!" అంది మధురిమ.

భీమసేనుడు గది వదిలిపెట్టాడు.

మంగళ కంగారుగా మధురిమవంక చూసి—"ఇప్పుడేమవుతుంది మధూ?" అని అడిగింది.

"నీకు సైన్సు తెలుసా?" అంది మధురిమ. మంగళ అడ్డంగా తలాడించింది.

"ఈ ప్రపంచంలోని ప్రతి వస్తువూ ప్రోటాన్లు, ఎలక్ట్రాన్లు, న్యూట్రాన్లు కలిసిన మిశ్రమం. అవి కంటికి కనిపించని సూక్ష్మకణాలు. భగవంతుడు ఆ సూక్ష్మకణాలను ఒక్కచోట చేర్చి మనుషులుగా తయారుచేశాడు. భీమ

సేచుడు మనుషుల్ని కణాలుగా మార్చేస్తాడు—" అంది మధురిమ.

మంగళ కంగారుగా—"మధూ—నీకతడిమీద అంత కోపమెందుకు?" అంది.

"అతడు కేవలం నన్నవమానించడానికి ఇక్కడకు వచ్చాడు—"

"లేదు—అతడి అభిరుచులు వేరనుకొంటాను. ఈ ఊళ్ళోనే జాహ్నవి అని ఒకామె వున్నదట. అందచందాల్లో ఏ ఆడదైనా ఆమె తర్వాతనేనట. అతడామెను కూడా కాదన్నాడట—" అంది మంగళ.

"అందచందాల్లో ఏ ఆడదైనా ఆమె తర్వాతనే అని ఎవరన్నారు? ఆ ప్రతాపే అయ్యుంటాడు. అవునా?" అంది మధురిమ. మంగళ తలాడించింది. "ప్రస్తుతానికి ఖాళీయేగదా—ఓసారి వెళ్ళి ఆమెను చూసివద్దామా?"

"ఆమె అడ్రసు నాకు తెలియదు—"

మధురిమ ఆలోచనలోపడింది. ఆమె ఏదో అనేలోగా గది తలుపు చప్పుడయింది.

"ఎవరయ్యుంటారు?" అంది మధురిమ.

"వెళ్ళి తలుపు తీసేదా?" అంది మంగళ.

"ఊఁ."

మధురిమ దృష్టి తలుపులవైపే సారించింది. మంగళ నెమ్మదిగా అడుగులు వేసుకొంటూ వెళ్ళి తలుపులు తీసింది.

ఒక యువకుడు చటుక్కున దురుసుగా లోపలకు ప్రవేశించాడు. మంగళకు అతడి ధోరణి అర్థంకాలేదు.

ఆమె అతణ్ణి ఆపాలనుకొంది. అతనే విసురుగా తలుపులు వేశాడు.

"ఎవర్నువ్వు?" అంది మంగళ.

"నా పేరు రామకృష్ణ—" అంటూ మధురిమవైపు నడిచాడు.

రామకృష్ణ అన్న పేరు వింటూనే మధురిమ సోఫాలోంచి లేచి నిలబడింది. ఒక అడుగు ముందుకుగానీ వెనక్కుగానీ వేయకుండా బొమ్మలా నిలబడిపోయింది.

ఈలోగా అతనామెను సమీపించాడు.

"నువ్వా?" అంది మధురిమ. ఆమె కళ్ళలో భయం స్పష్టంగా అగుపడుతోంది.

"అవును— నేనే!" అన్నాడతను. 'అతడి చూపులు క్రూరంగా వున్నాయి—"భీమసేనుడు పక్కన లేకుండా ఎప్పుడు దొరుకుతావా అని చూస్తున్నాను. ఇప్పటికి దొరికావు—"

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 5 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రీమీలో తమాషాలు

## అలక

"పట్నంనుంచి మనోడు జాబు రాసిండే లచ్చిమి" చెప్పాడు రాజయ్య.

"ఏమని రాసిండు?" సంతోషంగా అడిగింది లచ్చిమి.

"రూపాయలు పంపలేదని అలిగినట్టున్నాడు. పత్తా రాసి ఖాళీ ఉత్తరాన్నే పోస్ట్ చేసిండు" రాజయ్య జవాబిచ్చాడు.

—యన్. శివానంద్, బెల్లంపల్లి.

## పనసకాయ దొంగ?

ముగ్గురు దొంగలు ఓపళ్ళతోటలో దూరి ఎవరికి ఇష్టమైన పళ్ళు వారు కోయడం మొదలెట్టారు. ఇంతలో తోట యజమాని చాటుగా తన నౌకర్లతో వచ్చి వారిని పట్టుకున్నాడు.

"ఎవరు దొంగిలించిన పళ్ళను వాళ్ళే, నా కళ్ళముందే మింగాలి. అదే మీ అందరికీ సరయిన శిక్ష" కోపంగా అన్నాడు యజమాని.

వెంటనే ఒక దొంగ తాను దొంగిలించిన సపోటా పళ్ళను మింగేశాడు. రెండవ దొంగ తన దగ్గరున్న ఓ పెద్ద మామిడి పండు మింగబోతూ ఆగిపోయి పెద్దగా నవ్వడం ఆరంభించాడు. తోట యజమాని కేమీ అర్థం కాలేదు.

"వాడి ముఖం చూడండి ఎలా ఉందో? వాడు పనస కాయ దొంగిలించాడు లెండి"—మూడో దొంగవైపు చూపించి మళ్ళీ పొట్టపట్టుకుని నవ్వసాగాడు అతడు.

—డి. మహబూబ్ బాషా, ఆదోని.

